


# గాయత్రీ విజ్ఞానం

వైదిక సంధ్యావిధి సహితం




కర్త:

**సుమ్నార్థి**

(డా॥ కోడూరి సుబ్బారావు)

**గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ప్రచురణ**

# గాయత్రీ విజ్ఞానం

గాయత్రీ గ్రంథమాల: 45

ప్రతులు : 1000

సర్వస్వామ్యములు : గ్రంథకర్తవి

సృష్టి సంవత్సరం : 1,97,29,49,121

విక్రమాబ్దము : 2076

కలియుగ సంవత్సరం: 5121

శ్రీ వికారి నామ సం॥ర మార్గశీర్ష పౌర్ణమి 12-12-2019

**మూల్యము : 100/-** (తపాలా ఖర్చులు అదనము)

ప్రతులకు :

1. డా॥ కోదూరి సుబ్బారావు, వైదికవానప్రస్థాశ్రమం,
హనుమాపురం(B.O.); (Via.)భువనగిరి-508116. సెల్: 99089 94084.

2. గాయత్రీ ఆశ్రమ ట్రస్టు, ఆర్య సమాజము, 12-10-586/6,
మేడిబావి, సీతాఫలమండి, సికింద్రాబాద్-500 061.
సెల్: 98480 11073.

3. డా॥ మట్టి కృష్ణారెడ్డి, వేదధర్మ ప్రచార ట్రస్టు(రి.)., 2-27,ఆర్య సమాజ మందిరం,
బాదం కాంప్లెక్సు,చైత్యనపురి క్రాస్ రోడ్, దిల్‌సుఖ్‌నగర్.
హైదరాబాద్-60. సెల్: 94412 00322.

4. శ్రీ మాశెట్టి శ్రీనివాస్ ఆర్య, షాప్ నెం.5, మాశెట్టి బిల్డింగ్,
3-3-736-740, కంచరిబజార్, సికింద్రాబాద్, ఫోన్: 040-6632 0300.

5. శ్రీ బాశెట్టి సత్తయ్య, జె-38, రాంగోపాల్ పేట,
సికింద్రాబాద్-500003, సెల్ : 99485 39795.

6. ఆర్యసమాజము, కూచిపూడి, తెనాలి-522313.
సెల్:08644-252789.

7. ఆర్యసమాజ మందిరం, మెయిన్‌రోడ్, రైల్వే ఫ్లైఓవర్ దగ్గర,
సీతాఫలమండి. 500061. సెల్: 040-27071816;
9133134156, 9246174018



# గణపతికి స్వాగతము

ప్రజాపతిర్ఋషి : గణపతిర్దేవతా

శక్వరీ ఛందః ధైవతః స్వరః

**గణానాం త్వా గణపతిం హవామహే**
**ప్రియాణాం త్వా ప్రియపతిం హవామహే**
**నిధీనాం త్వా నిధిపతిం హవామహే**
**వసో మమ ఆహమజాని గర్భధమా**
**త్వమజాసి గర్భధమ్ ॥** (యజుర్వేదం. 23-19)

హే వసో! సమస్త బ్రహ్మాండములను, సమస్త ప్రాణిగణములను నీయందు వసింపజేసుకొనుచున్న ఓ పరమేశ్వర ! ప్రాణిగణములమధ్య గణములను పాలించు గణపతివైన నిన్ను ఆహ్వానించుచున్నాడను. మాకు ప్రియమైనవారిమధ్య అత్యంత ప్రియుడవగు నిన్ను ఆహ్వానించుచున్నాను. విద్యాధనాది నిధులమధ్య ఆ నిధులకు పతివైన నిన్ను ఆహ్వానించుచున్నాను. నాలో వసించి నన్ను ధర్మమార్గమున నడపి నన్ను నిధిపతిని చేయుము.

సమస్తమును నీ గర్భమున ధరించు నీవు అజుడవని - జన్మరహితుడవని నేను చక్కగా తెలిసికొందును గాక ! నీ యథార్థ స్వరూపము నుపాసించి జన్మమరణబంధన ములనుండి ముక్తుడనగుదును గాక !

స్తుతించు
సుమ్నార్థి
(కోడూరి సుబ్బారావు)



# నివేదన

నే నిదివరలో **'గాయత్రీ మహిమ'** అనే పేరుతో ఒక చిన్న పుస్తకాన్ని వ్రాసి ప్రచురించటం జరిగింది. అది మూడు పర్యాయాలు ముద్రితమై బహుళ ప్రజాదరణను పొందినది. **'వేదాంతభేరి'** అను మాపసత్రికలో సీరియల్‌గా ప్రచురింపబడింది. కొందరు మిత్రులు దానిని మరికొంత వివరిస్తే బాగుంటుందని సూచించారు. అందుచే యితర సాంప్రదాయికులు గాయత్రిపై వ్రాసిన వ్యాఖ్యానాలను చదివి చూడటం జరిగింది. వారు చెప్పిన విషయాలలో మంచిని గ్రహించి ఈ పుస్తకంలో చేర్చటం జరిగింది. అట్లే, వేద విరుద్ధమైన వాటిని సప్రమాణికంగా సరియైన అభిప్రాయాలు కావని చెప్పటం జరిగింది.

గాయత్రి, ఓంకారములపై జరిగిన వైజ్ఞానిక పరిశోధనలను, బుద్ధిని గురించి ప్రాచ్యపాశ్చాత్య విద్వాంసుల వైజ్ఞానిక ఆలోచనలను ఇందు చేర్చి **'గాయత్రీ విజ్ఞానం'** అనే పేరుతో ఈ పుస్తకం వ్రాశాను. **'బుద్ధివికాస మెంతవరకు?'** అనే విషయాన్ని చారిత్రిక కథలద్వారా వివరించ ప్రయత్నించాను. కొందరు సాంప్రదాయికులు వ్రాసిన సంధ్యావిధులు నాకు సంతృప్తికరంగా కనబడలేదు. అందుచే **'వైదిక సంధ్యావిధి'**ని ఇందుచేర్చి దానికి వైజ్ఞానిక వ్యాఖ్య వ్రాశాను. ఇవన్నీ కలిసి యిది **'గాయత్రీ విజ్ఞాన'** మయ్యింది.

శ్రీ మానుకొండ రాధాకృష్ణమూర్తిగారి ఆర్థిక సహకారంతో పం. ఆచార్య మట్టికృష్ణారెడ్డిగారి ముద్రాపణ పని సహకారంతో చాలాకాలం తరువాత ఈ రెండవ ముద్రణ చేయగలిగినాను. వీ రిద్దరికి నా హృదయపూర్వక ధన్యవాదాలు కృతజ్ఞతలు.

-సుమ్నార్థి

కోడూరి సుబ్బారావు (గ్రంథకర్త)

# ముద్రణ ద్రవ్యదాత

## శ్రీ మానుకొండ రాధాకృష్ణమూర్తిగారి సంక్షిప్త పరిచయము

శ్రీ మానుకొండ రాధాకృష్ణమూర్తిగారు గుంటూరు జిల్లాంతర్గత తెనాలి పట్టణంలో క్రీ.శ. 1943, జూన్‌లో జన్మించారు. వీరి తల్లిదండ్రులు స్వ॥ మానుకొండ వీరరాఘవమ్మ, స్వ॥ క్రిష్ణయ్య గార్లు. వీరు ధార్మికులు, శ్రమశీలులు, దానగుణములు గలిగిన, ఈ ఆదర్శ దంపతు వీరికి మొత్తం 11 మంది సంతానం. వారిలో మొదటగా వరుసగా 5 గురు ఆడపిల్లలు పుట్టారు. అందులో చివరి ఇరువురు బాల్యమునందే మరణించిన తరుపరి 6వ సంతానంగా శ్రీ మానుకొండ రాధాకృష్ణ మూర్తి గారు జన్మించిరి. వీరి తరువాత ఇద్దరు మొగపిల్లలు కలుగగా అందులో ఒకరు బాల్యములోనే మరణించిరి. అనంతరము ఒక ఆడపిల్ల, మరి ఇద్దరు మొగపిల్లలు కలిగిరి. దురదృష్టవసాత్తు తండ్రి క్రిష్ణయ్యగారు తమ 57 సం॥ వయస్సులోనే 1962లో అకాల మృత్యువాతబడిరి. అప్పటికి రాధాకృష్ణమూర్తిగారి వయస్సు 19 సం॥లు మాత్రమే. అప్పటికి మిగిలిన నలుగురు ఆడపిల్లలు, నలుగురు మొగపిల్లతో పెద్ద కుటుంబ బాధ్యత అంతా తల్లిగారైన వీరరాఘవమ్మగారిపై బడినది. మూర్తిగారు కుటుంబ బాధ్యతల నిర్వహణలో తల్లిగారికి సహకరిస్తూనే తన చదువును కొనసాగించిరి. తండ్రిగారి కోరికమేరకు తల్లిగారు మూర్తిగారి విమోకానికల్ ఇంజినీరింగు పూర్తి అయ్యేవరకు చదివించిరి. 1967 సం॥ నాటికి B.Sc., తరువాత B.E. (Mechanical)డిగ్రీతో చదువును ముగించారు.

అనంతరము మూర్తిగారు మినిస్ట్రీ ఆఫ్ డిఫెన్సులో ఉద్యోగము సంపాదించి గవర్నమెంట్ ఆఫ్ ఇండియా సంబంధిత ఆఫీసులలో పనిచేశారు. క్రమంగా సీనియర్ సైంటిస్ట్ అయ్యారు. ఆ విధముగా భారత ప్రభుత్వ రక్షణశాఖలో పని చేస్తూనే తన తమ్ముళ్ళు ముగ్గురికి వారి ఇష్టముల మేరకు సంతృప్తిగా చదివించిరి. దురదృష్టవగాత్తు తల్లిగారు తన 68 సం॥ వయస్సులో 1985 సం॥లో దివంగతులైనారు. అప్పటికి

మూర్తిగారి వయస్సు 42 సం॥లు తరువాత వారు శ్రమించి 1994లో మిగిలిన ఒక చెల్లెలికి పెళ్ళిచేశారు. 'దానితో తన తండ్రిగారి చివరి కోరిక "అందరు బాగుండాలి" అనే తన కోరికను పూర్తిచేసి పితృవాక్య పరిపాలకులయినారు. మూర్తిగారు మాత్రము నైష్ఠిక బ్రహ్మచారులుగానే ఇప్పటికి మిగిలి ఉన్నారు. అనంతరము శ్రీ రాధాకృష్ణమూర్తిగారు తమ తల్లిదండ్రులపేరున **'మానుకొండ వీరరాఘవమ్మ మరియు క్రిష్ణయ్యగార్ల మెమోరియల్ చారిటబుల్ ట్రస్టు'**ను 2006 సం॥లో స్థాపించిరి. అప్పటి నుండి వ్యవస్థాపక అధ్యక్షుడిగా ఆ ట్రస్టు పేరుతో అనేకమందికి అనేక రకములుగా ఆర్థిక సహాయము చేస్తూ వస్తున్నారు. ముఖ్యంగా వైదిక ధర్మ ప్రచారమునకు పాటుపడుచున్న పండితులకు, సంస్థలకు ఉదారంగా చేయూత నిస్తున్నారు. వైదిక గురుకులాలకు, విద్యార్థులకు ఫీజులతో మరియు రోగులకు మందుల రూపములో సహాయము చేస్తూ ఉన్నారు. పేద వృద్ధులకు నెలవారి పించనులు గాను, కళ్ళకు ఆపరేషన్లకు గాను, ఇలా సమాజానికి సేవలందిచుచున్నారు. అంతేగాక గోదావరి కృష్ణానదుల పుష్కరాల సందర్భంగా సుమారు 27 వేలమందికి తమ తల్లిదండ్రుల పేరుమీద అన్నప్రసాదవితరణ కావించారు.

తెనాలిలో ఆర్య సమాజ భవనమునకు, నందివెలుగు వృద్ధాశ్రమమునకు, రాయపూడి వైదిక ఆశ్రమమునకు విరివిగా సాయం చేస్తున్నారు.

ఇక వారి ఆధ్యాత్మిక క్షేత్రాన్ని పరిశీలించితే- శ్రీ రాధాకృష్ణమూర్తి గారికి 25 సం॥ల వయస్సులోనే తెనాలి పట్టణంలో 1967 సం॥లలో శ్రీ గానం రామారావు (రామదేవ్)గారి ద్వారా ఆర్య సమాజ సిద్ధాంతాలతో పరిచయం కలిగినది. ఆ వైదిక సిద్ధాంతాలు హేతుబద్ధం గానే కాక వైజ్ఞానికంగా కూడ ఉన్నాయని వీరు గ్రహించారు. శ్రీరామదేవ్‌గారే స్వయంగా, 'విద్వత్ శిరోమణి', 'షడ్దర్శనాచార్య', 'కళాప్రపూర్ణ' బిరుదాంకితులయిన పండిత గోపదేవ్‌శాస్త్రిగారితో పరిచయం చేశారు. ఆ గురుదేవుల ద్వారా వైదిక సిద్ధాంతాలను బాగుగా అవగాహన చేసుకున్నారు. వాటిపై శ్రద్ధ ఏర్పడినది. అప్పటినుండి 1996 లో శ్రీ శాస్త్రిగారు పరమపదించే వరకు తరచుగా గురువుగారిని కలుసుకుంటూ వారి జ్ఞానాన్ని మరింత విస్తృతం చేసుకున్నారు.

ప్రస్తుతం వీరు 76 సం॥ వయసులో ఆరోగ్యముగానే ఉన్నారు. హైదరాబాదునందుగల హైదర్‌నగర్ (మియాపూర్) ప్రాంతములో నివసిస్తున్నారు. ఎవరైనా మిత్రులు వారిని కలవటానికి వస్తే వారితో ఆధ్యాత్మిక, భౌతిక విషయాలు ప్రస్తావిస్తూ వైదిక సిద్ధాంతాలను సెంటిఫిక్‌గా విశ్లేషించి చెబుతూ, అవగాహన కలిగించుతూ జ్ఞాన బోధ చేసి పంపుతున్నారు.

అట్టి ఆదర్శ పురుషులకు సర్వవ్యాపక సర్వేశ్వరుడు శతాధిక ఆయువును ప్రసాదించుగాక! ఇదే ఉత్సాహంగా, మరెన్నోరకములుగా వైదిక ధర్మమునకు, సత్పాత్రులైన పేదలకు, విద్యావంతులకు సేవలందిస్తూ ఉందురుగాక! పరమాత్మ వారికి తగిన ఆయురారోగ్యములను ప్రసాదించునుగాక !

## శ్రీరాధాకృష్ణమూర్తిగారితో నా స్వంత పరిచయము-అనుభవము

శ్రీమాన్ మానుకొండ రాధాకృష్ణమూర్తిగారు, ఆర్యసమాజ క్షేత్రములో ఉన్న పండితులకు, ప్రచారకులకు అందరకు తెలిసినవారే.

సుమారు 10 సం॥ క్రిందట నేను ప్రస్తుతం నివసిస్తున్న "వైదిక వానప్రస్థాశ్రమము (భువనగిరి)నకు తన స్నేహితుడు శ్రీభావజుల సదానందాచారి గారితో కలిసి రాధాకృష్ణమూర్తిగారు రావటం జరిగినది. అప్పుడే నాకు వారితో ప్రథమ పరిచయం ఏర్పడినది. అనంతరం వారిని మా గాయత్రీ ఆశ్రమాని (సీతాఫల్‌మండి)కి వచ్చి చూసివెళ్ళమని నేను కొరడం, వారు వచ్చి వెళ్ళటం, అట్లాగే నేనును హైదర్‌నగరు హైదరాబాదులోని వారి నివాసం చూసి రావటం జరిగాయి.

ఆ పరిచయముతో వారు నావలెనే ఒంటరి జీవితం గడపటం ఇంటిపనులు, వంటపనులు-స్వయంగా చేసుకుంటూ ఆధ్యాత్మిక యౌగిక జీవితం గపడటం మొదలైన విషయాలను గుర్తించాను. దానితో నాకు వారిపై శ్రద్ధ ఏర్పడినది. వారికి కూడ నాపై అభిమానము అనుగ్రహముల కలిగాయి. దానితో నా స్వంత అవసరములను ఏదైనా ఆర్థిక సహాయము అవసరముంటే, నిస్సందేహంగా తనకు తెలుపమని అడిగిరి. తన శక్తికొలది సాయం చేస్తామన్నారు." అట్లే నాకు కంటి రెటీనా సమస్య వచ్చినప్పుడు, 2,3 పర్యాయముల ఆర్థిక సహాయము చేశారు.

సమస్య కొంత ఉపశమించిన తదుపరి నా జీర్ణశక్తి చాలా ఇబ్బంది పెట్టినది. దానితో వారు మరొక సారి స్పందించి తనకు వేరేవైద్యులవలన తగ్గిన కొన్ని బాధలు సిద్ధవైద్యంతో తగ్గాయని మీరు వెంటనే బయలుదేరి వస్తే ఆ వైద్యుని వద్దకు తీసుకొని వేళతాననీ అందుకు కావలసిన ఖర్చులు అన్ని నేనే భరించుతానని కొండంత భరోసా నిచ్చారు. అన్నట్లుగానే నన్ను ఎల్లారెడ్డి గూడ హైదరాబాదులో ఆ సిద్ధవైద్యుని వద్దకు తీసివెళ్ళి మందులు ఇప్పించారు. అందుకు అవసరమయిన డాక్టరు ఫీజులు, మందుల ఖర్చులు అన్నీ ఉదారంగా వారే భరించారు.

అంతేగాక, పునర్ముద్రణకు చాలా కాలంగా ఎదురుచూస్తున్న ఈ **"గాయత్రీ విజ్ఞానం"** పుస్తకాన్ని ముద్రించి ఇవ్వవలసినదిగా కోరినప్పుడు దానికి వెంటనే స్పందించి అంగీకరించారు. 1000 ప్రతులకు పూర్తి ఖర్చుని మిత్తం మొత్తం 42,000/- రూపాయలను వారు గాయత్రి ఆశ్రమ ట్రస్టుకు దానంగా ఇచ్చారు. ఇట్టివిశాల హృదయులయిన శ్రీరాధాకృష్ణమూర్తిగారికి నా హృదయపూర్వక ధన్యవాదములు, కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

సర్వవ్యాపక సర్వేశ్వరుడు వారికి శతాధిక ఆయువును, ఆరోగ్యమును, ఉత్సాహమును ఇచ్చి కాపాడుగాక ! మరెన్నో దాన ధర్మములు చేసి పుణ్యభాగులగునట్లు ప్రేరేపించునుగాక!

బుధజనవిధేయుడు

సుమ్నార్థి

డా.కోదూరి సుబ్బారావు

## దానవిశిష్టత

**గౌరవం ప్రాప్యతే దానాన్నతు విత్తస్య సంచయాత్ ।**
**స్థితిరుచ్చైః పయోదానాం పయోధీనామధః స్థితిః ॥ -గుణరత్నం**

**భావము:-** గౌరవం ధనాన్ని కూడబెట్టడం వలన రాదు. దానం వల్లనే కలుగుతుంది. గొప్పవాడే అయినా సముద్రునికి అధఃస్థితియే, మేఘానికే ఉన్నతస్థితి.

# ఈ 'గాయత్రీ విజ్ఞానం'లో

ప్రార్థన, నివేదన, దాతల పరిచయం - ముందు పుటలలో



చదువండి-చదివించండి

గాయత్రిని జపించి తరించండి



# గాయత్రీ విజ్ఞానం

ఓం భూర్భువః స్వః, తత్సవితుర్వరేణ్యం ।
భర్గో దేవస్య ధీమహి ।
ధియో యో నః ప్రచోదయాత్ ॥ – యజుర్వేదం (36–3)

## ఇది గాయత్రీ మంత్రం

**'యా గాయంతం త్రాయతే సా గాయత్రీ'** అని ఋషి వాక్కు. గానం చేసేవారిని అంటే జపం చేసేవారిని రక్షిస్తుందికనుక ఈ మంత్రానికి గాయత్రీ మంత్రమని పేరు వచ్చిందని ఋషులంటారు.

ప్రపంచ ఇతిహాసాలలో మన భారతీయ ఇతిహాసం అత్యంత ప్రాచీనమైనది. సుమారు 197 కోట్ల సంవత్సరాల చరిత్ర మన కుంది. మనం నిత్యం ధార్మిక కర్మలలో చెప్పుకునే సంకల్పాన్నిబట్టి యిప్పుడు సప్తమ వైవస్వత మన్వంతరంలోని యిరువది ఎనిమిదవ కలియుగం నడుస్తున్నది. ఒక్కొక్క మన్వంతరంలో 71 చతుర్యుగా లుంటాయి. అటువంటి 6 మన్వంతరాలు గడచిపోయాయి. 7వ మన్వంతరంలోనూ 27 చతుర్యుగాలు గడచిపోయాయి. ఇప్పుడు 28వ చతుర్యుగం నడుస్తోంది. ఈ చతుర్యుగంలో సత్య త్రేతా ద్వాపర యుగాలు పూర్తయ్యి, కలియుగంలో 5,120వ సంవత్సరం నడుస్తున్నది. మన్వంతరాల మధ్యలో ఉండే సంధికాలాలనుకూడా కలుపుకొని లెక్కలు కడితే ప్రథమ మానవసృష్టి జరిగి యిప్పటికి 197, 29, 49, 120 సంవత్సరాలు పూర్తయ్యాయి. (వికారి యుగాది నాటికి).

ప్రథమ మానవసృష్టి సమయంలోనే వేదాల ఆవిర్భావం ఈ భారతావనిపై జరిగింది. హిమాలయ పర్వతప్రాంత త్రివిష్టప పీఠభూమిపై ప్రథమ మానవ

సృష్టి జరిగింది. ఆ ప్రథమ మానవులలోని పరిణత బుద్ధి కలిగిన నలుగురు ఋషుల పవిత్ర హృదయాలలో అంతర్యామియైన పరమేశ్వరుడు నాలుగు వేదాలను ప్రకాశపరచాడు. వారే 'అగ్ని వాయు ఆదిత్య అంగిర' నామక ఋషులు. పూర్వ సృష్టిలో వారు చేసిన సత్కర్మలు, సాధనాతపస్సులే వారి కట్టి యోగ్యతను ప్రసాదించాయి. 10,589 మంత్రాలు గల ఋగ్వేదం అగ్నిఋషికి ; 1,975 మంత్రాలు గల యజుర్వేదం వాయు ఋషికీ, 1,875 మంత్రాలుగల సామవేదం ఆదిత్యఋషికీ, 5,977 మంత్రాలు గల అథర్వవేదం అంగిర ఋషికీ లభించాయి. ఈ మొత్తం మంత్రాల సంఖ్య 20,416. మంత్రాలన్ని ఉన్నా గాయత్రీ మంత్రాన్నే పరమమంత్ర మన్నారు మన ఋషులు. దీనికి కారణం - సద్బుద్ధి కొరకు చేసే ప్రార్థనే సర్వోత్తమమని వారభిప్రాయం.

వేదకాలంనుండి ఈ కలియుగ ప్రారంభంవరకు వేదసంస్కృతియే ప్రపంచమంతటా విస్తరించి యుండేది. భారతీయ సార్వభౌమ రాజ్యమే ప్రపంచము నేలుచుండేది. అందుచే ఆ కాలంలో గాయత్రీ జపం సర్వత్రా జరుగుచుండేది. బాలబాలికలకు 8,9 సంవత్సరాల ప్రాయంలోనే ఉపనయన సంస్కారం చేసి గురుకులాలకు పంపేవారు. గురుకులాలలో గురువులు వేదారంభసంస్కారం జరిపి గాయత్రీ మంత్రోపదేశం చేసేవారు. అప్పటినుండి వారు జీవించియున్నంత కాలం నిత్యం ఉదయ సాయం సంధ్యాసమయాలలో శక్తికొలది గాయత్రీజపం చేస్తుండేవారు. తద్వారా వారి బుద్ధి వికసించి విద్యావిజ్ఞానాలతో వర్ధిల్లేవారు. సత్కర్మలు చేయ ప్రేరణ పొంది ధర్మాత్ములయ్యే వారు. అభ్యుదయ నిఃశ్రేయసాలను పొంది ఆనందించేవారు. అందుచేతనే ప్రథమ స్మృతికర్తయైన మనుమహర్షి తన ధర్మశాస్త్రంలో- ఈ దేశ విద్వాంసులే ప్రపంచ గురువులనియు, ఈ దేశ రాజన్యులే ప్రపంచ చక్రవర్తులనియు, ఈ దేశ సదాచారమే ప్రపంచానికి ఆదర్శమనియు ఎలుగెత్తి చాటాడు -

శ్లో॥ ఏతద్దేశ ప్రసూతస్య సకాశా దగ్రజన్మనః ।
స్వం స్వం చరిత్రం శిక్షేరన్ పృథివ్యాం సర్వమానవాః ॥

- మనుస్మృతి 2-20 (139)

మహాభారతయుద్ధంలో పెక్కురు వీరులు, విద్వాంసులు మరణించటంతో పై పరిస్థితి క్రమంగా క్షీణించింది. స్వార్థ సామంతరాజులు ఈ దేశాన్ని ముక్కలు ముక్కలుగా చేసివేశారు. దానితో విదేశీయులు మన దేశాన్ని ఆక్రమించడానికి అవకాశం ఏర్పడింది. స్వార్థగురువులు మన అఖండ వేదసంస్కృతిని ముక్కలు ముక్కలుగా చేసి సాంప్రదాయాల నేర్పరచారు. దానితో ఐకమత్యం కరువయ్యింది. ఎట్లో భౌగోళిక స్వాతంత్ర్యం లభించిందికాని యింకా భావదాస్యం పోలేదు. ఆంగ్లమానస పుత్రులు ఆంగ్లేయులనే గురువులుగా నుపాసిస్తూవుంటే, అమాయకులైన సామాన్య ప్రజలు స్వార్థగురువుల వలలలో చిక్కుకొని వారి సాంప్రదాయిక బావులలో కూపస్థమండూకాలవలె జీవిస్తున్నారు. మధ్యకాలంలో **'స్త్రీ శూద్రా నాధీయాతాం'** అనే కల్పిత సూత్రాల ప్రచారంతో స్త్రీలు శూద్రులు వేదవిద్యలకు, గాయత్రీ ఉపదేశానికి దూరమైపోయారు. మిగిలిన అగ్రవర్ణాల పురుషులును గాయత్రీ జపం చేయటంలేదు. వారి గురువు లుపదేశించిన ఓం నమో నారాయణాయ, ఓం నమో భగవతే వాసుదేవాయ, ఓం నమఃశివాయ, హరే రామ హరే కృష్ణ... మొదలైన వాక్యాలనే మహామంత్రాలుగా భావిస్తున్నారు. వాటినే జపిస్తున్నారు. అవే మాకు ముక్తిని ప్రసాదిస్తాయనే భ్రాంతిలో ఉంటున్నారు.

కొద్దిమంది పూర్వాచార పరాయణులు సంధ్యావందనంలో గాయత్రిని స్మరిస్తున్నా వారి దృష్టిలో గాయత్రి ఒక దేవత. ఐదు వేరువేరు రంగులు కలిగిన ముఖాలతో, అనేక బాహువులతో పూజలందుకొనుచు భక్తుల కోరికలను తీర్చే ఒక స్త్రీదేవతామూర్తి. మరికొందరి దృష్టిలో గాయత్రి (సావిత్రి) అంటే ఆకాశంలో కనబడే సూర్యగోళం. ఆ దృష్టితోటే వారు గాయత్రీమంత్రంతో సూర్యునకు అర్ఘ్యప్రదానం చేస్తున్నారు. గాయత్రీ మంత్రంలోని **'సవిత'** పదం సర్వవ్యాపకుడు సర్వాంతర్యామి సృష్టికర్తయునైన పరమేశ్వరునకు వర్తిస్తుందని తెలియక ఈ పొరబాట్లు జరుగుతున్నాయి.

నే నొకసారి గాయత్రీమంత్ర ఆంగ్ల వ్యాఖ్యానంతో కూడిన ఒక లఘు గ్రంథాన్ని 70 సంవత్సరాలు వయసుగల ఒక వైద్యమిత్రున కిచ్చాను. వారు

దానిని చదివి చాలా బాగుందన్నారు. గాయత్రి ఒక వేదమంత్రమా ? స్త్రీదేవత కాదా ? నా కీ విషయం ఇంతవరకు తెలియదే ! అని ఆశ్చర్యం వ్యక్తపరచారు. వారు చిన్ననాటినుండియు గురుసేవా శుశ్రూషలు చేస్తూ బ్రహ్మచారిగా అనేక ఆశ్రమాలలో గడపిన నైష్ఠిక బ్రహ్మచారి. అట్టివారికే గాయత్రిని గురించి సరియైన అవగాహన లేకుంటే సామాన్యుల సంగతి వేరే చెప్పాలా ?

ఈ మధ్య గాయత్రీమంత్రాన్ని అనుకరిస్తూ అనేక గాయత్రీ మంత్రాల కల్పన జరుగుతోంది. గణేశగాయత్రీ, నృసింహగాయత్రీ, విష్ణుగాయత్రీ, శివగాయత్రీ మొదలైన 24 గాయత్రీమంత్రాల కల్పన చాలా కాలం క్రిందటనే జరిగింది. అవికాక, ఈ మధ్య కొందరు భక్తులు వారి గురువుల పేర్లతో గాయత్రీ మంత్రాలను కల్పిస్తున్నారు. ఉదాహరణకు – కర్నూలు జిల్లా బేతంచెర్ల గ్రామంలో పూదోట లింగమూర్తి స్వామి గారి మఠం ఒకటుంది. ఆ మఠస్వామి గారు వారి గురువుల పేర్లతో 'ఓం పూదోట రామాయ విద్మహే, శివరామాయ ధీమహి, తన్నో లింగ ప్రచోదయాత్' అనే వాక్యాలను రచించి, ఇది పూదోట గాయత్రీ మంత్రమని ప్రచారం చేశారు. వారి శిష్యుల కుపదేశించారు. ఇట్టివే గురువుల పేరుతో, క్రొత్త దేవీదేవతల పేర్లతో మరెన్నో గాయత్రీ మంత్రాల కల్పన జరుగుతోంది. ఈ స్థితిలో వేదాల ద్వారా సృష్టికర్తయైన పరమేశ్వరు డుపదేశించిన నిజమైన గాయత్రీమంత్రం మరుగున పడిపోతున్నది.

గాయత్రి విశ్వామిత్రుని శాపానికి గురయ్యిందనీ, ఆ శాపనివారణార్థం మరియొక మంత్రం ముందు జపించి అనంతరం గాయత్రీ జపం చెయ్యాలని కొందరి ప్రచారం. మరికొందరు శిరస్సహితంగా గాయత్రీ జపం చెయ్యాలంటున్నారు. **'ఓం ఆపో జ్యోతీ రసోమృతం బ్రహ్మ భూర్భువః స్వరోమ్'** అనే ఋషి వాక్యాలనే గాయత్రీ శిరస్సంటున్నారు. గాయత్రీ మంత్రం తరువాత శిరస్సని చెప్పబడే ఈ వాక్యాలను పలకాలంటున్నారు. కాని, మన ప్రాచీన శాస్త్రాలను పరిశీలించి చూస్తే యిట్టి నిర్దేశాలేవీ కనబడటం లేదు. కనుక యివన్నీ మధ్యకాలంలో గురువులు కల్పించి ప్రచారం చేసినవే.

కొందరు ఈ గాయత్రీ మంత్రానికి - **'గాధిపుత్రో విశ్వామిత్రః ఋషిః'** అని అంటున్నారు. కాని, వేద సంహితలలో ఈ మంత్ర ఋషి-**'విశ్వమిత్రః'** అని మాత్రమే ఉంది. శ్రీరాముని గురువైన విశ్వామిత్రుడే గాయత్రీ మంత్ర ఋషియని నిరూపించలేము. రామాయణానికన్న పూర్వ గ్రంథాలైన బ్రాహ్మణ ఆరణ్యక గ్రంథాలలోను,శాఖా గ్రంథాలలోను ఈ మంత్ర ఋషి విశ్వామిత్రుడని మాత్రమే నిర్దేశముంది. అందుచే వేదకాలంనాడే విశ్వామిత్రు డను పేరుగల ఒక ఋషి ఈ మంత్రార్థ ద్రష్టయై మంత్రార్థాన్ని లోకంలో ప్రచారం చేసి యుంటాడు. ఆ గాయత్రీ మంత్రాన్ని ఈ చతుర్యుగంలోని త్రేతాయుగంలో శ్రీరాముని గురువైన విశ్వామిత్రుడు జపించి సిద్ధిని బొంది-బుద్ధి వికాసాన్ని బొంది విజ్ఞానవంతుడై అద్భుతాలను చేసియుండవచ్చును.

ఇక శిరస్సనేది మంత్రం చివరకాక మొదట ఉండాలి. మరొక మంత్రాన్ని గాయత్రీ శిరస్సనే కన్న మంత్రంలోని మహావ్యాహృతులైన **'భూర్భువః స్వః'** అనే మొదటి పదములనే శిరస్సని చెబితే సమంజసంగా ఉంటుంది. ఈ పరిస్థితులలో గాయత్రిని గురించి సరియైన అవగాహన కలిగించాలనే సదుద్దేశముతో ఈ లఘుగ్రంథాన్ని ప్రచురించ సంకల్పించాము. ఏ కొద్దిమంది గాయత్రిని గురించి సరిగా అర్థం చేసుకున్నా మా యీ కృషి సఫలమైనట్లు భావిస్తాము.

ఇక మనం గాయత్రి అంటే ఏమిటి? ఆ మంత్రంలో ఉండే మూలార్థం ఏమిటి ? ప్రతీ పదంలో ఉండే ముఖ్యమైన అర్థాలు ఏమేమిటి ? అనే విషయాలను సంక్షిప్తంగా తెలుసుకొందాము.

## గాయత్రీ అనగా.......

గాయత్రీ అంటే వేదంలోని సప్త ఛందస్సులలో ఒకటి. మూడు పాదాలు కలిగి ప్రతీ పాదంలోనూ 8 అక్షరాలతో మొత్తం 24 అక్షరాలు గల పద్య ఛందస్సును గాయత్రీఛందస్సు అంటారు. ఒకటి రెండు అక్షరాలు తక్కువ ఉన్నా వ్యవహార సౌలభ్యంకోసం గాయత్రీ ఛందస్సుగానే చెప్పుకోవటం లోకవ్యవహారం. మన

ప్రార్థనా మంత్రమైన గాయత్రీ మంత్రంలో 23 అక్షరాలు మాత్రమే ఉన్నాయి. అందుచే యిది 'నిచృత్ గాయత్రీ' ఔతుంది. అంటే ఒక అక్షరం తక్కువగల గాయత్రి. అయినప్పటికీ యిది గాయత్రీ మంత్రంగానే ప్రసిద్ధిని పొందింది.

అక్షరాలను లెక్కించేటప్పుడు అచ్చులను, అచ్చుతోకూడిన హల్లులను మాత్రమే అక్షరాలుగా లెక్కిస్తారు. కేవలం హల్లులను (పొల్లు అక్షరాలను) అక్షరాలుగా లెక్కించరు. గాయత్రీ మంత్రంలో మొదట ఉచ్చరించే **'ఓం'** కారాన్నీ, **'భూర్భువః స్వః'** అనే మూడు మహావ్యాహృతులను ఈ లెక్కలోనికి తీసుకోరు. **'తత్సవితుర్వరేణ్యం'** అనే పదములతోటే గాయత్రీ మంత్రం ప్రారంభ మౌతుంది. దీనిలో మొదట **'తత్'** అను సర్వనామం రావటంచేత దానికి వాచ్యమైన పరమేశ్వర నిర్దుష్టలక్షణం గల మహావ్యాహృతులను కలిపి గాయత్రిని చెప్పుకోవటం అనాదిగా వస్తున్న ఆచారం. వాటితో బాటు పరమేశ్వరుని ముఖ్యనామమైన **'ఓం'**ను కూడా ముందు చెప్పుకోవటం జరుగుతోంది. గాయత్రీ మంత్రంలోని మొదటి పాదంలో తత్, స, వి, తుర్, వ, రే, ణ్యం అనే 7 అక్షరాలు మాత్రమే ఉన్నాయి. అందుచే సస్వర వేదపాఠం చేసే వేద పండితులు పింగళ ఛందః సూత్ర నియమముల ననుసరిస్తూ చివరి అక్షరమైన **'ణ్యం'**ను **'ణ్యఅమ్'** లేదా **'ణియమ్'** అను మాదిరిగా పలుకుతారు. కాని నిచృద్గాయత్రినికూడా గాయత్రిగానే లెక్కిస్తారు కనుక మనవంటి సామాన్యులు **'ణ్యం'** గానే పలుకవచ్చు.

## గాయత్రీ-త్రాయత్రీ

శతపథ బ్రాహ్మణం (14-8-25-7) లో గాయత్రీ పదం ఈ విధంగా నిర్వచింపబడింది - **'గాయంతం త్రాయతే'** **'గయాన్ ప్రాణాన్ త్రాయతే'** - గానం చేసేవారి ప్రాణశక్తిని రక్షిస్తుంది కనుక దీనికి గాయత్రీ మంత్రమని పేరు. బృహదారణ్యకోపనిషత్తులోనూ యిట్లే నిర్వచింపబడింది.

**"సా హైషా గయాంస్తత్రే, ప్రాణా వై గయాః,**
**తత్ ప్రాణాంస్తత్రే తద్యద్ గయాం స్తత్రే తస్మాద్**

గాయత్రీ నామ, స యామే వామూం సావిత్రీమన్వాహ,
ఏషైవ సా, స యస్మా అన్వా హ తస్య ప్రాణాంస్త్రాయతే ॥"

(బృ.ఉ.5.14.4)

గాయ + త్రీ అనే రెండు పదములు కలిసి గాయత్రీ పదం ఏర్పడుతుంది. గాయ పదం గయ వల్ల ఏర్పడుతుంది. గయ అంటే ప్రాణశక్తులు. ఈ మంత్ర జపంవల్ల ప్రాణశక్తులు రక్షింపబడతాయి. కనుక దీనికి గాయత్రీమంత్ర మనే పేరు వచ్చింది.

గాయత్రీ ధ్యానం అంటే వాస్తవంగా ప్రాణముల ఇంద్రియముల సంయమనం. ఆచార్యుడు శిష్యునకు (బ్రహ్మచారికి) వేదారంభ సంస్కారంలో ఉపదేశించే సావిత్రియే గాయత్రి. గాయత్రీ ఉపదేశమంటే ప్రాణరక్షణ చేయటమని భావం. ఆ బ్రహ్మచారి గాయత్రీ మంత్రంతో నూతన జీవితాన్ని ప్రారంభిస్తాడు.

సామాన్యంగా మన శరీరంలోని ప్రాణశక్తులు ఇంద్రియలోలతవల్ల ఖర్చయి పోతూవుంటాయి. అర్థభావనతో గాయత్రీజపం చేసేవారు అంతర్యామియైన సవితాపరమేశ్వరుని సద్బుద్ధి నిమ్మని ప్రార్థిస్తారు. ప్రార్థన కనుగుణంగా సంయమంతో జీవిస్తారు. ఆ ప్రయత్నంతో కూడిన ప్రార్థనను పరమేశ్వరుడు మన్నించి యింద్రియాలను నిగ్రహించగల ఆత్మబలాన్ని ప్రసాదిస్తాడు. తద్వారా వారి ప్రాణశక్తులు బలపడతాయి. ఆయురారోగ్యాలు వృద్ధి చెందుతాయి. ఆ విధంగా గాయత్రి వారిని రక్షిస్తుంది.

నాలుగు వేదాలలోను గాయత్రీ ఛందస్సుతో ఉన్న మంత్రాలు వేలకొలది ఉన్నాయి. అయినా ఈ మంత్రానికే గాయత్రీమంత్రమనే పేరు రూఢిగా (యోగరూఢిగా) అనాదిగా వస్తున్నది.

## సావిత్రీ మంత్రం

గాయత్రీ మంత్రాన్ని సావిత్రీమంత్ర మనియు అంటారు. దీనికి కారణం ఈ మంత్రదేవత సవిత కావటం. వైదిక పరిభాషలో మంత్రదేవత అంటే మంత్రంలో తెలుపబడిన విషయం (సబ్జెక్ట్ ఆఫ్ ది మంత్ర). మననం చేయతగిన వాటిని

మంత్రాలంటారు. మననం అంటే లోతుగా ఆలోచించటం. సామాన్యంగా వేదాలలో ఉండేవాటినే మంత్రాలంటారు. ఇవన్నీ లోతుగా ఆలోచించతగినవే. ఎంత లోతుగా (డీప్‌గా) ఆలోచిస్తే అంత వివరంగా ఆ మంత్రార్థం బోధపడుతుంది. వేదాలలో సవిత దేవతగా గల మంత్రాలు చాలా ఉన్నాయి. అయినప్పటికీ గాయత్రీమంత్రాన్నే సావిత్రీమంత్ర మనే వ్యవహారం కూడా అనాదిగా వస్తున్నదే. గోపథ బ్రాహ్మణ పూర్వార్థం (1/3)లో సావిత్రి వేదాల మాతగా 'వేదానాం మాతరం' అని చెప్పబడింది. దీని ఉపాసనవల్ల అనంత శ్రీ లభిస్తుందనియు చెప్పబడింది. ఇచట అనంత శ్రీ అంటే 'ముక్తి' అని గ్రహించాలి. సవితను గురించి ముందు పుటలలో వివరంగా తెలిసికొందాము.

## గురు మంత్రం

గాయత్రీమంత్రానికి గురుమంత్రమని మరొక పేరు. పూర్వపుటలలో తెలిసికొన్నట్లుగా - ప్రాచీనకాలంలో విద్యాభ్యాసం చేయవచ్చిన శిష్యులకు గురువులు వేదారంభ సంస్కారం చేసి గాయత్రీమంత్రోపదేశం చేసేవారు. అందుచే ఈ మంత్రానికి గురుమంత్ర మనే పేరొచ్చింది. ఇంతేగాక, ఈ మంత్రం పరమ గురువు పరమేశ్వరు డుపదేశించినదే కదా !

యోగదర్శనంలో పతంజలి మహర్షి చెప్పినట్లు (స ఏష) పూర్వేషామపి గురుః కాలేనానవచ్ఛేదాత్ - (1-26) పూర్వఋషులకు, ఆదిఋషులకు పరమేశ్వరుడే గురువు. అట్టి మూల గరువుయొక్క ఉపదేశం కనుక గాయత్రీ మంత్రాన్ని 'గురుమంత్ర' మన్నారు మన ఋషులు.

## జపమంత్రం - పరమమంత్రం

మన ప్రాచీన శాస్త్రాలలో అక్కడక్కడ గాయత్రీమంత్రాన్ని జప మంత్రమనీ, పరమమంత్రమనీ పేర్కొనటం కనబడుతుంది. ఈ మంత్రం వేదాల సారమనే భావంకూడా అక్కడక్కడ కనబడుతుంది. మనుమహర్షి తన ధర్మశాస్త్రంలో దీనికి వివరణ యిస్తూ ఈ విధంగా చెప్పారు.

శ్లో॥ అకారం చాప్యుకారం చ మకారం చ ప్రజాపతిః ।
వేదత్రయాన్నిరదుహద్ భూర్భువః స్వరితీతి చ ॥

ప్రజాపతియైన పరమేశ్వరుడు అకార, ఉకార, మకారముల కలయికతో (అ+ఉ+మ) ఏర్పడిన **'ఓ3మ్'** పదమును మరియు మహా వ్యాహృతులైన భూః భువః స్వః అను పదములను వేదాల నుండి పిండాడు.

శ్లో॥ త్రిభ్య ఏవ తు వేదేభ్యః పాదం పాదమదూదుహత్ ।
త దిత్యృచోஉస్యాః సావిత్ర్యాః పరమేష్ఠీ ప్రజాపతిః ।

–మనుస్మృతి (2–76, 77)

అట్లే, పరమేష్ఠీ ప్రజాపతియైన పరమేశ్వరుడు ఒక్కొక్క వేదం నుండి – ఋక్ యజుస్సామములనుండి ఒక్కొక్క పాదమును పిండి మూడు పాదములుగల సావిత్రీ (గాయత్రీ) మంత్రాన్ని నిర్మించాడు.

అంటే, ఆ వేదసారములను ఒక్కొక్క అక్షరంగా ఒక్కొక్క పాదంగా సంక్షిప్తపరచి ఉపదేశించినట్లు గ్రహించాలి. వేదాలు నాలుగు అయినప్పటికీ వాటిలోని మంత్రాలు మూడు విధాలుగా ఉంటాయి కనుక వాటిని వేదత్రయీ అంటారు. ఋక్కులు ఛందోబద్ధమైన పద్యాలుగా ఉంటాయి. యజుష్షులు గద్యాత్మకంగా–వచనాలుగా ఉంటాయి. సామములు గానాత్మకంగా – గీతాలుగా ఉంటాయి. అథర్వవేదంలోని మంత్రాలు కొన్ని పద్యాలుగా, కొన్ని గద్యాలుగా ఉంటాయి కనుక వాటినికూడా పై మూడింటిలో కలిపివేసి వేదత్రయిగా పేర్కొంటారు.

మన ఋషులు గాయత్రీ మంత్రాన్ని వేదత్రయీ సారంగా భావించి జపించతగిన మంత్ర మన్నారు. ఈ మంత్రజపంవల్ల బుద్ధి వికసించి మిగిలిన మంత్రాలలోని జ్ఞాన విజ్ఞానాలను చక్కగా తెలిసికోగలుగుతారు కనుక.

ఇంతేగాక, ఈ మంత్రంలో స్తుతి ప్రార్థనోపాసనలు మూడూ కలిసి న్నాయి. మొదటి పాదమైన 'ఓం భూర్భువః స్వః, తత్సవితుర్వరేణ్యం'లో

పరమేశ్వరుని విస్పష్టమైన స్తుతి ఉంది. రెండవ పాదమైన 'భర్గో దేవస్య ధీమహి'లో ధ్యానము, ఉపాసన ఉన్నాయి. మూడవ పాదం 'ధియో యో నః ప్రచోదయాత్'లో వికసితమైన సద్బుద్ధి నిమ్మనే ప్రార్థన ఉంది. అట్టి బుద్ధి ఉంటే అభ్యుదయాన్ని నిశ్శ్రేయసాన్ని (మోక్షాన్ని) కూడా పొందగలుగుతాం. ఇంతకన్న మానవుడు పొందగలిగే దేముంటుంది ? కనుక మహర్షులు దీనిని విశేషంగా జపించవలసిన పరమమంత్ర మన్నారు.

మన ప్రాచీన యితిహాసాలైన రామాయణ మహాభారతాదులలో రామలక్ష్మణులు, శ్రీకృష్ణుడు, ఋషులు పరమమంత్రాన్ని జపించినట్లు వర్ణనలున్నాయి. **'వీరౌ జేపతుః పరమం జపమ్', 'జపేత్ పరమం మంత్రం' 'ఋషయో నిత్యసన్ధ్యత్వాద్దీర్ఘ మాయురవాప్నువన్'** అను వాక్యాలు కనబడతాయి. పరమమంత్ర మంటే ఉత్తమోత్తమ మంత్రమని భావం. బృహదారణ్యకోపనిషత్తు మాండూక్యోపనిషత్తు మొదలైన ఉపనిషత్తులలో గాయత్రీమంత్ర జపంవల్ల కలిగే ఆధ్యాత్మిక ప్రయోజనం ఎంతగానో కొనియాడబడింది.

గాయత్రీ జపంవల్ల ఆధ్యాత్మిక ప్రయోజనంతోబాటు కొంత భౌతిక ప్రయోజనం కలుగుతుందని చెప్పవచ్చు. ఇందుకు కొన్ని వైజ్ఞానిక ఆధారాలు కనబడుతున్నాయి. శ్రీ సుధాంశు మహరాజ్‌గారు ఒక విషయం చెబుతూవుంటారు – "ఒక జర్మన్ సైంటిస్టు ఒక విచిత్రమైన ధ్వని ప్రకంపన గ్రాహక యంత్రాన్ని నిర్మించాడు. దాని ముందు ఎవరైనా మట్లాడితే – పాడితే దాని కనుగుణంగా టేప్‌రికార్డర్, ఏంప్లిఫయిర్‌లలో ఉండే డెసిబుల్ స్కేల్ మాదిరిగా లైట్లు వెలుగుతాయి. డెసిబుల్ స్కేల్‌లో ధ్వనియొక్క హెచ్చుతగ్గులు మాత్రమే సూచింపబడతాయికాని మధురత, కఠోరత గుర్తింపబడవు. జర్మన్ సైంటిస్టు నిర్మించిన యంత్రంలో మాధుర్యతయొక్క హెచ్చుతగ్గులు మాత్రమే సూచింప బడతాయి. ఆ యంత్రం ముందు పురుషుల మాటలు 155 ప్రకంపనాలను కలిగించగా, స్త్రీల మాటలు 225 ప్రకంపనాలను కలిగించాయి. మాట్లాడేవారి వాణిలోని మధురతను బట్టి ఈ ప్రకంపనాలు కొద్ది హెచ్చు తగ్గులుగా ఉంటాయి. మధురంగా కూసే కోయిలముందు ఆ యంత్రాన్ని ఉంచగా 500 ప్రకంపనాలు కలిగాయి. అదే

యంత్రం ముందు స్పష్టమైన ఉచ్చారణగల దక్షిణ దేశపు వేదపండితునిచే గాయత్రీ మంత్రాన్ని పఠింపచేయగా 700 ప్రకంపనాలు కలిగాయి. వేరే మంత్రాలు గాయత్రీ మంత్రం కలిగించినన్ని ప్రంకపనాలను కలిగించలేదు. దానితో సైంటిస్టులు గాయత్రిలోని అక్షరాలలో ఏదో అద్భుతమైన భౌతికశక్తి దాగి ఉన్నట్లు అభిప్రాయపడుతున్నారు. కనుక ఈ మంత్రాన్ని ఉచ్చరించేవారికీ, శ్రవణం చేసేవారికీ వారి శరీరంలోనూ, మనస్సులోనూ మంచి పరిణామమే కలిగించ గలదని మనం ఊహించవచ్చు" నంటారు. ఆయన యింకా ఇలా అన్నారు.

"గాయత్రీమంత్రాన్ని ఉచ్చరించకున్నా, ఇతరులు ఉచ్చరిస్తున్నపుడు, చదువుతున్నపుడు వినే వ్యక్తిపై కూడా దీని ప్రభావం ఉంటుందని ఆ జర్మన్ శాస్త్రవేత్త అన్నాడు. అతడు యంత్రాలతో కూడిన ఒక చిన్న మానవాకారాన్ని తయారుచేశాడు. ఆ ఆకారానికి చిన్న చిన్న లైట్లను అమర్చాడు. ఆ యంత్రం ముందు ఎవరైనా వ్యక్తి నిలుచుని మాట్లాడితే ధ్వనిలోని హెచ్చుతగ్గుల ననుసరించి ఆ లైట్లు వెలుగుతాయి. విచిత్రం ఏమంటే ఆ మానవయంత్రం ముందు ఒక వ్యక్తి నిలుచుని గాయత్రీమంత్రం చదివితే కాళ్ళ నుండి తలదాకా గల ఆ యంత్రంలోని లైట్లన్నీ ఒక్కసారిగా వెలగటం ప్రారంభించాయి. ప్రపంచంలోని ఏ మంత్రం చదివినా లేదా ఏ రకమైన సంగీత ధ్వనులు వెలువడినా ఆ యంత్రంలోని మొత్తం లైట్లన్నీ ఒక్కసారిగా వెలగలేదని ఆ శాస్త్రవేత్త అన్నాడు. గాయత్రీ మంత్రోచ్చారణలో వెలువడే వైబ్రేషన్స్ అద్భుతమైనవి కనుకనే కేవలం ఆ మంత్రం చదివినప్పుడే లైట్లన్నీ వెలుగుతున్నా యన్నాడు. ఈ పరిశోధన ఆధారంగానే ప్రసిద్ధ ఆధునిక తత్త్వవేత్త ఒకరు హరిద్వార్‌లో యిలాంటి యంత్రాన్ని తయారుచేసి ప్రదర్శించారు. గాయత్రీ మంత్రం ఒక భౌతిక యంత్రం మీదనే యింత ప్రభావం చూపిస్తే మానవ శరీరంమీద మరెంతో ప్రభావం చూపించగలదని ఆ తత్త్వవేత్త అన్నారు. దీనిని బట్టి గాయత్రీ మంత్ర మెంత శక్తివంతమైనదో మీరు అంచనా వేయవచ్చు. గాయత్రీ మహిమను గురించి ఎంత చెప్పినా తక్కువే" అన్నారు.

ఆయుర్వేద విద్వాంసులును గాయత్రీ మహిమను గుర్తించారు. ఆయుర్వేదంలో చరకసంహిత ఒక మహాగ్రంథం. దానిలో ఆ ఋషి ఈ విధంగా వ్రాశారు. "లోకం, ప్రజలూ నేను వ్రాసిన ఔషధయోగాలను విశ్వసిస్తున్నారు.

ట్లే, నా యీ మాటలను కూడా విశ్వసించాలి. ఒక వ్యక్తి ఒక సంవత్సరం బ్రహ్మచర్యాన్ని పాటిస్తూ, ఆవులను మేపుకుంటూ, గాయత్రీజపం చేస్తూ ఆవుపాలు త్రాగుతూ సంవత్సరం పూర్తవుతుందనగా ముందు మూడు దినములు ఉపవాసం చెయ్యాలి. ఉపవాసం తరువాత వీలైనంత ఎక్కువగా గాయత్రీ జపం చెయ్యాలి. ఉపవాసం తరువాత ఉసిరిక చెట్టునెక్కి ఎన్ని ఉసిరికలు (పెద్ద ఉసరికాయలు) తినగలిగితే అన్ని ఉసిరికలు తినాలి. ఎన్ని తింటాడో అన్ని సంవత్సరాలు అతని ఆయువు పెరుగుతుంది. ఈ విధంగా కాయకల్పవిధానం (చికిత్స) తెలుపుచున్నా"నని వ్రాశారు. ఇది ఒక అద్భుతమైన చికిత్స. చరిత్రను పరిశీలిస్తే కొందరు ఈ కాయకల్ప విధానాన్ననుసరించి అద్భుతమైన లాభాలను పొందారు. వారిని చూసి ఆధునిక వైద్యులు ఆశ్చర్యపోయారు. వివరాలకు మా ప్రచురణ 'వేదాలలో అశ్వినీదేవతలు' అనే పుస్తకం చదువగోరుచున్నాము.

కాయకల్ప చికిత్సలో భౌతిక స్థూల శరీరంతోబాటు సూక్ష్మ కారణ శరీరాలు కూడా చికిత్సించబడతాయి. అందుకు అర్థభావనతో గూడిన గాయత్రీజపం ఎంతగానో ఉపకరిస్తుంది. ఇది ప్రాణశక్తులను బలపరుస్తుంది. దీర్ఘజీవనాన్ని ప్రసాదిస్తుంది.

ముందుగా మనం గాయత్రీ మంత్ర పదములలోని విశేషార్థాన్ని తెలుసుకొని అనంతరం మరికొన్ని విశేషాలను, విశిష్టతలను తెలిసికొందాము.

## గాయత్రీ విశిష్టత

ప్ర గాయత్రేణ గాయత పవమానం విచర్షణిమ్ ।
ఇన్దుం సహస్రచక్షసమ్ ॥

ఋగ్వే. 9.60.1

**భావము:-** గాయత్రీమంత్రముతో పరిశుద్ధ కర్మ నిర్దేశకుడు, మనలను కనిపెట్టి చూచువాడు, పరమ ప్రతిష్ఠితుడు, యశస్వియు, పరమ సుఖ దాతయునైన ఈశ్వరుని యొక్క గుణగానము నధికముగా జేయుము.

# గాయత్రీ మంత్రము

(గురు మంత్రము, సావిత్రీ మంత్రము, పరమ(శ్రేష్ఠ) మంత్రము)

ఋషి : విశ్వామిత్రుడు - దేవత : సవిత

ఛందస్సు : గాయత్రీ - స్వరము : షడ్జము

**ఓ3మ్ భూర్భువః స్వః ।**

**తత్సవితుర్వరేణ్యమ్ ॥**

**భర్గో దేవస్య ధీమహి ।**

**ధియో యో నః ప్రచోదయత్ ॥**

(ఋ. 3-62-10 ; యజు. 3-35, 22-9, 30-2, 36-3; సామ. 2462 ; అనేక సంహితా బ్రాహ్మణ ఆరణ్యకములు)

**భావార్థము:** ఓ రక్షక ! సచ్చిదానంద స్వరూప ! జగదుత్పాదక దేవ! నీ దివ్యగుణయుక్తము వరేణ్యమునగు శుద్ధ విజ్ఞానస్వరూపమును మేము నిత్యము మా హృదయమున ధ్యానింతుము గాక ! నీవు మా బుద్ధిని వికసింపజేసి సత్కర్మల యందు ప్రేరేపింతువు గాక ! మే మా బుద్ధి సహాయమున సద్వ్రతముల నాచరించి అభ్యుదయ నిఃశ్రేయసముల నందుదుము గాక !

ప్రతి పదార్థము:

ఓ3మ్ = పరమేశ్వరుడు సర్వ సంరక్షకుడు

భూః = సత్ స్వరూపుడు (ఉనికి గలవాడు), ప్రాణములకన్న ప్రియమైనవాడు

భువః = చిత్ స్వరూపుడు (జ్ఞాన స్వరూపుడు), సర్వదుఃఖవినాశకుడు

స్వః = ఆనంద స్వరూపుడు, మోక్షానంద ప్రదాత

తత్ = ఆ సచ్చిదానంద స్వరూప

సవితుః = సృష్టి కర్త యొక్క

వరేణ్యం= వరింపదగిన

భర్గః = సర్వక్లేశనాశక శుద్ధ స్వరూపమును

దేవస్య = ఇట్టి అనేక దివ్యగుణములు గల దేవదేవుని యొక్క దివ్యస్వరూపమును

ధీమహి = (మేము నిత్యము మా హృదయమున) ధ్యానింతుము గాక!

యః = ఆ పరమేశ్వరుడు

నః ధియ= మా బుద్ధులను

ప్రచోదయాత్= సత్కర్మలయందు ప్రేరేపించి మమ్ము అభ్యుదయ నిః శ్రేయసములను పొంద సమర్థవంతులను చేయును గాక !

**గమనిక:**–ధియో యోనః ప్రచోదయాత్ వీటిని విడదీస్తే ధియః + యః + నః+ ప్రచోదయాత్ అవుతుంది. (పదవిభాగం చేస్తే) అనంతరం ఈ మంత్రభాగాన్ని వచనక్రమంలో పెడితే– యఃనఃధియః ప్రచోదయాత్" అవుతుంది

# ఓ౩మ్

వేదాలలో పరమేశ్వరునకు వందకు పైగా పేర్లు కనబడతాయి. 'ఏకం సత్ విప్రా బహుధా వదంతి' (ఋ. 1-164-46) - పేర్లెన్నివున్నా దేవుడొక్కడేననీ, ఈ పేర్లన్నీ భగవంతుని వివిధ గుణగణాలను తెలిపేవేననీ వేదం స్పష్టంగా చెబుతుంది. అయితే వీటిలో దేవుని అసలు పేరేమి ? అనే జిజ్ఞాస కలగటం సహజం. దానికి సమాధానంగా ఋషులు **'తస్య వాచకః ప్రణవః'** (యోగ ద. 1-27) - ప్రణవమే - ఓం నామమే అతని అసలు పేరన్నారు. **'తజ్జపస్తదర్థ భావనమ్'** (యోగ ద.1-28) ఆ నామమునే అర్థభావనతో జపం చేయమన్నారు. దానికి కారణమేమంటే ఆ నామమే జీవునికీ దేవునికీ మధ్య ఉండే అసలైన సంబంధాన్ని తెలుపుతుంది.

**'ఓం'** పదము **'అవ'** అను మూల సంస్కృత ధాతువుతో నిర్మితమౌతుంది. **'అవ'** ధాతువులో రక్షణ, గతి, కాంతి, ప్రీతి..... మొదలైన 23 అర్థాలున్నాయి. వీటిలో మొదటి అర్థం **'రక్షణ'** అనేదే ప్రధానమైనది. పరమేశ్వరుడు మనకు రక్షకుడు (గార్డియన్). జీవాత్మలమైన మనం జనన మరణములు లేని అనాది తత్వం. తల్లి మనకు శరీరాన్ని నిర్మించియిచ్చిందేకాని జీవాత్మలమైన మనకు జన్మనివ్వలేదు. అట్లే దేవుడు కూడా తల్లి గర్భంలో మనకు శరీరాన్ని నిర్మించి యిచ్చాడేకాని మనను క్రొత్తగా పుట్టించలేదు. తల్లి తండ్రి మొదలైన సంబంధాలన్నీ కేవలం వ్యవహారం కోసమే. **'దేవుడు రక్షకుడు, మనం రక్షితులం'** అనేదే అసలైన సంబంధం. ఆ సంబంధాన్నే ఓం పదం తెలుపుతుంది.

బాల్యంలో తల్లి మనను సంరక్షించినట్లే జీవితపర్యంతం - జన్మ జన్మాంతరాలలోను దేవుడే మనకు రక్షకుడుగా'-సంరక్షకుడుగా ఉంటాడు. సంస్కరించుటకై తల్లి దండించునట్లే దేవుడు మనను దండిస్తాడు. ఆ దండన వెనుక ద్వేషం ఉండదు. అంతర్యామియై మన ఉన్నతి కొరకు సత్కర్మలయందు

ప్రేరణను, దుష్కర్మలయందు భయాందోళనలను కలిగిస్తూ సదా మనకు రక్షకుడై యుంటాడు. **'సత్కర్మల ఫలం సుఖం, దుష్కర్మల ఫలం దుఃఖం'** అనేది ప్రకృతిలో నెలకొన్న శాశ్వత నియమం. ఈ నియమాన్ని గుర్తించిన వివేకవంతుడు అంతర్యామి ప్రేరణల ననుసరించి సదా సత్కర్మల నాచరిస్తాడు. దుష్కర్మలకు దూరంగా ఉంటాడు. ఈ విధంగా పరమేశ్వరుడు సదా మనకు మార్గదర్శనం చేస్తూ రక్షిస్తున్నాడు. కనుక అతడే మనకు నిజమైన రక్షకుడు.

మనం తల్లి చెంత చేరేటప్పుడు ఆమెను అందరూ పిలిచే పేరుతోగానీ, ఆమె గుణకర్మలను తెలుపు నామములతో (డాక్టర్, టీచర్, మేడమ్, మొ॥ పేర్లతో) గాని పిలువక **'అమ్మా'** అనే కమ్మని పిలుపుతో ఆమెకు దగ్గరౌతాము. అట్లే, భగవంతుని చేరగోరు మనం అతని గుణకర్మలను తెలిపే అనేక పేర్లున్నా **'ఓం'** నామముతో 'ఓ సర్వ సంరక్షకా ! నా రక్షకా ! అంటూ సులువుగా అతనిని చేరుకోవచ్చు. పరమేశ్వరుడు వేదంలో **'ఓమ్ క్రతో స్మర'** (యజు. 40-15) ఓ కర్మశీల మానవా ! నన్ను **'ఓం'** అని స్మరించమన్నాడు - పిలువమన్నాడు.

భాషా శాస్త్రాన్నిబట్టి చూచినా ఓం పదంలో గొప్ప అర్థముంది. అ, ఉ, మ అనే మూడక్షరాలు కలిసి **'ఓం'** పద మేర్పడుతుంది. ఈ మూడక్షరాలు పరమేశ్వరుని మూడు ముఖ్య శక్తులైన సృష్టి స్థితి లయాలను సూచిస్తాయి.

**'అ'** అనే అక్షరాన్ని పలికేటప్పుడు నోరు బాగా తెరుచుకుంటుంది. స్వరపేటిక నుండి (గొంతునుండి) ధ్వని వెలువడుతుంది. ఇది భగవంతుని సృష్టిరచనా ప్రారంభాన్ని తెలుపుతుంది. అన్ని భాషలలోను ఇదే మొదటి అక్షరం. ఈ శక్తినే వేదాలు సవిత పదంతో చెబుతాయి. పురాణాలు బ్రహ్మగా పేర్కొంటాయి.

**'ఉ'** ను ఉచ్చరించేటప్పుడు నోరు తెరచుకొనియుండియే పెదవులు గుండ్రంగా వంగుతాయి. స్వరపేటిక నుండి వెడలేగాలి నోరంతా ప్రవహించి బయటకు వెడలుతుంది. ఇది భగవంతుని సృష్టిపాలక గుణాన్ని తెలుపుతుంది. ఈ శక్తినే వేదాలు ప్రజాపతిగా పేర్కొంటాయి. పురాణాలు విష్ణు వన్నాయి.

**'మ'** ను పలికేటప్పుడు పెదవులు మూసుకుంటాయి. ఇది భగవంతుని సృష్టి ముగింపును సూచిస్తుంది. ఈ శక్తినే వేదాలు రుద్రు డంటాయి. పురాణాలు మహేశ్వరుడంటాయి.

మహర్షి దయానంద సరస్వతీ స్వాములవారు తమ జగత్ప్రసిద్ధ 'సత్యార్థ ప్రకాశం'లో బ్రాహ్మణ ఆరణ్యక గ్రంథాల ఆధారంగా పై అ, ఉ, మ అనే మూడక్షరాలలో మరెన్నో నామాలు, అర్థాలు ఇమిడి ఉన్నట్లు వివరించారు. **'అ'** లో విరాట్-అగ్ని- విశ్వుడు మొదలగు నామాలు

'ఉ' లో హిరణ్యగర్భుడు-వాయువు-తైజసుడు మొ॥ నామాలు

'మ' లో ఈశ్వరుడు-ఆదిత్యుడు-ప్రాజ్ఞుడు మొ॥ నామాలు యిమిడి ఉన్నాయి.

**'విరాట్'** అంటే విశ్వాన్నంతా ప్రకాశింపచేసేవాడనీ, **'అగ్ని'** అంటే స్వయం ప్రకాశకుడై తన జ్ఞాన ప్రకాశంతో జీవులకు మార్గదర్శనం చేసేవాడనీ అర్థం. విశ్వంలోని సమస్త పదార్థాలలోను లోపల బయట అంతట అన్నిట వ్యాపించి యుంటాడుకనుక అతనిని **'విశ్వుడు'** అన్నారు.

హిరణ్యం అంటే జ్యోతి యని అర్థం. జ్యోతిర్మయ సూర్యాది గోళాలను తనలో కలిగియున్నందున పరమేశ్వరునకు **'హిరణ్యగర్భు'** డని పేరు.**'జ్యోతిర్వై హిరణ్యం, తేజో వై హిరణ్యం'** అని బ్రాహ్మణ గ్రంథాలు వివరిస్తాయి. **'వాయు'** వంటే గతి వంతమైనది, బలవంతమైనది యని అర్థం. భగవంతునికన్న బలవంతు డెవరుంటారు ? 'తైజసు, డంటే సూర్య నక్షత్రాదులకు తేజస్సునిచ్చు పరమేశ్వరుడని అర్థం.

**'ఈశ్వరు'** డంటే ఈ సమస్త విశ్వాన్ని తన ఐశ్వర్యంగా గలవాడనీ, **'ఆదిత్యు'** డంటే ఖండితముకాని, నశించని శాశ్వత పదార్థమనీ, **'ప్రాజ్ఞు'** డంటే విశిష్ట జ్ఞానవంతుడై సర్వము నెరుగువాడనీ అర్థాలు. ఇవన్నీ ఏకేశ్వరుని నామాలే. వేరు వేరు దేవుళ్ళ పేర్లు కావు.

దర్శన ఉపనిషదాదులు **'ఓమ్'** నామాన్ని **'ప్రణవ'** మనీ, **'ఉద్గీథ'** మనీ కూడా అంటాయి. ప్రణవ మంటే విశేషంగా స్తుతించదగినది, కీర్తించతగినది అని అర్థం. మనం విశేషంగా కీర్తించతగినది ఓం నామాన్నే యని భావం. **'ఉద్గీథ'** మనే పదంలోనూ యిదే అర్థముంది. పెద్దగా గొప్పగా కీర్తించబడేది యని భావం. సమస్త వేదాలసారమే ఓం అంటుంది. కఠోపనిషత్తు -

**సర్వే వేదా యత్ పద మామనంతి ।**
**తపాంసి సర్వాణి చ యద్ వదంతి,**
**యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి**
**తత్తే పదం సంగ్రహేణ బ్రవీమి+ ఓమ్+ ఇతి+ఏతత్ ॥**

ఋగ్వేదాది చతుర్వేదాలు ఏది పొందదగినదిగా పలుమార్లు బోధిస్తున్నాయో, తపస్వులందరు దేనిని గురించి గొప్పగా చెప్పుచున్నారో, దేనిని పొందగోరుచూ ముముక్షువులు బ్రహ్మచర్యాన్ని పాటిస్తారో దానిని నీకు సంగ్రహంగా చెప్పుచున్నాను. ఓ నచికేతా ! అది ఓ3మ్ నామక పరమ పదమే.

**ఏత ద్ధ్యేవాక్షరం బ్రహ్మ ఏత దేవాక్షరం పరమ్ ।**
**ఏత ద్ధ్యేవాక్షరం జ్ఞాత్వా యో య దిచ్ఛతి తస్య తత్ ॥**

**'ఓమ్'** అను పదముచే చెప్పబడే పరమాత్మతత్త్వం నాశం లేనిది. అన్నిటికన్న గొప్పది. అన్నిటికన్న సూక్ష్మమైనదికూడా. అట్టి ఈ పదమును సరిగా ఉన్నది యున్నట్లుగా తెలుసుకొని ఉపాసించేవాడు తను సంకల్పించినది పొందగలడు.

**ఏత దాలంబనం శ్రేష్ఠమ్ ఏత దాలంబనం పరమ్ ।**
**ఏత దాలంబనం జ్ఞాత్వా బ్రహ్మలోకే మహీయతే ॥**

- కఠోపనిషత్తు (2-15, 16, 17)

ఈ **'ఓ3మ్'** నామక ఆలంబనమే శ్రేష్ఠమైనది. అదియే ఉత్కృష్టమైనది. దానిని తెలిసికొని ధ్యానించువాడే బ్రహ్మసాక్షాత్కారము నొంది ఆనందమగ్నుడు కాగలడు.

పై విధంగా కఠోపనిషత్తు కీర్తిస్తుంటే, సమస్త భూతాల సారము ఉద్గీథమే - ఓంకారమే నంటుంది ఛాందోగ్యోపనిషత్తు -

**ఏషాం భూతానాం పృథివీ రసః,**
**పృథివ్యా ఆపోరసః, అపామోషదయో రస**
**ఓషధీనాం పురుషో రసః పురుషస్య వాగ్ రసః**
**వాచ ఋుగ్ రస ఋుచః సామ రసః**
**సామ్నా ఉద్‌గీథో రసః - ఛాందోగ్య. (1-1-2)**

ఏష రసానాం రసతమః పరమః పరార్థోఽష్టమో య దుద్గీథః

- ఛాందోగ్య (1-1-3)

సమస్త భూతాలకు పృథివి రసం. అంటే భూమి అన్ని భూతాలకు ఆశ్రయంగా ఉంటుంది. భూమికి రసం జలం. జలములకు ఓషధులు, ఓషధులకు అంటే అన్నాదులకు పురుషుడు, పురుషునకు వాక్కు, వాక్కునకు ఋక్కు, ఋక్కునకు సామము, సామమునకు ఉద్గీథము (ఓమ్) రసంగా ఉంటాయి. వీటి భావమేమంటే "ఉద్గీథము- ఓ౩మ్ సమస్తానికి రసం వంటిది. అది అన్నింటి సారము.

"అట్టి ఉద్గీథముచే చెప్పబడే పరబ్రహ్మమే పరమేశ్వరుడు. అతడే రసముల కన్నిటికంటె అత్యుత్తమ రసం - ఆనందరసం" అని భావం.

ఇట్లే ఉపనిషత్తులన్నీ ఓ౩మ్ నామాన్ని వేనోళ్ళ కీర్తిస్తాయి.మాండ్యూ కోపనిషత్తంతా ఓమ్ వ్యాఖ్యయే.

ఓ౩మ్ నామములో ఆధ్యాత్మికమైన ప్రయోజనమేకాక కొన్ని భౌతిక ప్రయోజనాలూ ఉన్నాయి.శ్రద్ధా భక్తులతో లయబద్ధంగా ఓ౩మ్‌ను జపిస్తే మన మెదడులోని ఆల్ఫా బీటా తీటా తరంగాలలో సమన్వయం ఏర్పడి మానసిక అలజడి శాంతిస్తుంది. కొన్ని సంవత్సరాల క్రిందటి మాట-కొందరు కోటీశ్వరులు ఒక పెద్ద పరిశ్రమను స్థాపించి పని ప్రారంభించారు.దానిని పెంచి పెద్దజేసి ప్రపంచంలోనే గుర్తింపు సంపాదించాలని అందరి ఆలోచన. కాని, వారు ఎప్పుడు సమావేశమైనా చర్చలు జరిగేవేకాని నిర్ణయాలు తీసుకోలేకపోయేవారు. అంతట వారికి ఒక సాధువు (స్వామి సత్యానంద సరస్వతి గారు) "మీరు సమావేశం ప్రారంభించేముందు హృదయపూర్వకంగా కొంతసేపు ఓ౩మ్‌ను ఉచ్చరించ"మని సలహా చెప్పాడు. వారు ఆ సాధువు మీద ఉండే గౌరవంతో అట్లే చేశారు. దానితో వారి ఆలోచనలలో సమన్వయ మేర్పడి చక్కటి నిర్ణయాలు తీసుకోగలిగారు. దానితో అనతి కాలంలోనే ఆ కంపెనీ పెరిగి పెద్దదై ప్రపంచ గుర్తింపు పొందింది.

ఈ సంఘటనను గురించి వివరించి చెబుతూ స్వామీ సత్యానంద సరస్వతి గారు ఈవిధంగా అన్నారు - "హిందువులకు 'ఓం' అనేది పవిత్రమైన ప్రణవ మంత్రం అయితే కావచ్చు కాని, భవిష్యత్‌లో సైంటిస్టులందరికీ అది మనస్సును

శక్తివంతంచేసే ఒక టానిక్ మాదిరిగా ఉపయోగపడుతుంది. బార్సిలోనా (స్పెయిన్) మెడికల్ యూనివర్సిటీవారు 'ఓం' కార ఉచ్చారణవలన మెదడులో ఎటువంటి మార్పులు కలుగుతున్నాయనే విషయంపై పరిశోధనలు చేశారు.

స్త్రీలు పురుషులు, విద్యార్థులు విద్యావంతులు గుమస్తాలు ఆఫీసర్లు, కన్యలు గృహిణులు వంటి వివిధ వర్గాల నుండి ప్రతినిధులను ఈ ప్రయోగానికి ఎన్నుకొన్నారు. వాళ్ళచేత రకరకాలుగా ఓంను పలికించారు. అంటే - 'ఓ'ను దీర్ఘంగా 'మ'ను హ్రస్వంగా, 'ఓ' ను హ్రస్వంగా - 'మ' ను దీర్ఘంగా, రెండింటిని సమానంగా ఉచ్చరింపచేశారు. వారిని ఒక పాలీగ్రాఫ్‌తో (ఇ.ఇ.జి., ఇ.సి.జి. జి.యస్.ఆర్. వంటి వాటితో కలిసిన యంత్రంతో) కలిపారు. ఓంకారం ఉచ్చరించేటప్పుడు వారి శరీరంలో కలిగే వివిధ స్పందన తరంగాలను (ఇంపల్సెస్‌ను) ఆల్ఫా బీటా, తీటా, డెల్టా తరంగాలను నమోదు చేశారు.

ఓంకారోచ్చారణవల్ల శరీరంలోని వివిధ అవయవాలన్నీ సమర్థవంతంగా పనిచేస్తున్నట్లు గుర్తించారు. ఇంతేకాక, మెదడులో అత్యద్భుతమైన **'ఆల్ఫా, తీటా'** స్థితి నెలకొంది.

క్రీ॥శ. 1920లో హేన్స్‌బెర్గర్ అనే జర్మన్ పరిశోధకుడు - మానసిక చికిత్సావేత్త మొదటిసారిగా ఈ పదములను కనుగొని వాడాడు. మెదడులో ప్రత్యేకమైన రెండు స్పందనలున్నట్లు ఆయన గుర్తించాడు. మొదటి స్పందనలో సెకండుకు 8 నుండి 13 వరకు సైకిల్స్ (తరంగా)లుంటాయి. దీనికి ఆయన ఆల్ఫాస్థితి యని నామకరణం చేశాడు. ఇవి కొద్దివేగంగా హైవోల్టేజి తరంగాలుగా ఉంటాయి. ఒక వ్యక్తి కళ్ళు మూసుకొని ఏ తొందరాలేకుండా ప్రశాంతంగా ఉన్న స్థితిలో యిట్టి తరంగాలు కలుగుతాయి.

రెండవదయిన **'బీటా'** స్థితిలో 14, అంతకన్న ఎక్కువ సైకిల్స్ ఉంటాయి. ఇది మెదడు చకచకా పనిచేస్తున్న స్థితిని సూచిస్తుంది. అయితే కొన్ని సంవత్సరాల తరువాత పరికరాల నాణ్యత అభివృద్ధి చెందడంతో మరింత సూక్ష్మస్థితులను కనుగొన్నారు. అవి, తీటా (5-7 సైకిల్స్), డెల్టా (0.3-4). తీటా స్థితి మత్తుగా (డ్రౌసీగా) ఉన్నపుడు కలుగుతుంది. డెల్టాస్థితి గాఢంగా నిద్రపోయేటప్పుడు కలుగుతుంది.

పై ప్రయోగంలో 'ఓ' ను ఉచ్చరించేటప్పుడు ఆల్ఫా (చాలా హాయిగా ఉన్న విశ్రాంతి) స్థితి, 'మ్' ను ఉచ్చరిస్తున్నపుడు నిశ్చల ధ్యాన స్థితిలో వచ్చేటటువంటి సృజనాత్మకమైన తీటాస్థితి నమోదయ్యాయి. మామూలు విశ్రాంతిస్థితి మత్తులాంటిదయితే, 'ఓ' ద్వారా వచ్చేది చైతన్యవంతమైన విశ్రాంతి యనీ, మామూలుగా ఇటూ అటూ పరిగెత్తే మనస్సుయొక్క చాంచల్యమైన స్పందనకూ, 'మ్' కారం కలిగేంచే సృజనాత్మమైన స్పందనకు భేదం ఉందనీ' ఆయన వివరించారు.

ఆల్ఫా తీటాల మధ్య ఉండే మనసు చైతన్యంతో స్పందిస్తూనే అలసిపోని ఆరోగ్యకరమైన విశ్రాంతిలో ఉంటుందనీ, దానిని 'డైనమిక్ ట్రాంక్విలిటీ' అంటా"రనీ స్వామీ సత్యానంద సరస్వతీ గారు అన్నారు.

పై సంఘటన చాలా సంవత్సరాల క్రిందట జరిగింది. అనంతరం ఓంకారంపై మరికొన్ని పరిశోధనలు జరిగాయి. వాటిని క్రోడీకరిస్తూ విద్వాన్ శ్రీకాశీభట్ల సుబ్బరామ శర్మగారు 4-5-2007వ తేదీ 'వార్త' దినపత్రికలో ఒక చక్కటి ప్రేరణాత్మకమైన వ్యాసం వ్రాశారు. ఇందుమూలముగా వారికి ధన్యవాదములు తెలుపుతూ పాఠకుల అనుకూలత కొరకు ఆ వ్యాసాన్ని యథాతథంగా యిచ్చుట ప్రచురిస్తున్నాము.

## ఓంకార సాధనతో రోగ నివారణ

ధ్వని సాధనలో ఓంకార సాధన మహోన్నత స్థాయిని సంతరించుకుంది. ఓంకార ధ్వనివల్ల శరీరంలోని రోగాలన్నీ సహజంగానే బాగవుతున్నాయి. వైజ్ఞానికులు భిన్న భిన్న రోగాలపై దీనిని ప్రయోగించి మంచి ఫలితాలను వెల్లడించారు. మానసిక రోగులపై ఎన్నో ప్రయోగాలుజరిపి పరిశీలించారు. నరాల రోగులపైన దీన్ని ప్రయోగించి ఆశించిన ఫలితాలు పొందారు.

మూగవారు, చెవిటివారిపైన కూడా ఓంకార ధ్వని అనుకూల ప్రభావాన్ని చూపింది. ఆ ధ్వని నాలుకకు చక్కలిగింతపెట్టి దాని వికారాన్ని పోగొడుతుంది. శ్రవణేంద్రియ దోషాలు తొలగించి మాటలు వినబడేటట్లు చేస్తుంది. తల నొప్పికి ఓంకార ధ్వని రామబాణౌషధము. తలనొప్పి వచ్చినప్పుడు ఓంకారాన్ని ఉచ్చరిస్తూ

ఇటునటు తిరుగుతూంటే తలనొప్పి త్వరగా తగ్గిపోతుంది. మనస్సు ఆందోళనపడేటప్పుడు, శరీరంలో సోమరితనమేర్పడినప్పుడు ఓంకారాన్ని ఉ చ్ఛరిస్తూండటం మంచిది. దీని వల్ల రక్తం సహజంగా ప్రసరించి మనస్సు ప్రసన్నమవుతుంది.

హృదయం శరీరానికి కేంద్రం. దాని నుండి శరీర భాగాలకన్నిటికీ పరిశు ద్ధ రక్తం చేరుతూంటుంది. హృదయం సరిగా పనిచేయక పోవడం వల్ల మానవుడు వ్యాకులపడుతూంటాడు. దీనికై వేకువ జామున తూర్పు మొగంగా కూర్చుని ఏకాగ్ర చిత్తంతో ఓంకారాన్ని జపించాలి. సాధన అధికమయ్యే కొద్దీ శక్తి హృదయంలో చేరుతుంది. 'ఓంకార జపం వల్ల హృదయంపైన, మెదడుపైన, సూక్ష్మేంద్రియాలపైన ప్రభావ మనుకూలంగా పడుతుంది' అని ఆస్ట్రేలియాలోని ఒక సుప్రసిద్ధ సైంటిస్ట్ డాక్టర్ లెబోరియో తన అభిప్రాయాన్ని స్పష్టపరిచారు.

శరీరంలోని మలినరక్తం హృదయం ద్వారా శ్వాసకోశంలో చేరి పరిశు ద్ధమౌతుంది. అక్కడ నుండి బయలుదేరి హృదయం ద్వారానే శరీరమంతా ప్రసరిస్తుంది. అలాగే ఓంకార ధ్వనితో హృదయంలోని రోగాలన్నీ పోతున్నాయి. దానివల్ల శ్వాసకోశాల బలహీనత మటుమాయమవుతుంది. డాక్టర్ ఎడ్వర్డ్ పోజీలాస్క్ ధ్వనివిజ్ఞాన సహాయంతో శ్వాసకోశరోగాలను, గుండె జబ్బులను బాగుపరిచారు. ఇతర రోగాలనుకూడా ఈ విధానంతో బాగుపరచవచ్చునని అతని దృఢమైన విశ్వాసం.

కొంతమంది డాక్టర్లు హిస్టీరియాపై ఓంకార ధ్వనివిజ్ఞానాన్ని ప్రయోగించి బాగుపరిచారు. ఈ రోగంపై దేశ విదేశాల్లో కూడా ఇలాంటి ఎన్నో ప్రయోగాలు జరుపుతున్నారు. శరీరంలోని ఆయా ధాతువులపై, కోశములపై ఓంకార ధ్వని ప్రభావం పడుతుంటుంది. దీని వల్ల రసము, రక్తము వృద్ధి అవుతాయి. ఎముకలు దృఢపడతాయి. ఓంకారాన్ని సామూహికంగా కీర్తించడం వల్ల ఎంతో లాభముంది.

కఫమువల్ల కలిగే రోగాలలోనూ తగినన్ని లాభాలు కనబడుతున్నాయి. కఫరోగంతో బాధపడేవారు ఓంకారాన్ని గట్టిగా స్పష్టంగా ఉచ్చరిస్తుండాలి. దగ్గు జలుబు మొదలగు రోగాలలోనూ ఓంకారోచ్చారణ ఎంతో ఉపకరిస్తుంది. కడుపు

నొప్పిపైన కూడా దీని ప్రభావాన్ని చూపుతుంది. ఎటువంటి కడుపునొప్పి వచ్చినా పరవశించి ఓంకారాన్ని ఉచ్చరిస్తే ఎంతో ఉపశమనం కలుగుతుంది. ముఖ్యంగా ఓంకారాన్ని ఉచ్చస్వరంతో ఉచ్చరించాలి. ఓకారంపైనే శక్తినంతా చూపాలి. మకారాన్ని మందంగానైనా ఉచ్చరింపవచ్చు. ఓకారంపైన ఎంత లక్ష్యముంచితే అంత శాంతిని పొందవచ్చు.

లో, హై బ్లడ్ ప్రెషర్ ట్రీట్‌మెంట్ :

లో బ్లడ్ ప్రెషర్‌లో ఓంకారాన్ని గట్టిగా ఉచ్చరించడం వల్ల మేలు కలుగుతుంది. కానీ హై బ్లడ్ ప్రెషర్‌లో పద్మాసనంలో కూర్చొని ఓంకారాన్ని మానసికంగా జపించాలి. ఎంత నిదానంగా జపిస్తే అంత మంచిది. కలిరాజ దావూద్ దయాల్ గుప్త రక్తపుపోటుతో బాధపడేవారు. ఎన్ని మందులు వాడినా జబ్బు నయంకాలేదు. మందులేవీ పనిచేయలేదు. ఎంతో నిరాశకు గురయిన అతడు ఓంకారాన్ని మానసికంగా జపించి స్మరించి రోగవిముక్తుడయ్యాడు. వారు తన అనుభవాలు తెలియజేస్తూ ఓంకార చాలీసాను రచించి దీన్ని పారాయణం చేస్తే అపార శాంతి లభిస్తుందని స్వానుభవంతో ఓంకార మహిమను వెల్లడించారు.

వారు శుక్రదోష రోగులతో ఓంకార జపాన్ని, ఓంకార సంకీర్తనను, ఓంకార చాలీసా పారాయణాన్ని చేయించి సత్ఫలితాలు చవిచూసారు.

ఈ విధంగా ఓంకార ధ్వని ప్రభావం శుక్రాశయానినా పనిచేస్తుంది. మానసిక రోగాల్లోనూ ఓంకారాన్ని జపించడం-సంకీర్తన చేయడం ఓంకార చాలీసా పారాయణ చేయడం ఎంతో మేలు చేస్తాయి. కాని ఇవన్నీ నమ్మకంపై ఆధారపడి ఉన్నాయి. నమ్మకముంటే ఏ సాధన అయినా సత్ఫలితాన్ని ఇచ్చి తీరుతుంది. నమ్మిన వారికి ప్రభావం చూపుతుందనేది గమనింపవచ్చు. పాశ్చాత్య దేశాల్లో మానసిక రోగాలను పోగొట్టడాని కెన్నో ప్రయోగాలు చేస్తున్నారు. కాని ఆయా ప్రయోగాల కంటే ఓంకారోచ్చారణ ప్రభావం తక్కువేమీ కాదు. మానసిక వికారాలకెన్నో కారణాలుంటాయి. వానిలో చింత ప్రబలకారణం. చింత అనేది చితిగా కాలుస్తుంది. దాని నిరోధించడమంత సులభం కాదనేది సనాతన కాలం నుంచీ చెప్పే మాటలే. కానీ ఓంకార సాధనతో చింతను సులభంగా

పోగొట్టవచ్చునని శాస్త్రీయ ప్రమాణాలు ఆధారపరుస్తున్నాయి. అనుభవంతోనూ గట్టిగా చెప్పవచ్చు.

ఈ సాధన క్రమబద్ధమైనపుడే మంచి ఫలితాన్ని పొందవచ్చు. అప్పుడప్పుడు చేయడం వల్ల ఎటువంటి సాధన సిద్ధించదు. భక్తితో, శ్రద్ధతో, విశ్వాసంతో సాధన చేసినప్పుడే సత్ఫలితాన్ని పొందవచ్చు.

(వార్తా దినపత్రిక సౌజన్యంతో)

అందుచే మనసు కలత చెందినపుడు సర్వరక్షకుడైన పరమేశ్వరుని ఓ౩మ్ నామముతో భక్తి శ్రద్ధలతో పిలవండి. మీకు తప్పక శాంతి లభిస్తుంది.

## 'ఓం' పద సారాంశం

ఓ సృష్టి స్థితిలయకర్తయైన పరమేశ్వరా !

సర్వప్రాణి సంరక్షకా ! మమ్ము నీవైపు నడిపించి నీ చెంత చేర్చుకో !

### ధ్యానానికి ఉత్తమ సాధనం 'ఓంకారం'

ప్రణవో ధనుః, శరో హ్యాత్మా
బ్రహ్మ తల్లక్ష్య ముచ్యతే
అప్రమత్తేన వేద్ధవ్యం శరవత్తన్మయో భవేత్॥

- ముండకోపనిషత్తు (2-2-4)

నిశ్చయముగా ధ్యానానికి ప్రణవము-ఓ౩మ్ అను పదమే ధనుస్సుగా ఉండాలి. అట్టి ధనుస్సుకు జీవాత్మ (తాను) బాణం కావాలి. దానికి అంతర్యామియైన బ్రహ్మము (పరమాత్మ) లక్ష్యం కావాలి. అప్రమత్తతో ఆ లక్ష్యాన్ని భేదించాలి. బాణం లక్ష్యంలో గ్రుచ్చుకొని లగ్నమైనట్లు తాను బ్రహ్మమందు లగ్నుడుకావాలి. అంటే బ్రహ్మమయుడు కావాలి.

పై విధంగా ఓంకార జపంచేస్తే ఆరోగ్యంతోబాటు ఆత్మానందం కలుగుతుంది.

# భూః

గాయత్రీ మంత్రంలోని మొదటి మూడు పదములైన 'భూః, భువః, స్వః' లను మహావ్యాహృతు లంటారు. విశేషంగా ఉచ్చరింపబడేవికనుక వీటిని మహావ్యాహృతు లన్నారు. వీటి ద్వారా పరమేశ్వరుని లక్షణం స్పష్టంగా చెప్పబడింది. ఈ పదములకు సత్తు, చిత్తు, ఆనందము లని అర్థం. సృష్టికి మూలపదార్థాలైన పరమేశ్వర జీవ ప్రకృతులలో జీవునిలో ఆనందము, ప్రకృతిలో చిదానందములు లేవు. ఈ మూడు గుణములు కలిగి ఉన్నవాడు పరమేశ్వరు డొక్కడే. కనుక ఈ మూడు మహావ్యాహృతులను కలిపి చెప్పినప్పుడు పరమేశ్వరుడు మాత్రమే సూచింపబడతాడు. ఇది పరమేశ్వరుని నిర్దుష్ట లక్షణం.

**'భూ – సత్తాయాం'** అనే ధాతువుతో **'భూః'** పదం తయారౌతుంది. భూః అంటే సత్తా – ఉనికి (ఎక్సిస్టెన్స్) కలిగిన పదార్థం. పరమేశ్వరుని ఉనికి మూడు కాలాలలోను ఒకే రకంగా ఉంటుంది. సృష్టికి పూర్వం, సృష్టి కాలంలోను, సృష్టి తదుపరి ప్రళయకాలంలోను పరమేశ్వరుని ఉనికి ఎట్టి మార్పులు చెందక ఏకరసంగా ఉంటుంది. (జీవాత్మలమైన మనమును సత్ స్వరూపులమే – ఎప్పటికీ ఉండేవారమే. కాని, మనం అవిద్యతోకూడి మన స్వరూపాన్ని మరచి సంసార సముద్రంలో బంధింపబడి ఉన్నాం). మనవలె జననమరణ బంధనాలు, కర్మబంధనాలు లేనివాడు కనుక పరమేశ్వరుడు నిజమైన సత్ స్వరూపుడు.

పరమేశ్వరుని ఉనికి విశ్వవ్యాపకము. వివేకనేత్రంతో మనం ఈ సృష్టిని పరిశీలించినట్లేయితే అతని ఉనికి ప్రతీ అణువులోనూ మనకు గోచరిస్తుంది. ప్రతీ అణువు కొన్ని పరమాణువుల కూటమనీ, అందలి పరమాణువులన్నీ వాటి వాటి పరిధులలో (ఆర్బిట్స్‌లో) నియంత్రిత గతితో తిరుగుతున్నాయనీ విజ్ఞానశాస్త్రం చెబుతుంది అట్లే, ఆకాశంలో మనకు గోచరించే సూర్యచంద్ర నక్షత్రాదులు, వాటిచుట్టూ పరిభ్రమించే గ్రహ ఉపగ్రహాదులు అన్నీ వాటి వాటి పరిధులలో నియంత్రిత గతితో తిరుగుచున్నాయని కూడా విజ్ఞానశాస్త్రం చెబుతుంది. ఆ విశ్వవ్యాపక నియామకశక్తినే ఈశు డన్నాయి మన వేదాలు. యజుర్వేద ఉపదేశమేమంటే –

ఈశావాస్య మిదం సర్వం యత్కించ జగత్యాం జగత్ ।
తేన త్యక్తేన భుంజీథా మా గృధః కస్య స్విద్ధనమ్ ॥ యజు. 40-1

ఓ మానవా ! గతిశీలమైన ఈ జగత్తంతా అణువు మొదలు బ్రహ్మాండం వరకు ఈశునిచే (నియామకునిచే) వ్యాప్తమై ఉంది. కాబట్టి, ఈ జగత్తంతా ఈశ్వ నిదిగానే (పరమేశ్వరునిదిగానే) భావించి, త్యాగభావంతో ధర్మపూర్వకంగా నీకు లభించిన దానిని అనుభవించు. ఎవరి ధనమునూ ఆశించవద్దు.

నిజమైన ఆస్తికుడు సర్వత్రా పరమేశ్వరుని ఉనికిని, మహిమను దర్శిస్తూ ధర్మాత్ముడౌతాడు. ఇహపర సుఖాలను పొందుతాడు.

నాస్తికులు దీనికి భిన్నంగా దేవుని ఉనికి నంగీకరించరు. విశ్వమండలి నియామకశక్తి ప్రకృతిదేకాని, మరియొక అదృశ్య పదార్థానిది కాదంటారు. మానవులను ధర్మమార్గంలో నడిపించి వారిని నీతిమంతులుగా తీర్చిదిద్దటానికే పెద్దలు దైవ మనే పదార్థాన్ని కల్పించారని వారి వాదన. కాని, పరిశీలించి చూస్తే ప్రపంచమంతా పంచభూతాలతో ఏర్పడినట్లు మనకు తెలుస్తుంది. అట్టి పంచభూతాలైన మన్ను, నీరు, గాలి, అగ్ని, ఆకాశాలలో మనకు జ్ఞానం కనబడదు. అవి ఎక్కడ పెడితే అక్కడనే పడి ఉంటాయి. స్వయంగా చలించలేవు. జ్ఞానపూర్వకంగా సమ్మిళితమై మరియొక ఉపయోగకర పదార్థంగా తయారుకాలేవు. మరియొక చేతన పదార్థం (జ్ఞానం కలిగిన పదార్థం) యుక్తి పూర్వకంగా వాటిని కలిపినపుడే వివిధ మూలకాలు (ఎలిమెంట్సు) మరియు ప్రపంచ పదార్థాలు నిర్మితమయ్యాయి. ఆ చేతన పదార్థాన్నే పై వేదమంత్రం **'ఈశు'** దన్నది. **'భూః'** అనే పదంలోనూ యిదే అర్థముంది. అది ఉనికిగల సర్వవ్యాపక సత్తాత్మక పదార్థం. పరమాత్మ పదార్థం.

**'భూ రితి వై ప్రాణః'** – యః ప్రాణయతి జీవయతి సర్వాన్ ప్రాణినః సః ప్రాణః, ప్రాణాదపి ప్రియ స్వరూపో వా" భూః పదము ప్రాణశక్తిని తెలుపుతుంది. ప్రపంచంలోగల సర్వ ప్రాణులకు ప్రాణశక్తిని ప్రసాదించేవాడుకనుక పరమేశ్వరునకు **'భూః'** అని పేరు. ఆ ప్రాణశక్తివల్లనే మనమంతా జీవిస్తున్నాము. మన శరీరంలో ప్రాణశక్తి అన్ని కణాలను జీవింపచేస్తున్నట్లే పరమేశ్వరుడు సృష్టిలోని సర్వప్రాణులను జీవింపచేస్తున్నాడు. అన్నిటికన్న మనకు ప్రాణం చాలా ప్రియమైనది. ఆ ప్రియమైన ప్రాణాన్ని యిచ్చేవాడు కనుక పరమేశ్వరుడు ప్రాణంకన్న

ప్రియమైనవాడు. మనం ఎవ్వరికీ ప్రాణాన్ని యివ్వలేము. కనుక ఏ ప్రాణి ప్రాణాన్ని హరించే అధికారం మనకు లేదు. సర్వ ప్రాణులలో ప్రాణరూపంలోనున్న పరమేశ్వరుని సేవించటమే నిజమైన భూః యొక్క ఆరాధన అవుతుంది.

**"భూర్ఇతి ప్రజాపతిః, ఇమామజనయతీ'** అని శతపథ బ్రాహ్మణ వ్యాఖ్య. ప్రజాపతియైన పరమేశ్వరునికే భూః అని పేరు. అతడే ఈ చరాచర జగత్తునంతటిని సృజించాడు. **'భూరసి, భూమిరసి, అదితిరసి'** (యజు. 13-18) అని యజుర్వేదం చెబుతుంది. భూః పదము భూలోక సంజ్ఞావాచకము. జీవులమైన మనకు పరమేశ్వరుడు జన్మనిచ్చి (శరీరాన్నిచ్చి) మనం వసించటానికి ఆధారంగా ఈ భూమిని సృజించాడు. ఈ భూమిలో మన కవసరమైన ఆహార ఖనిజ వృక్షాది సర్వసంపదలను ఉంచాడు. ఈ అద్భుత ప్రపంచ నిర్మాత, రక్షకుడు కనుక పరమాత్మను భూః అన్నారు.

పరమేశ్వర నిర్మితమైన ఈ భూమిమీద పండిన పంటలతోనే మన శరీరాలు పెరిగి జీవిస్తున్నాయి. ఈ భూమియొక్క అణువులే ఆహారం ద్వారా మన శరీరంలో ప్రవేశించి రక్తంగా ప్రవహిస్తున్నాయి. కనుక ఏ దేశంలో మనం పుట్టి పెరిగి నివసిస్తున్నామో ఆ దేశం మనకు తల్లి అవుతుంది.

**"మాతా భూమిః పుత్రోஉహం పృథివ్యాః"** (అథర్వ. 12-1-12)

'మాతృభూమి నా తల్లి, నేను ఆమె పుత్రుడను' అనే భావం ప్రతీ పౌరుడు కలిగి వుండాలని వేదం ఆదేశిస్తున్నది. అట్టి మాతృభూమిని మనం సస్యశ్యామలమొనర్చి దుష్టులనుండి రక్షించాలి. 'మాతరం మహీం అదితిర్నామ వచసా కరామహే(యజు. 18-30) - మా మాతృభూమిని సదా శత్రువుల నుండి కాపాడుచు అఖండితముగా నుంచెదము గాక ' అని ప్రతిజ్ఞ చెయ్యాలి. మనో వాక్కాయ కర్మలతో దానిని పాటించాలి. 'తుభ్యం బలిహృతః స్యామ -(అథర్వ. 14-1-64) - ఓ మాతృభూమీ ! నీ రక్షణకై అవసరమైతే ఆత్మబలిదానము చేయుదుము గాక !" అనే దృఢ సంకల్పం కలిగి ఉండాలి.

## "భూః" పద సారాంశం

*సృష్టి స్థితి లయాలలో ఏకరసుడవైన సర్వవ్యాపక సత్ స్వరూపా ! మేము వసించటానికి భూమినీ, జీవించటానికి ప్రాణశక్తినీ సృజించిన హే పరమేశ్వరా ! నన్ను కర్తవ్యపరాయణుని చేసి కాపాడుము.*

# భువః

'**భువః**' పదం ప్రజ్ఞానాన్ని – విశేషజ్ఞానాన్ని సూచిస్తుంది. దీనినే '**చిత్**' అంటారు. మన జ్ఞానం స్వల్పం. పరిమితం. కొన్ని విషయాలే మనకు తెలుస్తాయి. పరమేశ్వరుడు పూర్ణజ్ఞాని. అతడు సర్వవ్యాపకుడు, సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు కావటంవల్ల అణువులు మొదలు సమస్త బ్రహ్మాండాలను తన వశంలో నుంచుకొని నియమంగా నడిపిస్తున్నాడు. సర్వాంతర్యామియై సర్వ జీవులను, వారి సమస్త కర్మలను యథాతథంగా తెలుసుకుంటున్నాడు. వారి వారి కర్మలకు అత్యంత న్యాయంగా ఫలాల నిస్తున్నాడు. ఇంతేగాక, ఈ సృష్టిలోని సమస్త పదార్థాల జ్ఞానాన్ని వేదంద్వారా సృష్ట్యాదిలోనే ఉపదేశించిన జ్ఞానదాతయును అతడే. కనుక పరమేశ్వరుడు భువః. పూర్ణజ్ఞాని – చిత్ స్వరూపుడు.

**"భువ రితి అపానః – యః సర్వం దుఃఖ మపనయతి సో అపానః"** భువః పదము అపాన శక్తిని తెలుపుతుంది. తాను సమస్త దుఃఖరహితుడై తన నుపాసించే జీవులను సమస్త దుఃఖాలనుండి విముక్తుని చేస్తాడు కనుక ఏకేశ్వరుడైన పరమేశ్వరునికే '**భువః**' అని పేరు.

మన శరీరంలో అపానవాయువు మల మూత్ర స్వేద కఫాదులను వెడలగొట్టి శరీరాన్ని దుఃఖరహితంగా రోగరహితంగా చేస్తూవుంటుంది. అట్లే పరమేశ్వరుడు తన ఆజ్ఞలను పాలించేవారి మనో మాలిన్యాలను పోగొట్టి వారి సమస్త దుఃఖాలను దూరంచేస్తాడు.

మనం మన చుట్టూ ఎప్పుడూ ఏవో దుఃఖాలను చూస్తూనే ఉంటాము. ఋషులు మనకు కలుగు దుఃఖాలను మూడు వర్గాలుగా విభజించారు. శరీరం ద్వారా కలిగే వివిధ రోగాలను, జన్మ జరా మృత్యువులను శారీరకదుఃఖా లన్నారు. మనస్సు ద్వారా కలిగే అసూయా రాగద్వేషాదులను, వివిధ భయాందోళనలను మానసికదుఃఖా లన్నారు. ఈ శారీరక మానసిక దుఃఖాల

రెంటిని కలిపి ఆధ్యాత్మిక దుఃఖాలుగా పేర్కొన్నారు. ఇతర ప్రాణుల ద్వారా కలిగే దుఃఖాలను ఆధిభౌతిక దుఃఖాలన్నారు. దుష్టులనుండి, శత్రువులనుండి, విష కీటిక సర్పాదులనుండి కలిగే దుఃఖాలన్నీ ఈ వర్గంలోనికొస్తాయి. ఇక అతివృష్టి, అనావృష్టి, భూకంపాలు, ఉప్పెనలు, అధిక శీతఆతపాలు మొదలైనవన్నిటిని కలిపి ఆదిదైవిక దుఃఖాలుగా వర్గీకరించారు. ప్రాణులన్నీ ఈ మూడురకాల దుఃఖాలతో పీడింపబడుతున్నాయి. ఈ త్రివిధ దుఃఖాలనుండి మనను తరింపచేయగలడుకనుక పరమేశ్వరునకు **'భువః'** యనిపేరు. పరమేశ్వరుడు దుఃఖనాశకుడు కనుక అతని మైత్రిని కోరే మనంకూడా మన చుట్టూ ఉండే ప్రాణుల దుఃఖాలను దూరం చేయటానికి శక్తికొలది ప్రయత్నం చెయ్యాలి. అప్పుడే భువః యొక్క ఆరాధన అవుతుంది.

పరిశీలించి చూస్తే మానవు డనుభవించే దుఃఖాలలో 75 శాతం కోరితెచ్చుకున్నవే. మనిషి యింద్రియలోలుడై కొన్ని రోగాలను, బాధలను కొని తెచ్చుకుంటాడు. అహంకార అభిమానాలకు గురియై కొన్ని, అత్యాశకుబోయి కొన్ని, అనావశ్యకమైన పనులతో కొన్ని, శక్తికి మించిన పనులు చేబట్టి కొన్ని, ప్రొద్దుపోక వ్యర్థమైన ప్రసంగాలతో యితరులను బాధపెట్టి మరి కొన్ని ఈ విధంగా అనేకరకాలుగా మానవుడు దుఃఖాలను కొని తెచ్చుకుంటాడు. వీటిని నిరోధించాలంటే- జీవికకు అవసరమైనంతగా శ్రమించి మిగిలిన సమయాన్ని స్వాధ్యాయ సత్సంగ సామాజిక సేవలలో గడపాలి. సమయాన్ని సద్వినియోగంచేస్తే ఆత్మ పవిత్రమౌతుంది. ఆత్మానాత్మ వివేకజ్ఞానం కలుగుతుంది. మనస్సు నిర్మలము, ప్రశాంతము అవుతుంది.

ఎంతటి కష్టాలు వచ్చినా ధైర్యాన్ని విడనాడక సమస్త దుఃఖాలనుండి విడిపించగల పరమేశ్వరుని యొడిలో తానున్నట్లు భావించి కర్తవ్య నిష్ఠుడైన వ్యక్తి శాంతిని పొందుతాడు. అనాయాసంగా కష్టాలనుండి విముక్తుడౌతాడు.

శక్తికి మించిన కష్టాలు కలిగినపుడు శ్రద్ధాభక్తులతో జ్ఞానపూర్వకంగా మనస్ఫూర్తిగా భగవంతుని ప్రార్థిస్తే అతని సహాయం మనకు లభిస్తుంది. అందుకు మనం నిజ జీవితంలో కొంత సాధన చెయ్యవలసి ఉంటుంది. మన పరిసరాలను పరిశీలిస్తే కష్టాలలో బాధలలో నున్న కొందరు కనబడకపోరు. ఇతరుల కష్టాలుకూడా తన కష్టాలవంటివే నని గుర్తించి వారికి సాయం చెయ్య యత్నించాలి. వేద భగవానుని సందేశ మేమంటే -

**యస్మిన్ త్సర్వాణి భూతా నాత్మైవాభూద్ విజానతః ।**
**తత్ర కో మోహః కః శోకః ఏకత్వ మనుపశ్యత ॥**

యజుర్వేదం. 40.7

ఏ జ్ఞానమయ స్థితయందుండి సమస్త ప్రాణుల సుఖదుఃఖాలు తన సుఖదుఃఖాల వంటివే యని గ్రహిస్తాడో, వారికి తగిన విధంగా సాయం చేస్తాడో అట్టి భక్తుడు శోక మోహాదుల నధిగమించి పరమశాంతిని పొందుతాడు.

స్వామీ వివేకానందులవారు చెప్పినట్లు ఎవరు మానవ శరీరరూప దేవాలయాల లోనున్న దేవుని సేవిస్తారో వారే దేవునకు ప్రీతిపాత్రులౌతారు. అట్టి భక్తులకే భగవంతుని అనుగ్రహం లభిస్తుంది. '**భువః**' పదం ఆ విషయాన్నే మనకు ప్రబోధిస్తున్నది. దుఃఖనాశకుడైన పరమాత్మ నుపాసించి మీరును దుఃఖనాశకులు కండంటున్నది.

**'భువ రితి అంతరిక్ష నామ'** (యాస్కనిఘంటువు). భువః పదము అంతరిక్ష సంజ్ఞావాచకం. అంతరిక్షం అంటే భూమికి సూర్యునికి మధ్య ఉండే ప్రదేశం. దీనిలోనే వాయువు సంచరిస్తుంది. దీనికి '**వాతావరణ**' మని మరియొక పేరు. మన జీవనానికి భూమి ఆధారమైనట్లే వాతావరణమును ఆధారమే. ఆహారం, నీరు లేక కొద్ది రోజులు జీవించవచ్చు కాని గాలి లేక కొన్ని నిముషములు జీవించుటయూ కష్టమే. కనుక అట్టి గాలిని మనం పరిశ్రుభంగా ఉంచుతూ జీవన చక్రంలో అనివార్యంగా కలుషితమౌతున్న గాలిని మరల శుభ్రం చెయ్యటం మన ధర్మం. అందుకు అగ్నిహోత్రం ఉత్తమ సాధనం. మనం నిత్యాగ్నిహోత్రులమై పంచభూతాల ఋణం తీర్చుకోవాలి. '**ఓం భువర్వాయవే అపానాయ స్వాహా**'- భువర్లోకమందలి దుఃఖనివారక వాయువున కీ యాహుతి నర్పిస్తున్నా, నంటూ ఆహుతు లివ్వాలి.

## 'భువః' పద సారంశం

**ఓ చిత్ స్వరూపా ! సర్వజ్ఞ సర్వేశ్వరా !**

**ఓ అంతర్యామీ ! పాపకార్యములందు మాకు భయాందోళనలు కలిగించి మమ్ము దుఃఖములనుండి దూరము చేయుము. ప్రాణి మనుగడ కాధారమైన వాతావరణాన్ని సృజించిన ఓ పరోపకారీ ! మేమును నీవలె పరోపకార పరాయణుల మగుదుము గాక !**

# స్వః

'స్వః' అంటే ఆనందం. దుఃఖస్పర్శలేని నిరంతర సుఖాన్ని ఆనంద మంటారు. ఆ సుఖం కూడా అనంతంగా ఉండాలి. అట్టి ఆనందం కేవలం పరమేశ్వరునిలోనే ఉంది. పరమేశ్వరుడు తప్ప మిగిలిన ప్రాణులన్నీ ఏవో రకమైన బాధలను, ఆటంకాలను, అసంతృప్తిని, అవమానాలను పొందుతూనే ఉంటాయి. ఏ దుఃఖాన్ని తప్పించుకున్నా మరణదుఃఖాన్ని ఏ ప్రాణీ తప్పించుకోలేదు. అట్లని ప్రాణులు సుఖాన్ని పొందటం లేదని చెప్పలేము. మానవుడు తనకు అనుకూలమైనవి ప్రాప్తించినపుడు, అనుకున్నవి సాధించినపుడు, పోటీలలో విజేతగా నిలిచినపుడు ఆనందాన్ని పొందుతాడు. ధనంవల్ల, బలంవల్ల, పరివారంవల్ల, అనుచరులవల్ల, అభిమానులవల్ల ఆనందమగ్నుడౌతాడు. కానీ, ఇవన్నీ శాశ్వతాలా ? వీని వెనుక కష్టాలు, భయాలు లేవా ? అని ప్రశ్నించుకొని లోతుగా ఆలోచిస్తే - ఇవి శాశ్వతాలుకావనీ, వీటి వెనుక దుఃఖాలు దాగివున్నాయనీ అర్థమౌతుంది. ఇంతేగాక, మితిమీరిన సుఖానుభవం దుఃఖకారకమే అవుతుంది. మన యింద్రియశక్తులును పరిమితంగానే ఉంటాయి. మనం ఆ సుఖాలను కొద్దికాలమే అనుభవించగలం. కనుక మన సుఖం క్షణికం. దుఃఖమిశ్రితం.

పరమేశ్వరుని ఆనందం స్వాభావికం. అనంతం. త్రికాలాలలోను అది ఏకరసంగా ఉంటుంది. ఆ ఆనందం మన ఆనందంతో పోల్చతగినది కాదు. దానిని వర్ణింప మాటలు చాలవు. అంతర్యామియైన ఆ ఆనందస్వరూపుని దర్శించిన యోగి అగ్నిస్పర్శవల్ల చలిబాధ పోగొట్టుకున్నట్లు ఆ ఆనందస్పర్శవల్ల సమస్త దుఃఖాలను పోగొట్టుకుని అనిర్వచనీయమైన ఆనందాన్ని అనుభవిస్తాడు. దానినే 'సమాధి' అంటారు. అష్టాంగయోగ సాధనలో అది ఎనిమిదవ అంగము. ఆ ఆనందాన్ని ఒక సిద్ధపురుషుడు ఈ విధంగా వర్ణిస్తాడు.

**సమాధి నిర్ధూతమలస్య చేతసో**
**నివేశితస్యాత్మని యత్సుఖం భవేత్ ।**
**న శక్యతే వర్ణయితుం గిరా**
**తదా స్వయం తదంతఃకరణేన గృహ్యతే ॥**

"స్థిర సమాధితో నిర్మలచిత్తుడైన జీవుడు అంతర్యామియైన ఆనందసాగర్ని దర్శించినపుడు కలుగు సుఖానుభూతిని వర్ణించటానికి మా మాటలు చాలటంలేదు. అది స్వయంగా ఎవరంతటవారే అంతఃకరణంతో (బుద్ధితో) అనుభవించవలసినదే" అన్నాడు.

**'స్వ రితి వ్యానః'** పరమేశ్వరుడు వ్యానవాయువు వంటివాడు. మన శరీరంలో వ్యానవాయువు శరీరమంతా సంచరిస్తూ ప్రతీ కణానికి ఆహారపానీయాల నందిస్తూ ప్రతీ కణాన్ని జీవింపచేస్తున్నది. అట్లే పరమేశ్వరుడు సర్వవ్యాపకుడై బ్రహ్మాండంలోని సర్వప్రాణులను పాలిస్తున్నాడు. పరమేశ్వరుని ఆ శక్తినే 'స్వః' అంటారు.

'స్వః' పదం స్వర్లోకాన్ని తెలుపుతుంది. సూర్యునినుండి ఆ పైన ఉండే నక్షత్రాల నన్నిటినీ కలిపి స్వర్లోకమంటారు. అది చాలా విశాలంగా ఉంటుంది. దాని అవధి ఎంతో నేటి ఖగోళవిజ్ఞానానికి కూడా అంతుబట్టడంలేదు. అది ఎంత విశాలంగా ఉన్నప్పటికీ దానికి అవధి ఉందంటాయి మన వేదశాస్త్రాలు. ఈ భూలోక భువర్లోక స్వర్లోకాలు మూడూకలిసి పరమేశ్వరునిలో ఏకపాదంగా - నాలుగింట ఒకవంతుగా **ఉన్నాయంటుంది** యజుర్వేదం. **"పాదోస్య విశ్వాభూతాని త్రిపాదస్యామృతం దివి"** (యజు. 31-3). మిగిలిన మూడు పాదాలు (మూడు భాగాలు) పంచభూతరహిత దివ్యలోకం. అది మృత్యురహితం. అమృతం. ఆనందమయం. అక్కడకే ముక్తజీవులు చేరుకుంటారు.

**యత్రదేవా అమృత మానశానాః**
**తృతీయే ధామన్ అధ్యైరయన్త ॥** (యజుర్వేదం. 32-10)

ముక్త జీవులు ఆ తృతీయ ధామంలోనే నిరాటంకంగా విహరిస్తా రంటుంది పై వేదవాక్యం.

సామాన్య మానవులు నిత్యం సుషుప్తిలో (గాఢనిద్రలో) పొందే అనిర్వచనీయ సుఖం ఆ ఆనందస్వరూప పరమేశ్వరుని నుండియే. అలసియున్న శరీరాన్ని,

మనస్సును సేదదీర్చి నూతనోత్సాహాన్ని కలిగిస్తున్నడు. ఆ అంతర్యామియే, ఆ ఆనందస్వరూపుడే.

పరమేశ్వరప్రాప్తిని గోరు మనమును తోటి ప్రాణులకు సుఖశాంతుల చేకూర్చేవారము కావాలి. అదే 'స్వః' ఆరాధన. పరమేశ్వరుడు సుఖస్వరూపుడేగాక సుఖప్రదాతకూడా. మనకు లభించే ప్రతీ సుఖం వెనుక పరమేశ్వరుని కరుణ దాగివుంది. జీవులమైన మన పరిమాణం అతి స్వల్పం. పరమాణు పరిమాణం కన్నను చిన్న పరిమాణం. అట్లే మన జ్ఞానం, శక్తి సామర్థ్యాలునూ అల్పమైనవే. అట్టి జీవులమైన మనపై కరుణ వహించి మనను సుఖపెట్టుటకే పరమేశ్వరుడు ఈ చిత్ర విచిత్ర సృష్టిని గావించాడు.

**'యాథాతథ్యతోఽర్థాన్ వ్యదధాత్ శాశ్వతీభ్యః సమాభ్యః** (యజు. 40-8)

అటుంది వేదం. శాశ్వతులు, సమానంగా వర్తమానులున్నైన జీవులకొరకే ఈ ప్రపంచ పదార్థాల నన్నిటినీ ఏవి ఎట్లుండాలో అట్లు సృజించేసని స్వయంగా పరమేశ్వరుడే చెబుతున్నాడు.

పరమేశ్వరుడు ప్రకృతి పదార్థాలలో వివిధ రకాల శబ్ద స్పర్శ రూప రస గంధాల నేర్పరచి ఎన్నెన్నో సుఖాలకు నిలయంగా సృష్టిని గావించాడు. అట్లే, మనకు ఆ విషయ సుఖాలను గ్రహించగల యింద్రియాలతో గూడిన శరీరాలను సృజంచి యిచ్చాడు. అందువల్లనే మనకు ప్రాపంచిక సుఖాలు లభిస్తున్నాయి. లేకున్న ఏ సుఖాన్నీ మనం పొందలేము. కనుక, మనం నిత్యం ఆ సుఖప్రదాతకు కృతజ్ఞతలు తెలుపుకోవలసిన ధర్మం మనపై ఉంది.

**'కస్మై దేవాయ హవిషా విధేమ'** (యజు. 23-3) యని నిత్యం ప్రార్థించాలి. అట్టి సుఖస్వరూపుడు, సుఖప్రదాతయున్నైన పరమేశ్వరునికి హవిస్సుల నర్పిస్తూ విధేయతను ప్రకటించుకోవాలని ఈ వేదవాక్యం చెబుతున్నది. వట్టి మాటలతో విధేయతను, కృతజ్ఞతను ప్రకటించటం సరియైన పద్ధతి కాదు. మనంకూడా కొంత పరోపకారం చేసి తోటి ప్రాణులకు సుఖాన్ని కలిగించాలి. అట్టి సత్కార్మలే పరమేశ్వరున కర్పించవలసిన అసలైన హవిస్సులు.

అగ్నిహోత్రంలోవేసే నెయ్యి, హోమద్రవ్యాలు మొదలైన హవిస్సులతోనూ కొంత పరోపకారం జరుగుతుంది. యజ్ఞాగ్ని వాటిని భస్మంచేసి గాలిలో కలుపుతుంది. గాలి వాటిని పరిసరాలలో ఉండే ప్రాణుల కందిస్తుంది. అవి కొంత

పైకెగసి మేఘాలలో చేరుతాయి. ఆ మేఘాలు వర్షించినపుడు తిరిగి భూమిని చేరుకుంటాయి. అగ్నిచే సూక్ష్మీకరింపబడిన ఆ పదార్థాలు ప్రాణులకు, పంచభూతాలకు విశేషమైన ప్రయోజనాన్ని కలిగిస్తాయి. ముఖ్యంగా వాటిని శుద్ధిచేసి ఆరోగ్యాన్ని, బలాన్ని, ఉత్సాహాన్ని, స్ఫూర్తిని కలిగిస్తాయి. ఈ విధంగా అగ్నిహోత్రంలో వేసిన హవిస్సులు పరిమాణంలో కొద్దిపాటివైనా బహుళ ప్రయోజనాలను కలిగిస్తాయి. ఇంతేగాక, పక్షపాతం లేకుండా - నావారు, పరాయివారు అనే బేధం లేకుండా అందరికీ సమానంగా మేలు చేస్తాయి. కనుకనే యాజ్ఞవల్క్య మహర్షి తన శతపథ బ్రాహ్మణంలో **'యజ్ఞోవై శ్రేష్ఠతమం కర్మ - మనం చేసే సత్కర్మలలో యజ్ఞం శ్రేష్ఠతమ కర్మ - ఉత్తమోత్తమ కర్మ'** అన్నారు.

అగ్నిహోత్రంలో మనం వేసే ఆహుతులు భూలోక భువర్లోకాలనేకాక స్వర్లోకాన్ని (సూర్యుని) కూడా సంస్కరిస్తాయి. మను మహర్షి చెప్పినట్లు -

**అగ్నౌ ప్రస్తాహుతిః సమ్యగాదిత్యముపతిష్ఠతే ।**
**ఆదిత్యా జ్జాయతే వృష్టిః వృష్టేరన్నం తతః ప్రజాః ॥**

(మనుస్మృతి 3-76)

అగ్నిలో చక్కగా ఆహుతులుగా నివ్వబడిన పదార్థాలు క్రమంగా సూర్యలోకానికి చేరతాయి. అక్కడ యవి తన ప్రభావాన్ని చూపి సూర్యుని సంస్కరించి సమయానుకూల వర్షాలను కురిపిస్తాయి. వర్షాలనుండి అన్నము, (ఆహారము) అన్నం నుండి ప్రాణుల ఉత్పత్తి - పోషణ జరుగుతాయి.

వాయు జలముల శుద్ధితో లోకానికి చాలా మేలు జరుగుతుంది కనుక యజ్ఞములద్వారా భౌతిక స్వర్లోకాధిపతియైన సూర్యుని శక్తులను బలపరచి లోకకల్యాణమునకు తోడ్పడుటయు 'స్వః' ఆరాధనయే.

'ఓం స్వరాదిత్యాయ వ్యానాయ స్వాహా'

## 'స్వః' సారంశం

**ఓ ఆనందస్వరూప పరమేశ్వర ! వేదం ద్వారా నీ వుపదేశించిన ధర్మకర్మల నాచరిస్తూ నిన్నుపాసింతుము గాక ! ధర్మకర్మ ఫలము నీకర్పించి రాగరహితులమై నీ ఆనందధామము చేరుదుము గాక !**

# తత్ సవితుః

సంస్కృత భాషలో **'తత్'** అంటే అతడు, అది అని అర్థం. ఇది ఒక సర్వనామం. ఇచట దేనిని గురించి ఈ మంత్రం వివరిస్తున్నదో అది అని అర్థం. ఏది జగత్ప్రసిద్ధమో, దేనిని గురించి వేదశాస్త్రాలు, ఋషులు మునులు విశేషంగా చెబుతున్నారో అది. అంటే ఆ సచ్చిదానంద స్వరూప పరమేశ్వరుడని భావం.

ఈ గాయత్రీమంత్రంలో పరమేశ్వరుని సవితా పదంతో పేర్కొనటం జరిగింది. అందుచే ఈ మంత్రానికి సావిత్రీమంత్రమనే ప్రసిద్ధి కలిగింది. సవితా పదం **'షుఞ్ – అభిషవే'** మరియు **'షూజ్ – ప్రాణి గర్భవిమోచనే'** అనే ధాతువులతో నిర్మితమౌతుంది. అభిషవ మంటే ఉత్పత్తిచేయటం అని అర్థం. ఇచట ఈ పదం పరమేశ్వరుని జగదుత్పాదకశక్తిని సూచిస్తుంది. **'ప్రాణి గర్భవిమోచన'** మంటే తల్లిగర్భంలో నిర్మించబడిన ప్రాణులను లేదా అండాలను గర్భంనుండి వెలుపలకు తీసుకురావటం. పరమేశ్వరుని ఈ రెండు శక్తులను సవితా పదం సూచిస్తుంది. జగత్ యొక్క సృష్టికి, ప్రాణిసృష్టికి అతడే ఏకైక చేతన నిమిత్తకారణం-కర్త. సవితా-సృష్టికర్త.

యాస్కమహర్షి తన నిరుక్త శాస్త్రంలో సవితా పదమును **'సవితా - సర్వస్య ప్రసవితా'** అని నిర్వచించాడు. ఆయన అక్కడ సవితా పదం భౌతిక సూర్యుని పరంగా చెప్పటం జరిగింది. ఈ అర్థానికి **'షూ-ప్రేరణే'** అనే ధాతువు మూలం. సంపూర్ణ జగత్తును తమతమ కార్యాలలో ప్రేరేపిస్తాడుకనుక భౌతిక సూర్యునికూడా 'సవితా' అనవచ్చు. కాని, మనం గాయత్రీమంత్రంతో సద్బుద్ధికొరకు ప్రార్థన చేస్తాం. అట్టి సద్బుద్ధి నివ్వగల శక్తి భౌతికసూర్యునిలో ఎక్కడుంది ? కనుక ఇచట సవితా పదం అంతర్యామియై సర్వప్రాణులకు ప్రేరణ కలిగించే పరమేశ్వరునికే వర్తిస్తుంది.

సృష్టి ఉత్పన్నం కాకపూర్వం ప్రళయావస్థ ఉంటుంది. అప్పుడు సత్వము, రజస్సు, తమస్సు అనబడే మూడు రకాల పరమాణువులు సామ్యావస్థలో విడివిడిగా ఉంటాయి. దానినే **'మూలప్రకృతి'** అంటారు. అప్పుడది అంధకారంగా - అప్రకేతంగా - ఏమీ తెలియరాని విధంగా ఉంటుంది. అట్టి ప్రకృతిలో పరమేశ్వరుడు తన ఈక్షణతో క్షోభను కలిగిస్తాడు. వివిధ నిష్పత్తులలో సత్వరజస్తమస్సు లను పరమాణువులను కలిపి బంధించి వివిధమూలకాలను

ర్మిస్తాడు. ఆ మూలకాలతోనే వివిధ పదార్థాలను, ప్రాణులను సృజిస్తాడు. ఇదంతా జీవులు చేసే కర్మలకు ఫలాలనివ్వటానికే. తనకొరకు కాదు.

ఇప్పుడును సృష్టి సర్వత్రా జరుగుతూనే ఉంది. కనుక సవిత సర్వవ్యాపకము. అదే విషయం ఈ క్రింది వేదమంత్రం వివరిస్తున్నది.

**సవితా పశ్చాత్తాత్ సవితోత్తరాత్తాత్ సవితోధరాత్ ।**
**సవితా నః సువతు సర్వతాతిం**
**సవితానో రాసతాం దీర్ఘమాయుః ॥** ఋ. 10-36-14

సృష్టికర్తయైన సవితా నామక పరమేశ్వరుడు ముందు, వెనుక, క్రింద, పైన అన్నివైపులా అంతటా వ్యాపించి సృష్టిని గావించుచు మనను రక్షిస్తున్నాడు. అంతర్యామియై ప్రేరేపిస్తూ మనలను కర్మశీలుర చేస్తున్నాడు. అట్టిపరమేశ్వరుడు మనకు శుభములను, దీర్ఘాయువును ప్రసాదించు గాక !

అంతర్యామియైన పరమేశ్వరుని ఈ సవితాశక్తియే మనలను కర్మలయందు ప్రేరేపిస్తున్నది. ఆ ప్రేరణవల్లనే మానవుడు కర్మశీలుడై, ఆలోచనాపరుడై కవితలను, కవిత్వాలను సృజిస్తున్నాడు. శిల్ప, వైద్య, రసాయన, ఖగోళాది శాస్త్రాలతో అద్భుతమైన ఆవిష్కారాలను సాధిస్తున్నాడు. అనేక సుఖసాధనాలను సమకూర్చుకుంటున్నాడు. బుద్ధికి ప్రతిరూపమైన కంప్యూటర్లను నిర్మించి వాటితో మరెన్నో అద్భుతాలను సృజిస్తున్నాడు. ప్రపంచంలోగల సమస్త వైజ్ఞానిక ఆవిష్కారాల వెనుక ఈ సవితాశక్తి ప్రేరణయే ఉంటుంది. మనం ఆ ప్రేరణను లోక-కల్యాణానికి వినియోగించటం మన ధర్మం.

ప్రాణులలోని ప్రజనన శక్తిని - సంతానోత్పాదకశక్తిని సవితా అంటారు. అందుచే పర్యాయవాచకంగా తండ్రిని 'సవిత' అనవచ్చు. మానవులలోని సత్యాసత్య ధర్మాధర్మ వివేకశక్తిని కూడా సవితా అంటారు. దానితోనే మానవుడు ధర్మకార్యాల నాచరించి భౌతికోన్నతిని, యోగసాధన చేసి ఆత్మికోన్నతిని పొందుతాడు.

## 'తత్ సవితుః' సారాంశం

**ఓ సృష్టికర్తవైన పరమేశ్వరా ! మాకు శరీరేంద్రియ మనోబుద్ధులను నిర్మించి యిచ్చిన ఓ తండ్రీ ! నీ ప్రేరణతో మా బుద్ధి వికసించి మేము జ్ఞానవంతులము, ధర్మాత్ములము అగుదుము గాక !**

# వరేణ్యం

'వృఞ్-వరణే' అనే ధాతువుతో వరేణ్య పదవేర్పడుతుంది. వరింపతగినవాడు - కోరతగినవాడు నని దీని అర్థం. **"యద్ వరం వర్తుం అర్హం అతిశ్రేష్ఠం తత్ వరేణ్యం = ఏది వరించతగినదో, అతి శ్రేష్ఠమైనదో అది వరేణ్య"** మని నిర్వచనం.

సామాన్య మానవుల దృష్టిలో లోకంలో ప్రధానంగా కోరతగినవి ధనధాన్యాలు, భోగభాగ్యాలు, సిరిసంపదలు. వాటివల్లనే సర్వసుఖాలు లభిస్తాయని వారి ఆలోచన. వాటిని సంపాదించటానికే వారు నిరంతరం శ్రమిస్తారు. సంపాదించే కొలది రాగం పెరుగుతుందేకాని తగ్గదు. సిరిసంపదలవల్ల కలిగే సుఖము తాత్కాలికమే. ఏకాంగమే. ధనవంతులంతా సుఖపడుతున్నారా? అని ప్రశ్నించుకుని ఆలోచిస్తే వారే ఎక్కువ అసంతృప్తితో జీవిస్తున్నట్లు అర్థమౌతుంది. వధూవరులు - భార్యాభర్తలు ఒకరికొకరు కోరతగినవారే. వరింపతగినవారే. అయినా వారి అనురాగ మెంతకాల ముంటుందో తెలియదు. మనసులు కలిసి చిరకాలం వారు అనురాగంతో కలిసివున్నా అవసానకాలంలో ఒకరివెంట మరొకరు పోలేరు. మిత్రతయును ఇటువంటిదే. పరిశీలించి చూస్తే పరమేశ్వరుడే మనకు నిజమైన కోరతగిన మిత్రుడు. పరమ ఆప్తుడు.

పరమేశ్వరుడు సర్వవ్యాపకుడుకనుక సదా-సర్వకాల సర్వావస్థలయందు మనకు తోడుగా ఉంటాడు. మిత్రుల మధ్య, భార్యాభర్తల మధ్య అపార్థాలొచ్చే అవకాశం ఉంది. ఒకరినొకరు మరొకరకంగా అర్థంచేసుకోవచ్చు. కాని, పరమేశ్వరుడు అందరి మనసుల నెరిగిన మహా మనీషి. మనను మనముగా అర్థం చేసుకోగల పరమ మిత్రుడు. కనుకనే వేదం "ఇంద్రస్య యుజ్యః సఖా (ఋ. 1-22-19) - సర్వవ్యాపకుడైన విష్ణువే జీవునకు నిజమైన యోగ్యమైన మిత్రు" డంటుంది.

ఆనందమే పరమేశ్వరుని స్వరూపం కనుక సర్వప్రాణులచేత అతడు కోరతగినవాడే. దేవుడు లేడని వాదించు నాస్తికులును ఆనందాన్ని కోరతారు కదా ! కనుక, పరోక్షంగా వారును పరమేశ్వరుని వరించువారే. సామాన్యంగా మానవుడు అవిద్యతో (అజ్ఞానంతో) కూడి ఉంటాడు. దానివల్ల దేహాత్మభ్రాంతి కలుగుతుంది. దానితో దేహమే తా ననుకుంటాడు. దేహంతో సంబంధ మున్నవారే తనవా రనుకుంటాడు. వీలయినంత ఎక్కువగా ఇంద్రియాలతో సుఖాలనుభవించటమే పురుషార్థమనుకుంటాడు. అందుకొరకై శ్రమించి అనేక సుఖసాధనాలను సమకూర్చుకుంటాడు. వాటిపై రాగాన్ని పెంచుకుంటాడు. ఈ విధంగా మానవుడు అజ్ఞానంతో ప్రకృతిని-ప్రపంచాన్ని వరిస్తున్నాడు. కాలప్రవాహంలో ఆ సుఖసాధనాలు దూరమైతే విలపిస్తున్నాడు అస్తులు దూరమైనా, అయినవారు దూరమైనా అమిత దుఃఖాన్ని అనుభవిస్తున్నాడు. ప్రకృతియొక్క స్వభావం తెలియకనే ఈ పొరబాటు జరుగుతోంది.

పరిశీలించిచూస్తే ప్రపంచంలో దొరికే సుఖాలు శాశ్వతాలుకావు. ఆ క్షణికసుఖాల వెనుకకూడా నాలుగురకాల దుఃఖం దాగి వుంటుందంటారు వివేకవంతులు. ప్రపంచం పరిణామశీలి. కనుక మనం వివేకశీలురమై శాశ్వత సుఖం ఎక్కడుందో అన్వేషించాలి. దానిని వరించాలి. ఆ శాశ్వత సుఖం ఎక్కడనో దూరంగాలేదు. మనలోనే వ్యాపించి ఉంది. దానిని పొందటానికి ఋషులు చెప్పిన ఉపాయమేమంటే -

**ఏకో వశీ సర్వభూతాంతరాత్మా**
**ఏకం రూపం బహుధా యః కరోతి ।**
**త మాత్మస్థం యేఽనుపశ్యంతి ధీరాః**
**తేషాం సుఖం శాశ్వతం నేతరేషామ్ ॥** - కఠోపనిషత్తు (5-12)

సమస్త విశ్వాన్ని తన వశంలో నుంచుకున్న ఏకేశ్వరుడైన పరమేశ్వరుడే ప్రళయకాలంలో ఏకరూపంగానున్న ప్రకృతిని తన అనంత జ్ఞానసామర్థ్యాలతో అనేక రూపాలుగా భాసించే ప్రపంచంగా మార్చాడు - సృజించాడు. ఏ ధ్యానశీలుడు అంతర్యామిగా తనలోనే వ్యాపించియున్న పరమాత్మను అనుసరించి దర్శిస్తాడో అతడే శాశ్వత సుఖాన్ని పొందుతాడు. ఇతరుల కా శాశ్వత సుఖం లభించదు. (అనుసరించి దర్శిస్తాడంటే ముందు జీవుడైన తన యథార్థ స్వరూపాన్ని దర్శించి - ఆత్మసాక్షాత్కారాన్ని పొంది అనంతరం పరమాత్మ సాక్షాత్కారాన్ని పొందుతాడని భావం).

శాశ్వతానందం కావాలంటే మనం యమనియమాది అష్టాంగయోగ ...సలు చేసి సమాధి స్థితిని సాధించాలి. అందుకు మనం ముందుగా అంతర్యామిని ...ంచాలి. ఋషియును అట్లే అన్నాడు -

నాయమాత్మా ప్రవచనేన లభ్యో
న మేధయా న బహునా శ్రుతేన ।
య మేవైష వృణుతే తేన లభ్యః
తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వామ్ ॥ - కఠోపనిషత్తు (2-23)

"ఆధ్యాత్మిక శాస్త్రాల నధ్యయనం చేసి చక్కగా ప్రవచించినంత మాత్రాన ఈ పరమాత్మ లభింపడు. ధారణావతియైన బుద్ధితోను, శ్రవణభక్తితోను కూడా అతడు లభింపడు. ఎవరు ఈ ఆత్మను హృదయపూర్వకంగా వరిస్తారో వారే దర్శించగలరు. అట్టి వారికే అంతరాత్మయైన పరమాత్మ తన ఆనందస్వరూపాన్ని ప్రకటించగలదు".

'వరేణ్య' పదమునకు శ్రేష్ఠుడని మరియొక అర్థం. శ్రేష్ఠపురుషుని నాయకునిగా ఎన్నుకొన్న ప్రజలు తమ చింతలన్నిటిని నాయకునిపై వదలి దిగులు లేకుండా జీవిస్తారు. శ్రేష్ఠనాయకుని కన్నను శ్రేష్ఠతముడైన భగవంతుని నాయకునిగా చేసుకొన్నవారికి దిగులేముంటుంది ? ఈ లోకంలో మనం మన పరిధిలోలేని భారాలెన్నిటినో మనపైన వేసుకొని జీవిస్తూ ఉంటాము. భగవంతుని నాయకునిగా ఎన్నుకొని ఆయనపైనే మన భారాలన్నీ వేస్తే మనకెంతో తేలికగా ఉంటుంది. మనం మన కర్తవ్యాన్ని చక్కగా పాలిస్తే చాలు. జీవితం ఆనందంగా గడచిపోతుంది.

వేదంద్వారా పరమేశ్వరుడుపదేశించిన సత్కర్మల నాచరిస్తూ వాటి ఫలాన్ని పరమేశ్వరార్పణ చేస్తూవుంటే క్రమంగా మనలోని ప్రపంచరాగం తొలగిపోతుంది. భగవంతునిపై రాగం పెరుగుతుంది. అశాంతి తొలగిపోయి పరమశాంతి ప్రాప్తిస్తుంది. అంతకన్న మనకు కావలసింది ఏముంది ?

## 'వరేణ్యం' సారాంశం

ఓ వరింపదగిన మిత్రమా పరమేశ్వరా ! మమ్ము నీవే నీ చెంతకు నడిపించుకో. ఓ శ్రేష్ఠనాయకా ! నీ నాయకత్వంలో మేము శాంతచిత్తుల మగుదుము గాక !

# భర్గః

ఈ 'భర్గః' పదం తదుపరి పదంతో సంధి ఏర్పడటం వల్ల గాయత్రీమంత్రంలో **'భర్గో'**గా మారింది. **'భ్రస్జ - పాకే' 'భృజీ - భర్జనే'** అను ధాతువులతో **'భర్గః'** పదం ఏర్పడుతుంది. పాపరహితుడు, పాపనాశకుడు నని ఈ పదమున కర్థం. **'భృజ్జతి పాపాని దుఃఖమూలాని యః సః- భర్గ'** అని నిర్వచనం. పాపాలను, అవిద్యాది క్లేశాలను భస్మంచేస్తాడుకనుక పరమేశ్వరునకు భర్గు డని పేరు.

మనం చేసే కర్మలు ధర్మయుక్తము, న్యాయయుక్తము అయితే పుణ్యకర్మలౌతాయి. అవే కర్మలు అధర్మయుక్తము అన్యాయయుక్తము లయితే పాపకర్మలౌతాయి. పరమేశ్వరుడు మనం చేసే కర్మలకు న్యాయమూర్తివలె (జడ్జీవలె) న్యాయంగా ఫలాలనిస్తాడు. కనుక, అతడు న్యాయకారి-న్యాయమూర్తి. ఈ లోకపు న్యాయమూర్తులు అల్పజ్ఞతవల్లకాని, ప్రలోభవశులైకాని సరియైన న్యాయం చెప్పలేకపోవచ్చును. కాని, పరమేశ్వరుడు సర్వజ్ఞుడు, సర్వవ్యాపకుడు, సర్వసాక్షి, పక్షపాతరహితుడు కావటంవల్ల అతని న్యాయం సున్నితపుత్రాసుతో తూచినంతసరిగా ఉంటుంది. అతడు పరిపూర్ణుడు కావటంవల్ల ప్రలోభాలకు వశమయ్యే ప్రసక్తేలేదు. జీవు లనుభవించే సుఖదుఃఖాలకు వారుచేసిన కర్మలే కారణంకాని పరమేశ్వరుని ఆగ్రహానుగ్రహాలు కావు. అందుచే అతడు పాపరహితుడు. ఎవరు అతనిని ధర్మదేవతగా ఉపాసిస్తారో వారిని అతడు రక్షిస్తాడు. పాపకార్యాలు చేయబోయేముందు వారిలో భయాందోళనలు కలిగించి వారిని పాపకార్యలనుండి నివృత్తుల చేస్తాడు. ఆ విధంగా ఆయన పాపనాశకుడు.

ఆది శంకరాచార్యులవారు గాయత్రీమంత్రానికి భాష్యం వ్రాస్తూ 'భర్గః' పదమునకు ఈ విధంగా అర్థం వ్రాశారు. - **"భర్గః = అవిద్యా తత్కార్యయోః భర్జనాత్ భర్గః, స్వయం జ్యోతిః, పరబ్రహ్మాత్మక తేజః"** - అంటే అవిద్యను, తత్కారణంగా ఏర్పడిన సమస్త క్లేశాలను భస్మంచేస్తాడు కనుక పరమేశ్వరునకు భర్గు డని పేరు. అతడు స్వయం ప్రకాశకుడు. పరబ్రహ్మాత్మక దివ్యతేజము.

అవిద్యవల్ల అస్మితా రాగ ద్వేష అభినివేశా లనే క్లేశాలొస్తాయి. ఇవన్నీ కలిసి పంచక్లేశాలు. ఈ పంచక్లేశాలను భర్గఃతేజం దహించి వేస్తుంది. అవిద్య అంటే దేహాత్మభ్రాంతి. జీవుడు తన స్వరూపాన్ని మరచి దేహమే తా ననుకుంటాడు. దానితో ఈ శరీరాన్నీ, ప్రపంచ పదార్థాలనీ నిత్యమనుకుంటాడు. మలమూత్ర యుక్తమైన శరీరాలను శుచిగా భావిస్తాడు. క్షణికములైన విషయ సుఖాలను నిత్యసుఖా లనుకుంటాడు. పతంజలి మహర్షి తన యోగదర్శనంలో ఈ విషయాన్ని **'అనిత్యాశుచి దుఃఖానాత్మసు - నిత్యశుచి సుఖాత్మ ఖ్యాతి రవిద్యా (2-5)** అని సూత్రీకరించాడు. దీనినే ఉపనిషత్కారులు **'హృదయగ్రంథి'** అన్నారు.

**'దృగ్దర్శనశక్త్యో రేకాత్మతే వాస్మితా (యో.ద.2-6)"** జీవుడు బుద్ధితో ఏకరూపత చెందటాన్ని-తాదాత్మ్యం చెందటాన్ని అస్మిత అంటారు. దేహానికీ, మనస్సుకు కలుగుతున్న సుఖదుఃఖానుభవాలను బుద్ధి గ్రహించి జీవునకు తెలుపుతుంది. కాని, జీవుడు అవి తనకే కలుగుతున్నట్లు భావించి వ్యథచెందుతాడు. ఇది అస్మితా క్లేశంవల్ల కలుగుతుంది.

**"సుఖానుశయీ రాగః (యో.ద.2-7)"** మనం ఏదైనా సుఖం అనుభవించినపుడు దానియొక్క సంస్కారం-స్మృతి-జ్ఞాపకం మన మనసులో చేరుతుంది. దానితో ఆ సుఖం మరలమరల అనుభవించాలనే కోరిక కలుగుతుంది. దానినే రాగం అంటారు. ఆ రాగంవల్లనూ మనకు క్లేశం (బాధ) కలుగుతుంది.

**"దుఃఖానుశయీ ద్వేషః- (యో.ద.2-8)"**- మనకు ఏదైనా బాధ-కష్టం కలిగినపుడు దాని సంస్కారం మనసులోచేరి, అది గుర్తుకు వచ్చినపుడు దానిపై వ్యతిరేకభావం (క్రోధం) కలుగుతుంది. మన సుఖాలకు అడ్డువచ్చేవారిపైనా, మనపట్ల వ్యతిరేకభావం కలవారిపైనా, మనకు నచ్చనివారిపైనా కూడా క్రోధం - ద్వేషం కలుగుతూ ఉంటాయి. ఇవి మనకు అశాంతిని - క్లేశాన్ని కలిగిస్తాయి.

పై నాలుగు క్లేశాలేకాక మృత్యుభయమునూ ఒక క్లేశంగా మనను బాధిస్తుంది. ఈ జన్మలో మనకు ఇంకా అట్టి బాధ కలుగకపోయినా పూర్వజన్మలలో పొందిన అనుభవం బలంగా మన మనస్సులో ముద్రపడి ఉంది. అందువల్ల మృత్యువనే మాట వింటేనే మనకు భయం కలుగుతూ ఉంటుంది. విచిత్రంగా ఈ భయం సామాన్య మానవులందేగాక ఆత్మజ్ఞానంగల విద్వాంసులలోనూ కనబడుతుంది. ఈ విషయాన్నే పతంజలి మహర్షి- **"స్వరసవాహీ విదుషోపి తథారూఢోభినివేశః"** (యో.ద. 2-9) అని సూత్రీకరించాడు. అభినివేశ మంటే మరణభయం.

పుట్టిన ప్రతీ మనిషీ పై పంచక్లేశాలతో పీడింపబడుతూనే ఉన్నాడు. ధనవంతుడైనా ధనహీనుడైనా, బలవంతుడైనా బలహీనుడైనా, విద్వాంసుడైనా విద్యాహీనుడైనా ఎంతోకొంత అందరూ పై క్లేశాలతో బాధపడుతూనే ఉన్నారు. వీటినుండి బయట పడటానికి ఏకైక మార్గం భర్గోదేవుని ఉపాసన. అతడే క్లేశరహితుడైన శుద్ధస్వరూపుడుకనుక మనను వీటినుండి తరింపచేయగలడు. ఆదిశంకరాచార్యులవారి అభిప్రాయమూ యిదే.

**'భర్గః'** పదమునకు విశుద్ధమైన ప్రకాశమని మరియొక అర్థం. కోట్లాది సూర్యుల ప్రకాశమును ఆ ప్రకాశానికి సరిరాదు. మన ఆత్మయును ప్రకాశం గలదేకాని పరమేశ్వరునంత ప్రకాశ వంతమైనదికాదు. అదియును కామక్రోధాది మాలిన్యాలతో ఆవరింపబడి ఉండటంవల్ల అల్పంగానే ప్రకాశిస్తున్నది. దానిని మనం పరంజ్యోతియైన భర్గోదేవుని ప్రకాశంతో శుద్ధపరచుకోవలసి ఉంది. బంగారం మూసలో కరిగి తన మాలిన్యాలను పోగొట్టుకుని ప్రకాశించునట్లు మనం మన ఆత్మను పరమాత్మ ప్రకాశంతో శుద్ధపరచుకోవాలి. మహర్షి దయానంద సరస్వతిగారు తమ యుజుర్వేద భాష్యంలో 'భర్గః' పదమునకు ఈ విధంగా అర్థాలు వ్రాశారు.

1. **సర్వదోష ప్రదాహకం తేజోమయం శుద్ధమ్** (యజు. 22-9)
2. **భృజ్జన్తి దుఃఖాని యస్మాత్ తత్** (యజు. 30-2)
3. **సర్వదుఃఖ ప్రణాశకం తేజః స్వరూపమ్** (యజు. 36-3)

ఇట్లే మన ఋషులు మహర్షులు భర్గుడంటే విశుద్ధ తేజఃస్వరూపమని వివరించారు.

**'భర్గః'** పదమునకు విశుద్ధ జ్ఞానమని మరియొక అర్థం. పరమేశ్వరుడు సర్వజ్ఞుడు. జీవులమైన మనం అల్పజ్ఞులం. ఇంతేగాక, మన జ్ఞానం భ్రమ ప్రమాదాలతో కూడియుంటుంది. అట్టి మన జ్ఞానాన్ని విశుద్ధపరచుకొని వికసింపచేసుకోవటానికి భర్గోదేవుని ఉపాసించవలసి ఉంది. అతని నుపాసించటంవల్ల అగ్నిసమీపంలో చలి దూరమైనట్లు మన అవిద్యా అజ్ఞానాలు తొలగిపోయి జ్ఞానవికాసం కలుగుతుంది.

మనం వసించే ఈ ప్రపంచంలో అనేక విషయసుఖాలున్నాయి. మన కోరికలు ఇంద్రియసుఖాలవెంట పరుగులు తీస్తున్నాయి. లోకంలో వాటిని

పొందటానికి వెలుగుమార్గాలేకాక అనేక చీకటి దారులునూ ఉన్నాయి. వెలుగు మార్గాలకన్న చీకటి దారులే తేలికనిపిస్తున్నాయి. ఫలితంగా మానవుడు తప్పు మార్గాన్ననుసరించి అంధకారంలోనికి పోతున్నాడు. అనేక పాపాలు చేసి కాలాంతరంలో అనేక కష్టాల ననుభవిస్తున్నాడు. అప్పటికికాని అతనికి పశ్చాత్తాపం కలగటం లేదు. అనేక జీవితానుభవాల ననుభవించినా ముందుగానే మార్గమేదో నిర్ణయించుకోలేక వివశుడైపోతున్నాడు. అప్పుడే మానవునకు భర్గోదేవుని ప్రకాశ మవసరమౌతుంది. ఆ విశుద్ధ ప్రకాశంలో అజ్ఞానపు తెరలు తొలగిపోయి సరియైన మార్గమేదో గోచరిస్తుంది.

ఏ భక్తునకు భర్గోదేవుని ప్రకాశం లభిస్తుందో అతడు విశుద్ధమైన జీవితాన్ని గడుపుతాడు. అతని మనోవాక్కాయాలు పాపరహితము లౌతాయి. తద్వారా అతనికి అన్నీ సుఖాలే ప్రాప్తిస్తాయి.

నేడు లోకంలో భర్గః పదము పురాణోక్త కైలాసాధిపతియైన శివ నామముగా ప్రచారం పొందింది. కాని, పరమేశ్వరుడు ఏకదేశవాసి కాడు. అతడు సర్వవ్యాపకుడనీ - సర్వత్రా సమానంగా వ్యాపించి యున్నాడనీ వేదం నొక్కి వక్కాణిస్తుంది. **"స పర్యగా చ్ఛుక్ర మకాయ మవ్రణ మస్నావిరం శుద్ధ మపాప విద్ధమ్....** (యజుర్వేదం - 40-8) అతడు సర్వవ్యాపకుడు, సర్వశక్తిమంతుడు. కాయరహితుడు- స్థూల సూక్ష్మ కారణ శరీరరహితుడు. వ్రణరహితుడు - ఎట్టి లోపములూ లేని పరిపూర్ణుడు. అస్నావిరం=స్నాయు (నాడీ) బంధరహితుడు. శుద్ధుడు. అపాపవిద్ధుడు - జీవులవలె పాపకర్మలు చేసి పాపబద్ధుడు కాడు.

అట్టి విశుద్ధుడైన పరమేశ్వరునకే భర్గః పదం వర్తిస్తుందికానీ పూరాణోక్త కైలాస లోకాధిపతికి కాదు.

## 'భర్గః' సారాంశం

న్యాయకారివైన ఓ పరమేశ్వరా ! నీ సృష్టి స్థితి లయ పాలనాది కర్మలన్నీ న్యాయపూర్ణములు. జీవులు చేయు కర్మలకును నీవు న్యాయముగానే ఫలముల ఇత్తువు. కావున, నీవు పాపరహితుడవు. శుద్ధుడవు. నిన్నుపాసించి మేమును నీవంటి వారమే అగుదుము గాక! నీవు సర్వజ్ఞుడవు. విశుద్ధ జ్యోతివి. మా అవిద్యాది క్లేశముల నన్నిటిని దగ్ధంచేసి మమ్ము ధర్మమార్గాన నడుపుము.

# దేవస్య

'దేవస్య' అంటే '**దివ్య గుణాలు గల దేవునియొక్క**' అని అర్థం. పూర్వం వర్ణింపబడిన దివ్యగుణాలన్నీ ఎవనిలో ఉన్నాయో అట్టి దేవదేవుని ధ్యానింపుమని ఈ పదం చెబుతున్నది.

'దేవ' పదానికి వైదిక సాహిత్యంలో విస్తృతమైన అర్థాలున్నాయి. సామాన్యంగా పరోపకారంకొరకు పాటుపడేవారిని దేవతలనీ, తనకొరకే పాటుపడేవారిని మానవులనీ అనవచ్చు. పరోపకారం చేసేవారు కేవలం మానవులే కానక్కరలేదు. భూమి జలము అగ్ని వాయువు ఆకాశము సూర్యుడు చంద్రుడు నక్షత్రాలు మొదలైన జడపదార్థాలుకూడా మౌనంగానే పరోపకారం చేస్తున్నాయి. ప్రాణులహితం కొరకే అవి సృజింపబడ్డాయి. అందుచే వాటిని దేవత లన్నారు. ఇవి జడ దేవతలు. అంటే జ్ఞానంలేని దేవతలు.

చేతనులైన మానవులలో పరోపకారాది దివ్యగుణాలు గలవారందరినీ దేవతలనవచ్చు. విద్వాంసులు, వీరులు, దేశభక్తులు, సేవాతత్పరులు, లోక కళ్యాణంకొరకు పాటుపడే సాధుసంన్యాసులు మొదలైనవారంతా దేవతలే. వ్యక్తిపరంగా ఆలోచిస్తే జన్మనిచ్చిన తల్లిదండ్రులు, విద్యా సదాచారాలను నేర్పిన ఆచార్యులు, ధర్మోపదేశం చేసే అతిథులు మొదటగా లెక్కింపదగిన దేవతలౌతారు. కనుకనే "**మాతృదేవో భవ, పితృదేవో భవ, ఆచార్యదేవో భవ, అతిథి దేవోభవ**" అంటాయి మన శాస్త్రాలు.

సామాజికపరంగా-పక్షపాతం చూపకుండా సమాజ సంక్షేమంకొరకు కృషి చేసేవారందరినీ దేవత లనవచ్చును. దేశపరంగా-ధర్మాత్ముడైన రాజు, సదా దేశహితంకొరకు దేశఉన్నతికొరకు విద్యా విజ్ఞాన రంగాలలో పరిశ్రమించేవారంతా దేవతలు. విశ్వపరంగా-సర్వప్రాణి హితైషులైన ఋషులు మునులు యోగులు

తపస్సులు దేవతలు. వీరిని విశ్వదేవత లనియును అంటారు. **'శం నో దేవా విశ్వదేవా భవన్తు** - (ఋగ్. 7-36-10)' అని సంకల్పించమంటుంది వేదం. అంటే- **'మా దేవతలు విశ్వదేవత లగుదురు గాక'** అని అర్థం. విశ్వదేవత లంటే విశ్వకల్యాణం కొరకు కుల మత జాతి ప్రాంతాది భేదాలు లేకుండా మానవమాత్రులందరికి మేలు చేసేవారు.

దేవత లెవరు ? అనే ప్రశ్నకు యాస్కమహర్షి తన నిరుక్త శాస్త్రంలో **'దేవో దానాద్వా, దీపనాద్వా, ద్యోతనాద్వా, ద్యుస్థానే భవతీతివా'** అని సమాధానమిచ్చారు. అంటే ఎవరు దానశీలురో, ప్రకాశిస్తారో, ప్రకాశింప చేస్తారో, ద్యుస్థానంలో (ఆకాశంలో) ఉంటారో వారందరూ దేవతలే నని భావం. ఈ గుణాలు జడపదార్థాలలో ఉంటే అవి జడదేవతలు, చేతనులలో ఉంటే చేతన దేవతలు.

అయితే, ప్రకరణాన్ననుసరించి (ప్రసంగాన్నిబట్టి) ఇచట ఈ గాయత్రీ మంత్రంలో దేవ పదము పరమేశ్వరునకు వర్తిస్తుంది. పరమేశ్వరుడు స్వయం ప్రకాశకుడు. అతని వల్లనే మిగతా దేవతలన్నీ ప్రకాశిస్తున్నాయి. భూలోక భువర్లోక స్వర్లోకాలలో ఉండే సమస్త జడదేవతలను సృజించిన వాడునూ పరమేశ్వరుడే. మనం తెలుసుకోవలసినది, ఉపాసించవలసినదికూడా అతడినే. వేదోపదేశ మేమంటే -

**ఋచో అక్షరే పరమే వ్యోమన్ యస్మిన్**
**దేవా అధి విశ్వే నిషేదుః ।**
**యస్తన్న వేద కిమృచా కరిష్యతి**
**య ఇత్తద్విదుస్త ఇమే సమాసతే॥** (ఋ. 1-164-39)

ఎవనిలో ఋగ్వేదాది సమస్త వేదజ్ఞానము, సమస్త జడ చేతన దేవతలు స్థితములై ఉన్నాయో అతనిని తెలుసుకొని ఉపాసించక కేవలం వేదపాఠం వల్లించటం వల్ల ప్రయోజనమేముంటుంది? ఎవరు ఆ ఆనందస్వరూప పరమాత్మను తెలుసుకొని ఉపాసిస్తారో వారే పరమానందాన్ని పొందగలుగుతారు. ఋషులును ఇట్లే ఉపదేశించారు-

ఏకో దేవః సర్వభూతేషు గూఢః
సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా
సర్వాధ్యక్షః సర్వభూతాధివాసః
సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ ॥ (శ్వేతాశ్వతరోపనిషత్ 6-11)

ఒకే ఒక దేవుడు సర్వభూతాలలోను గూఢంగా దాగియున్నాడు. అతడు సర్వవ్యాపకుడు. సర్వభూతాంతరాత్మ. సర్వభూతాధివాసుడు. సాక్షిగా జీవులు చేసే కర్మలను తెలుసుకుంటూ న్యాయంగా ఫలాల నిస్తున్నాడు. అన్నిటిలో నుండియు దేనితో నంటక కేవలునిగా నిర్మలునిగా ఉన్నాడు. అతడు నిర్గుణుడు - సత్వరజస్తమోగుణ రహితుడు. (ఈ త్రిగుణాలు ప్రకృతివేకాని పరమాత్మవి కావు).

అట్టి దేవదేవుని ధ్యానింపుమంటుంది ఈ **'దేవస్య'** పదం.

'దేవ' పదము **"దివు-క్రీడా విజిగీషా వ్యవహార ద్యుతి స్తుతి మోద మద స్వప్న కాంతి గతిషు"** అనే సంస్కృత ధాతువుతో నిర్మించబడుతుంది. ఈ అర్థాలన్నీ పైన చెప్పుకున్న ఏకేశ్వరునికే వర్తిస్తాయి.

అతడు క్రీడా=పరసహాయం లేకుండానే తానొక్కడే క్రీడగా ఈ సృష్టిని చేస్తాడు. విజిగీషా = సదా అతడు జయశీలుడే - అతని నెవరూ జయించలేరు. వ్యవహార = అతడు న్యాయాన్యాయ వ్యవహార కుశలుడు. ద్యుతి = స్వయం ప్రకాశకుడు. స్తుతి = స్తుతింపదగినవాడు. మోద = ఆనంద స్వరూపుడు. మద = మదోన్మత్తుల మద మడగిస్తాడు. స్వప్న = జీవుల నిద్రపుచ్చి విశ్రాంతి నిస్తాడు. కాంతి = కామించదగినవాడు - అందరిచే కోరతగినవాడు. గతి = గతిశీలుడు. జడ జగత్తును గతివంతం చేస్తున్నాడు. ఈ విధంగా దేవ పదంలోని అర్థాలన్నీ పరమేశ్వరునకు వర్తిస్తాయి. అందుచేతనే మనం అతనిని **"దేవుడు"** అంటున్నాము.

యజుర్వేదం దేవతలు 33 (త్రయస్త్రింశతా - 14-31) అంటుంది. దీనిని వివరిస్తూ మహర్షులు - **"పృథివ్యాదయో అష్టావసవః, ప్రాణాదయో దశ వాయవో జీవాత్మా చ, చైత్రాదయో ద్వాదశ మాసాః, విద్యుద్యజ్ఞశ్చ"** అన్నారు

అష్ట వసువులు, ఏకాదశ రుద్రులు, ద్వాదశాదిత్యులు, ఇంద్రుడు, ప్రజాపతి - ఇవన్నీ కలిపి 33. వసువు లంటే ప్రాణులను వసింపజేసేవి. భూమి జలము అగ్ని వాయువు ఆకాశము అనే పంచభూతాలు, సూర్య చంద్ర నక్షత్రాలు కలిసి ఎనిమిది. ఇవి ప్రాణులన్నిటిని తమయందు వసింపచేస్తున్నాయి. కనుక వీటిని వసుదేవత లన్నారు. రుద్రు లంటే రోదింపజేసేవి. జీవుడు ఈ శరీరాన్ని వదలిపెట్టి వెళ్ళిపోయేటప్పుడు ప్రాణాలను తనవెంట తీసుకుపోతాడు. దానితో బంధువులంతా రోదిస్తారు. కనుక ప్రాణ అపాన వ్యాన ఉదాన సమానము లనే పంచ ముఖ్యప్రాణాలను, నాగ కూర్మ కృకల దేవదత్త ధనంజయము లనే పంచ ఉపప్రాణాలను మరియు జీవుని కలిపి ఏకాదశ రుద్రదేవత లన్నారు. ఆదిత్యు లంటే సూర్యకిరణాలు. మన సూర్యకుటుంబములో సూర్యుడు ఒక్కడే అయినా సంవత్సరంలో కొద్ది హెచ్చుతగ్గులుగా అతని కాంతి 12 రకాలుగా ఉంటుంది. ప్రాణి మనుగడకు ఈ పన్నెండు రకాల కిరణాలూ అవసరమే. కనుక వీటిని దేవతలుగా - ద్వాదశాదిత్యులుగా లెక్కించారు. ఇంతేగాక, ఇవి ప్రాణుల ఆయువును హరిస్తున్నాయి. కనుక వీటికి ఆదిత్యు లనే పేరు వచ్చింది. ప్రతీ సూర్యాస్తమయంతో మన ఆయువులో ఒక దినం హరించుకుపోతుంది. ప్రాకృతిక దేవతల పరంగా ఇంద్రు డంటే మేఘాలలోని మెరుపు. ఇది ఒకరమైన విద్యుత్తు. దీనిలో దివ్యగుణాలున్నాయి. సృష్టిలో దీని అవసరం కూడా ఉంది. కనుక ఇదియును దేవతయే. ముప్పైమూడవ దేవత ప్రజాపతి. అంటే అగ్నిహోత్రం. ఇది ఒక అద్భుతమైన దేవత. సర్వప్రాణులకు మేలుచేయటమేకాక ఇది మిగిలిన 32 దేవతలను పాలిస్తుంది. పోషిస్తుంది. కనుకనే మన ఋషులు **"అగ్నిర్ వై దేవానాం ముఖమ్ - అగ్నిహోత్రం దేవతలకన్నిటికి ముఖం వంటిది - నోరు వంటిది"** అన్నారు.

అగ్నిహోత్రంలో వేసిన ఘృతాది ఆహుతులు అణువులుగా పరమాణువులుగా విశ్లేషింపబడి ముందుగా వాయువులో కలుస్తాయి. అవి ఆ వాయువు ద్వారా అన్ని ప్రాణులకు, అన్ని జడపదార్థాలకు చేర్చబడతాయి. కొన్ని

అణువులు శ్వాసద్వారా ప్రాణుల శరీరంలో ప్రవేశించి వాటి శరీరాలను శుద్ధిచేస్తాయి. కొన్ని పరమాణువులు జడ పదార్థాలలో ప్రవేశించి వాటిని సంస్కరించి వాటిని ప్రాణిమనుగడకు అనుకూలంగా చేస్తాయి. కొన్ని మేఘాలలో చేరి అందలి జలమును, అవి వర్షించినపుడు భూమిలో చేరి భూమిని శుద్ధిచేస్తాయి. ఈ విధంగా అగ్నిహోత్రం ప్రజాపతి. ప్రజలను పాలిస్తుంది. కనుక యిది ఒక దేవత. ముఖ్యంగా గాయత్రీమంత్ర పూర్వకంగా వేసే ఆహుతులు పృథివీలోకాన్ని పవిత్రపరుస్తాయి. **'పృథివ్యాం విష్ణుర్వ్యక్రం స్త గాయత్రేణ ఛన్దసా–** "యజు 2–25" అని వేద కథనం.

పై విధంగా యాజ్ఞవల్క్య మహర్షి వేదం చెప్పే 33 దేవతలను వివరించి వీటన్నిటికీ స్వామి, అన్నిటినీ తనయందు గలవాడును కనుక పరమేశ్వరుడు 34వ దేవత యంటాడు. ఈ మహర్షి తెలిపినది వేద సందేశమే.

**"యస్య త్రయస్త్రింశద్ దేవా అజ్గే సర్వం సమాహితాః ।**
**స్కమ్భమ్ తం బ్రూహి కతమః స్విదేవ సః॥**

అథర్వవేదం. 10–7–13

ఎవని అంగములో సమస్తములైన 33 రకముల దేవతా గణములు సమాహితములై యున్నాయో అతడెవరో చెప్పుమని ఎవరైనా అడిగితే 'స్కంభుడు' – అంటే సర్వాధారుడైన పరమాత్మయే నని చెప్పాలి" అనేది వేద సందేశం. కనుక మనం గాయత్రీమంత్రంతో ముఖ్యదేవతయైన పరమేశ్వరుని ఉపాసిస్తూ, నిత్యం అగ్నిహోత్రం చేస్తూ మిగిలిన 33 దేవతలను పూజించాలి. అంటే, వాటిని సంస్కరించి – శుద్ధపరచి సద్వినియోగం చేసుకోవాలి.

## 'దేవస్య' సారాంశం

**సమస్త దేవతలకు దేవతవైన ఓ మహాదేవా ! పరమేశ్వర ! నీవు అనేక దివ్యగుణములతో ప్రకాశించు దేవదేవుడవు. నిన్నుపాసించి మేమును నీ దివ్య గుణములను బొందుదుముగాక !**

# ధీమహి

'ధీమహి' అంటే **'ధ్యానం చేయుదుము గాక'** అని అర్థం. పూర్వం వర్ణించిన సచ్చిదానంద స్వరూపుడు, సృష్టికర్తయునైన దేవదేవునియొక్క **'భర్గః'** స్వరూపాన్ని ధ్యానించాలని ఈ పదం చెబుతున్నది. ధ్యానాన్ని గురించి లోకంలో భిన్న భిన్న అభిప్రాయాలున్నాయి. వివిధ ధ్యానపద్ధతులూ ఉన్నాయి. ఈ సందర్భంలో అన్ని సాంప్రదాయాలవారూ ప్రామాణికంగా అంగీకరించే 'పతంజలి యోగదర్శనం' ధ్యానాన్ని గురించి ఏమి చెబుతున్నదో పరిశీలిద్దాము.

పతంజలి మహర్షి తమ యోగదర్శనాన్ని ప్రారంభిస్తూ ముందుగా 'యోగ' పదమును నిర్వచించారు. **"యోగః చిత్తవృత్తి నిరోధః(1-2) - చిత్త వృత్తులను నిరోధించటమే యోగ"** మన్నారు. ఇచ్చట చిత్తం అంటే మనస్సు. వృత్తులు అంటే దాని వ్యాపారాలు - పనులు. ఆలోచనల నన్నిటినీ నిరోధించటం-ఆలోచనారహిత స్థితిలో ఉండటం యోగ మని భావం. ఆ స్థితిలో జీవునకు ఆత్మ పరమాత్మల సాక్షాత్కారం కలుగుతుంది. అనిర్వచనీయమైన ఆత్యంతిక సుఖానుభవం - ఆనందం కలుగుతుంది. ఆ స్థితివల్ల కలిగే ప్రయోజనా లేమిటో ఒక ఋషి ఈ విధంగా వివరిస్తారు.

**భిద్యంతే హృదయగ్రంథి శ్చిద్యంతే సర్వ సంశయాః ।**
**క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే ॥**

**- ముండకోపనిషత్తు (2-2-8)**

ఆ పరోక్షమైన పరావరుడగు పరమేశ్వరుని సాక్షాత్కారం పొందినపుడు-అట్టి యోగియొక్క హృదయగ్రంథి-అవిద్యాముడి విడిపోతుంది. అంటే దేహాత్మభ్రాంతి తొలగిపోతుంది. సర్వ సందేహాలు తీరిపోతాయి. కర్మ బంధనాలన్నీ తొలగిపోయి ముక్తుడౌతాడు.

అట్టి స్థితిని పొందటమే మానవజన్మయొక్క పరమలక్ష్యం కావాలంటారు మన ఋషులు. ఆ స్థితిని అందుకోవడానికి పతంజలి మహర్షి 8 అంగములను

తెలిపారు. వీటిని మనం మెట్లుగా భావించవచ్చు. అందులో ధ్యానం అనేది ఏడవ మెట్టు. అందుచే ధ్యానం చేయగోరేవారు ముందుగా యమ నియమాలను పాటిస్తూ జీవితాన్ని గడపాలి. స్థిరంగా సుఖంగా ఎక్కువకాలం కూర్చోగలిగే ఆసనంలో కూర్చోవాలి. అనంతరం తన శరీరంలోనే ఏదైనా ఒక స్థానంలో - హృదయం, కంఠం, భృకుటి సహస్రారం మొదలైన ఏదేని ఒక స్థానంలో మనస్సును ధారణ చెయ్యాలి. నిలిపి యుంచాలి. అప్పుడు ధ్యేయాన్ని - ధ్యానం చెయ్యాలనుకున్నదానిని ధ్యానం చెయ్యాలి. ఆ ధ్యానం పరిపక్వమయితే సమాధి సిద్ధిస్తుంది. అదే ఎనిమిదవ మెట్టు. వీటిని గురించి కొంత వివరంగా తెలిసికొందాము.

## యమములు

**'అహింసా సత్యాస్తేయ బ్రహ్మచార్యాపరిగ్రహా యమాః'**

-యోగ దర్శనం (2-30)

అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము - అను ఐదింటిని యమము లంటారు. ఇవి యింద్రియాలను, మనస్సును విషయాల నుండి యమింపచేస్తాయి. నిగ్రహింపచేస్తాయి. కనుక వీటికి 'యమము' లనే పేరు వచ్చింది.

**1.** అహింసా = 'సర్వథా సర్వదా సర్వభూతానామ్ అనభిద్రోహః' మనోవాక్కాయములతో ఏ ప్రాణిని ఎప్పుడునూ ఏవిధంగానూ హింసించకుండా ఉండటం, సర్వప్రాణులను మిత్రదృష్టితో చూడటం, మిత్రదృష్టితో వ్యవహరించటం అహింస యనబడుతుంది.

**2. సత్యం= 'సత్యం యథార్థే వాజ్ మనసే, యథా దృష్టం యథానుమితం యథా శృతం తథా వాజ్మనశ్చేతి'** - మనస్సులో ఉన్నదానినే వాణితో పలకటం సత్యమనబడుతుంది. అంటే, మనం ఏమి చూచామో, ఏమి విన్నామో, ఏమి చదివామో, ఏమి ఊహించామో - వాటివల్ల మన మనస్సులో ఏ జ్ఞానం కలిగిందో దానిని అట్లే వాక్‌తో చెప్పటం సత్యమౌతుంది. ఆ చెప్పటం కూడా స్పష్టంగా ఉండాలి. శ్రోతలను తప్పు దారి పట్టించేదిగా ఉండకూడదు. అట్టి వాక్కునే సత్యమంటారు.

**3. అస్తేయం** = ఎవరి వస్తువూ దొంగిలించకుండా ఉండాటాన్ని, మనస్సులో కూడా అట్టి భావం లేకుండా ఉండటాన్ని అస్తేయమంటారు.

**4.** బ్రహ్మచర్యం = స్త్రీ పురుషులు సంతానార్థం మాత్రమే వారి రజోవీర్యాలను ఖర్చుపెడుతూ మిగిలిన సమయాలలో నిగ్రహపరులై ఉండటాన్ని బ్రహ్మచర్య మంటారు. ఇది శారీరక బ్రహ్మచర్యం. దీనివల్ల వారి రజోవీర్యాలు ఓజస్సుగా పరిణమించి గొప్ప శారీరక, ఆత్మిక శక్తులు లభిస్తాయి.

బ్రహ్మ పదమునకు పరమేశ్వరుడు, వేదము అనే మరి రెండర్థాలున్నాయి. కనుక, పరమేశ్వర చింతనలోను, వేదస్వాధ్యాయంలోను గడపటాన్ని ఆత్మిక, బౌద్ధిక బ్రహ్మచర్యము లంటారు. ధ్యానసాధనకు, ఆత్మికోన్నతికి ఈ మూడు బ్రహ్మచర్యాలు అవసరమే.

**5. అపరిగ్రహం:** తన అవసరాలకు మించిన ఆస్తిపాస్తులను సంపాదింపక తక్కువ జీవితావసరాలతో కాలం గడపటాన్ని అపరిగ్రహమంటారు. అట్లే, అనావశ్యక ఆలోచనలను కూడా రానీయకుండా జాగ్రత్తపడాలి.

పై ఐదు యమములు చాలా ముఖ్యమైనవి. వీటిని జాతి దేశ కాల సమయము లనే సంకుచితములు చూపక సర్వకాల సర్వావస్థలయందూ పాటించాలంటాడు (2-31) పతంజలి మహర్షి. వీటిపైననే మిగిలిన సాధనలన్నీ ఆధారపడి ఉంటాయి. ఇంతేగాక, ఇవన్నీ సామాజిక నియమాలు. మానవుడు సామాజికప్రాణి. కనుక సామాజిక నియమాలు పాటించటం ప్రతీవ్యక్తి యొక్క కనీస ధర్మం.

## నియమములు

**'శౌచ సంతోష తపః స్వాధ్యాయేశ్వర ప్రణిధానాని నియమాః'** (2-32)

1. **శౌచము :** శౌచమంటే శుద్ధత - పవిత్రత. ఇది బాహ్యము, ఆభ్యంతరము నని రెండు విధాలుగా ఉంటుంది. శరీరాన్ని, వస్త్ర పాత్ర గృహారామాదులను శుభ్రంగా పెట్టుకోవటం, శుద్ధమైన సాత్త్విక ఆహారపానీయాలను సేవించటం, ధనార్జనలో పవిత్రంగా ఉండటం బాహ్యశుద్ధి యనబడుతుంది. సత్యభాషణ, ధర్మాచరణ, స్వాధ్యాయ సత్సంగాదుల ద్వారా మనస్సులోని స్వార్థ సంకుచిత భావాలను, రాగద్వేషాలను తొలగించుకోవటం అభ్యంతరశుద్ధి యనబడుతుంది. ధ్యానానికి ఈ రెండూ అవసరమే.
2. **సంతోషము :** తన జ్ఞాన బల సాధనాలతో ధర్మపూర్వకంగా తనకు ప్రాప్తించిన వాటితో సంతృప్తిచెంది సంతోషంగా ఉండటం, అధికంగా ఆశించకుండటం సంతోష మనబడుతుంది.

3. **తపస్సు :** ధర్మపూర్వక కర్తవ్యకర్మల నాచరిస్తున్నపుడు ఎదురయ్యే కష్ట సుఖాలను, హానిలాభాలను, మానావమానాలను, శీతోష్ణాలను, ఆకలిదప్పికలను ప్రసన్నతాపూర్వకంగా సహించటాన్ని తపస్సు అంటారు.

4. **స్వాధ్యాయం :** ఆత్మపరమాత్మల జ్ఞానాన్నీ, యోగసాధనలనీ వివరించే వేద శాస్త్రాల నధ్యయనం చెయ్యటం లేదా అర్థభావనతో 'ఓ3మ్' నామ జపం చెయ్యటాన్ని స్వాధ్యాయ మంటారు ఋషులు.

5. **ఈశ్వరప్రణిధానం :** తన శరీర మనోబుద్ధులు, సర్వసంపదలు ఈశ్వర ప్రదత్తములుగా భావించి అత్యంత భక్తితో తన సర్వస్వాన్ని సర్వవ్యాపక సర్వేశ్వరున కర్పించటాన్ని ఈశ్వర ప్రణిధాన మంటారు. అతడు సదా మన మనోవాక్కాయ కర్మలను వీక్షిస్తున్నాడని భావిస్తూ భయభక్తులతో జీవితం గడపాలి. సదా సత్కర్మలనే ఆచరిస్తూ వాటి ఫలాల నీశ్వరున కర్పిస్తూ శరణాగత జీవనాన్ని గడపాలి. ఈశ్వర ప్రాప్తి తప్ప మరే లౌకిక ప్రయోజనాన్ని ఆశించకుండా అనన్యభక్తుడై ఉండాలి. అట్టి ఈశ్వర ప్రణిధానమే మనను ధ్యానమగ్నులను చేస్తుంది. **'సమాధి సిద్ధి రీశ్వర ప్రణిధానాత్ - (2-45) - ఈశ్వర ప్రణిధానం సిద్ధించిన యోగికి శీఘ్రంగానే సమాధి ప్రాప్తిస్తు"**దంటాడు పతంజలి మహర్షి. కనుక ధ్యానసాధన చేసేవారి కిది చాలా ముఖ్యమైనది.

## ఆసనము

**'స్థిర సుఖ మాసనమ్'** (2-46)-ఏ స్థితిలో కూర్చుంటే ఎక్కువ సమయం స్థిరంగాను సుఖంగాను ఉంటుందో దానిని ఆసన మంటారు. పరమేశ్వర ధ్యానానికి పద్మాసనము, సిద్ధాసనము, స్వస్తికాసనము మొదలైనవి అనుకూలంగా ఉంటాయి. లేదా వారికి అనుకూలంగా ఉన్న ఆసనంలో కూర్చొనవచ్చును.

## ప్రాణాయామము

**'తస్మిన్‌సతి శ్వాసప్రశ్వాసయో ర్గతివిచ్ఛేదః ప్రాణాయామః'** (2-49) ఆసనంలో స్థిరత ఏర్పడిన తదుపరి శ్వాస ప్రశ్వాసల స్వాభావిక గతిని యథాశక్తి నిరోధించటాన్ని ప్రాణాయామ మంటారు.

నేడు చాలా రకాల ప్రాణాయామ పద్ధతులు ప్రచారంలో ఉన్నాయి. వాటిలో స్వామీ రాందేవ్ గారి పద్ధతులు ఆరోగ్యానికి ఎక్కువ మేలు చేస్తున్నాయి.

జపధ్యానాలు చేసేముందు ఏదైనా ఒక పద్ధతిలో కొద్దిసేపు ప్రాణాయామం చెయ్యటం మంచిది. దానివల్ల చంచలంగా ఉన్న మనస్సు శాంతిస్తుంది. మనస్సు ధ్యానోన్ముఖమౌతుంది. ప్రాణాయామం అనుభవజ్ఞుల సమక్షమున – సమ్ముఖమున నేర్చుకుని, అనంతరం విడిగా చేసుకోవాలి.

## ప్రత్యాహారము

మనస్సును ప్రాపంచిక విషయ చింతనలనుండి మరలించి పరమేశ్వర చింతనవైపు నడిపించటం ప్రత్యాహార మనబడుతుంది. ఇందుకు యజుర్వేదం 34వ అధ్యాయంలోని మనసా పరిక్రమ మంత్రాలను అర్థభావనతో జపించటం ఎక్కువ అనుకూలంగా ఉంటుంది.

మహర్షి దయానంద సరస్వతి ప్రదర్శిత **'సంధ్యావందన విధి'** ననుసరిస్తే ఆసన ప్రాణాయామ ప్రత్యాహారాలు, ధారణా ధ్యానాలు ఒక క్రమపద్ధతిలో జరుగుతాయి. మాచే ప్రచురింపబడిన **'సంధ్యావందనము-వైజ్ఞానిక సమాలోచనము'** చదివితే మీకు మరెన్నో విషయాలు తెలియగలవు.

## ధారణా

**'దేశబంధ శ్చిత్తస్య ధారణా'** (3-1) – ఏకాంతమున ఆసనబద్ధులై కళ్ళు మూసుకొని మనస్సును మస్తక భ్రూమధ్య నాసికాగ్ర కంఠ హృదయ నాభి ప్రదేశాలలో ఏదేని ఒక స్థానమున నిలిపి ఉంచటాన్ని ధారణ అంటారు. మనస్సు బాహ్య విషయాలవైపు మరలకుండా యిది సహకరిస్తుంది.

## ధ్యానము

**"తత్ర ప్రత్యయైకతానతా ధ్యానమ్'** (3-2)

ధారణచేసిన చోటనే మనస్సును నిలిపియుంచి పరమేశ్వరుని ఏదేని ఒక గుణవాచకాన్ని – గుణాన్ని సూచించే నామాన్ని తెంపులేకుండా అర్థభావనతో జపించటాన్ని **'ధ్యానం'** అంటారు.

ఇందుకు ప్రారంభంలో గాయత్రీమంత్రాన్ని అర్థభావనతో జపిస్తూ భర్గుని – శుద్ధతేజస్సును ధ్యానించటం చాలా అనుకూలంగా ఉంటుంది. క్రమంగా అర్థభావనతో కేవలం 'ఓ3మ్' నామ జపంలోకి మరలితే మనస్సు సమాధి వైపుకు పయనిస్తుంది. ఆలోచనా రహిత స్థితికి చేరుకుంటుంది.

# సమాధి

**"తదేవార్థమాత్ర నిర్భాసం స్వరూప శూన్యమివ సమాధిః-(3-3)"**

పైన వివరించిన ధ్యానమే కేవలం జప వాక్యముయొక్క అర్థరూపంతో భాసిస్తూ క్రమంగా ధ్యేయాకారంగా భాసించటాన్ని **'సమాధి'** అంటారు. అంటే - ధారణా ధ్యాన సమాధు లేకమై ధ్యేయవస్తు సాక్షాత్కారం పొందట మని భావం.

మనం ఇంతవరకు పరమేశ్వరునిగురించి శాస్త్రప్రమాణాలతోను, అనుమాన ప్రమాణాలతోను, తర్కంతోను తెలుసుకుంటూ వస్తున్న మన శాబ్దికజ్ఞానం సమాధిస్థితికి చేరుకుంటే సాక్షాత్కృతజ్ఞాన మౌతుంది. అంటే - **'ఓ3మ్'** నామక సర్వవ్యాపక సర్వేశ్వరుని సాక్షాత్కారం కలుగుతుంది. పరమేశ్వర సాక్షాత్కారానికి దీనికన్న మించిన మరియొక మార్గం లేదు. **"నాన్యః పంథా విద్యతే ఉయనాయ"** అంటారు ఋషులు.

మనస్సు ప్రకృతితో ఏర్పడిన ఒక దివ్యపదార్థం. మూలప్రకృతి ప్రపంచంగా పరిణమించేటపుడు మొదటగా మహతత్త్వమనే పదార్థం పుడుతుంది. దానితోనే పరమేశ్వరుడు మనస్సును నిర్మించి మన కిచ్చాడు. కన్ను చెవి ముక్కు నాలుక వలెనే యిదికూడా ఒక యింద్రియమే. ఇది అంతరింద్రియం-లోపల ఉండే యింద్రియం. మనస్సే యింద్రియాలు గ్రహించిన విషయాలను జీవులమైన మనకు చేరవేస్తున్నది. మన ఆజ్ఞలను వాటి కందిస్తున్నది. దీనివల్లనే మనం చదువగలుగుతున్నాం, వినగలుగుతున్నాం, ఆలోచించగలుగుతున్నాం. లోకంలో మన విజయాలన్నిటి వెనుక ఇదే ముఖ్యకారణం. ఇది మన స్వాధీనంలోనే ఉంది. కనుకనే మన జీవనయాత్ర యిబ్బందిలేకుండా నడుస్తున్నది.

అయితే, పరమేశ్వర జపధ్యానాలు చేయ యత్నిస్తేమాత్రం మనస్సు మన మాట వినటంలేదు. బయటకు పరుగెడుతున్నదేకాని అంతర్ముఖం కావటంలేదు. దీనికి కారణాలు రెండు. మనస్సు బహిర్ముఖం కావటం దాని ప్రవృత్తి - స్వభావం-అలవాటు. ఇది మొదటి కారణం. మనకు ప్రాపంచిక విషయాలపై ఉన్నంత రాగం భగవంతునిపై లేదు. మనస్సు రాగం ఉన్నవైపే పరుగెడుతుంది.

కనుక ప్రాపంచిక విషయాలవైపే పరుగెడుతున్నది. ఇది రెండవకారణం. అందుచే యిట్టి ప్రవృత్తిగల మనస్సుకు నచ్చచెప్పుకుంటూ మన మిత్రునిగా చేసుకోవాలి. అంతేకాని, 'పాడు మనస్సు' అని కించపరచ కూడదు. భగవద్గీతలోని ఆరవ అధ్యాయం ఆలోచిస్తూ చదువండి. ధ్యానాన్ని గురించి మరికొన్ని విషయాలు మీకు తెలుస్తాయి.

తన యిష్ట దేవతయొక్క రూపాన్ని తదేకంగా మనస్సులో స్మరించటాన్ని ధ్యానమని పెక్కురనుకుంటారు. అందుకు ఏదేని పురాణవర్ణిత దేవతయొక్క విగ్రహాన్ని పెట్టుకుని దానిని షోడశోపచారాలతో పూజిస్తూ ఆ రూపాన్నే ధ్యానం చెయ్యడానికి యత్నిస్తారు. కాని, పరిశీలించిచూస్తే మన మనస్సు ఒక ఆకారంపై నిలువదు. ఆ మూర్తియొక్క వివిధ అవయవాలవెంట తిరుగుతూనే ఉంటుంది. పూజా విధానంలోనూ అనేక క్రియలుంటాయి. దానితో చిత్తములో వివిధ వృత్తులేర్పడతాయి. వృత్తుల నరికట్టటం ధ్యానమౌతుందికాని వృత్తులను ప్రేరేపించే క్రియలు ధ్యానమెట్లవుతాయి? కనుక మనం పై పతంజలి మహర్షి సూచించిన మార్గము ననుసరించుటయే ఉత్తమం.

గాయత్రీమంత్రం మనను దేవుని **'భర్గః'** స్వరూపాన్ని ధ్యానించమంటుంది. పూర్వ ప్రకరణంలో చెప్పుకొన్నట్లు భర్గ డంటే - అవిద్యా అజ్ఞానాలను నశింపజేసే శుద్ధ తేజస్సు. దానినే మనం ధ్యానం చెయ్యాలి. అప్పుడే చిత్తవృత్తుల నిరోధానికి మార్గం సుగమమౌతుంది.

ధ్యానాభ్యాసంవల్ల భౌతికంగాకూడా మనకు చాలా లాభాలు కలుగుతాయి. మనస్సు మన స్వాధీనమౌతుంది. ఏకాగ్రమౌతుంది. అనుకున్న విషయంపై మనస్సును నిలిపి ఆలోచించగలుగుతాం. తద్వారా మనం ఏక సంథాగ్రాహులమై విద్యా విజ్ఞాన రంగాలలో ఔన్నత్యాన్ని పొందుతాం. విద్యార్థులు విద్యలో, కళాకారులు కళలలో, క్రీడాకారులు క్రీడలలో విజయాన్ని పొందగలుగుతారు. ఈ సాధన నిత్యజీవితంలో మనకెంతో సహాయకారి అవుతుంది. కనుకనే ప్రాచీనకాలంలో గురువులు ముందుగా విద్యార్థులకు గాయత్రీ ఉపదేశం చేసి సంధ్యావందనం, ధ్యానం నేర్పేవారు.

ధ్యానసాధనకు చిత్త ప్రసన్నత చాలా అవసరం. ఏ కారణంచేతనైనా చిత్తంలో అలజడి కలిగితే ధ్యానం చెయ్యటం చాలా కష్టమౌతుంది. చిత్తాన్ని సదా ప్రసన్నంగా ఉంచుకోవడానికి పతంజలి మహర్షి ఒక చక్కటి ఉపాయాన్ని చెప్పారు. అదేమంటే -

**మైత్రీ కరుణా ముదితోపేక్షాణాం, సుఖదుఃఖ**
**పుణ్యాపుణ్య విషయాణాం భావనాతః చిత్త ప్రసాదనమ్**

-యోగదర్శనం. 1-33

లోక వ్యవహారంలో మనతో సమానమైన వారితో మైత్రితో మెలగటం, ఉన్నతి చెందేవారిని చూసి అసూయపడక ముదితవహించటం - సంతోషించటం, దీనులపట్ల కరుణతో వ్యవహరించటం - వారికి చేతనైనంత సాయం చేయటం, దుష్టులు దుర్మార్గుల పట్ల ఉపేక్షవహించటం అనే నాలుగు విషయాలను పాటిస్తే మనసు కలత చెందక ప్రసన్నంగా ఉంటుంది. శ్రీకృష్ణభగవానుడు గీతలో చెప్పినట్లు "ప్రసన్న చేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతి" (2-65) - ప్రసన్న చిత్తుని బుద్ధి శీఘ్రంగానే పరమేశ్వర ధ్యానంలో స్థిరపడుతుంది.

ముముక్షువులు - ముక్తిని పొందగోరేవారు నిత్యం కనీసం రెండు గంటలయినా ధ్యానాభ్యాసం చెయ్యాలంటారు పెద్దలు. అట్టి వ్యక్తి తానెట్టి స్థితిలో ఉన్నా పరమేశ్వరుని దివ్యానందాన్ని పొందగలుగుతాడు. చాలా తృప్తిగా జీవిస్తాడు.

## ధీమహి-సారాంశం

**హే సర్వవ్యాపక సర్వసంరక్షక సర్వేశ్వర ! నీవు మాకు అత్యంత సన్నిహితుడవై అంతర్యామిగా నున్నావు. మా సమస్త క్లేశాలను, అజ్ఞానాన్ని పోగొట్టగల నీ భర్గః స్వరూపాన్ని - విశుద్ధ తేజస్సును మేము నిత్యము మా హృదయమున ధ్యానింతుము గాక ! నీ దివ్యానందము నొంది కృతార్థుల మగుదుము గాక !**

# ధియః

'ధియః' పదము దీని తదుపరి పదంతో సంధి ఏర్పడటంవల్ల ఈ మంత్రంలో 'ధియో'గా మారింది. 'ధియః' అంటే **'బుద్ధులను'** అని అర్థం. గాయత్రీ మంత్రంలోని చివరి పాదం ప్రార్థనా పాదం. మొదటి పాదంలో పరమేశ్వరుని ముఖ్యగుణాల స్తుతి ఉంది. రెండవ పాదం అట్టి దివ్యగుణయుక్తుని ధ్యానించమంటుంది. చివరి పాదంలో ప్రార్థన ఉంది. అది అత్యుత్తమ పదార్థంకొరకు ప్రార్థన. లోకంలో అన్నిటికన్న గొప్పది, ఉత్తమమైనది ఏది ?

ధనధాన్యాలు, సిరిసంపదలు, కీర్తిప్రతిష్ఠలు గొప్పవే అయినా వాటి వెనుక రాగద్వేషాలు అహంకారఅభిమానాలు దాగి ఉంటాయి. అవి మనను వ్యసనాలవైపు, పాపాలవైపు తీసుకుపోగల అవకాశం ఉంది. ఇంతేగాక, అవి క్షణికాలు. ఏ క్షణంలో అవి మననుండి దూరమైపోతాయో తెలియదు. మరి, ప్రమాదరహితమైనదీ అత్యుత్తమమైనదీ ఏది ? ఇది ఆలోచించవలసిన విషయం. ఈ జిజ్ఞాస ఆది ఋషులకును కలిగింది. వారు పరమేశ్వరీయ జ్ఞానమైన వేదాలను తరచి తరచి చూచారు. అప్పుడు వారికి గోచరించింది ఒక అద్భుతమైన పదార్థం. సర్వోత్తతమైన పదార్థం. అదియే బుద్ధి.

ప్రారబ్ధవశాత్తు పేదవాడిగా పుట్టినా వికసించిన బుద్ధిగలవాడు అన్నిటినీ సంపాదించుకోగలుగుతాడు. అదిలేకుంటే భాగ్యవంతుల యింట పుట్టినా అన్నిటిని పోగొట్టుకుంటాడు. కనుక మనం బుద్ధివికాసం కొరకు ప్రార్థించటమే ఉత్తమం. ఇచట బుద్ధి యంటే సద్బుద్ధి యనియే గ్రహించాలి. తెలివితేటలెన్ని ఉన్నా వాటిని సద్వినియోగం చేస్తే సత్ఫలితాలొస్తాయికాని దుర్వినియోగం చేస్తే ఎట్లొస్తాయి ? దుర్వినియోగం చేస్తే ఆ తెలివితేటలే దుర్గతిని కలిగిస్తాయి. ఈ విషయం తదుపరి ప్రకరణంలో వివరంగా తెలిసికుందాము. ముందుగా బుద్ధి యనే పదార్థం అంటే ఏమిటో తెలిసికొందాము.

బుద్ధి యనేది మూలప్రకృతితో ఏర్పడిన సూక్ష్మపదార్థం. పరమేశ్వరుడు సృష్టిచేయ సంకల్పించినపుడు మూలప్రకృతినుండి ముందుగా 'మహతత్త్వ'మనే పదార్థం ఏర్పడుతుంది. దానితోనే పరమేశ్వరుడు విశిష్టమైన బుద్ధిని నిర్మించి మానవుల కిచ్చాడు. ఆ విశిష్ట బుద్ధితోనే మానవుడు ప్రగతిని సాధించి అద్భుతాలను చేస్తున్నాడు. ఈ బుద్ధితోనే మానవుడు సత్యాసత్యాలను, ధర్మాధర్మాలను, కర్తవ్యాకర్తవ్యాలను తెలిసికొంటున్నాడు. సత్యాన్ని ధర్మాన్ని గ్రహించి కర్తవ్యాన్నాచరించి ఆత్మికోన్నతిని పొందుతున్నాడు.

వైదిక వాఙ్మయంలో మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అను పదములు పర్యాయవాచకాలుగా కనబడతాయి. ఇవి ఒకే పదార్థం యొక్క వివిధ గుణాలని చెప్పవచ్చు. ఆ పదార్థమే అంతఃకరణం. లేదా అంతరింద్రియం. ఇది ప్రాణుల శరీరంలోపల హృదయప్రాంతంలో జీవుని వద్ద ఉంటుంది. జీవునకు సూక్ష్మశరీరంగా ఉపకరణంగా సాధనంగా పనిముట్టుగా ఉంటుంది. ఇది జీవునికి యింద్రియాలతో సంబంధం కలిగిస్తూ ఉంటుంది. దీనితోనే జీవునకు ఇంద్రియసుఖాలు, అనుభవాలు, అనుభూతులు కలుగుతున్నాయి. శారీరక క్లేశాలుకూడా దీనివల్లనే జీవునకు తెలుస్తున్నాయి. మనస్సును అన్యవిషయంవైపు మరలించగలిగితే వ్యాధి బాధలు తెలియవు. అద్భుతమైన ఉపశమనం కలుగుతుంది. ప్రకృతి పరిణామంగా మొదటిమార్పు మహతత్త్వమైతే ద్వితీయ పరిణామం అహంకారం. అట్టి అహంకారంనుండే స్థూల భూతాలకు కారణమైన తన్మాత్రలు, ఇంద్రియాలు, మనస్సు పుట్టాయని మనశాస్త్రాలు చెబుతాయి. ఇచట అహంకార మంటే మనస్సులోని అహంకార భావనకాదు. ఇది ఒక సూక్ష్మ ప్రాకృతిక పదార్థం.

అహంకారాన్నుండి పుట్టిన అంతఃకరణాన్ని సంక్షిప్తంగా మనస్సు అని పేర్కొంటాయి మన శాస్త్రాలు. అదే సంకల్ప వికల్పాలు చేసేటప్పుడు మనస్సు అనబడుతుంది. ఆలోచనలు చేసి నిర్ణయానికి వచ్చినపుడు బుద్ధి అనబడుతుంది.అది అనేక అనుభవాలను, అభిరుచులను, ఆలోచనలను, కర్మజన్య సంస్కారాలను తనలో దాచుకొంటుంది కనుక దానినే చిత్తమన్నారు. వీటితోబాటు అది అహంకారాన్ని కలిగి ఉంటుంది. తన ప్రత్యేకతను, వ్యక్తిత్వాన్ని నిలుపుకోవడానికి

ప్రయత్నిస్తుంది. దానితో సారూప్యత చెందిన జీవుడు శరీరమే తా ననుకుంటాడు. అట్టి అంతఃకరణం బద్ధజీవులన్నిటికీ ముక్తిపర్యంతం ఉంటుంది. అసలు ఈ మనస్సే జీవున్ని సంసార సముద్రంలో బంధించింది. కనుకనే 'మన ఏవ మనుష్యాణాం బంధనం మోక్షకారణం - మనస్సే మనిషిని బంధనంలో పడవేస్తూందనీ, అదే వివేకవంతమైతే మోక్షాన్ని కలిగిస్తుందనీ అంటాయి మన శాస్త్రాలు.

అయితే మానవ ప్రాణిలో బుద్ధి అనే భాగం వికసించి ఉంటుంది. అది కేవలం నిశ్చయాత్మక వృత్తిగానే గాక ఒక జ్ఞానగ్రహణ సాధనంగా, విచారశక్తిగా సృజనాత్మకశక్తిగా (క్రియేటివిటీగా) మరెన్నెన్నో శక్తులకు నిలయంగా కనబడుతుంది. వేదాలను పరిశీలించి చూస్తే మనోవిజ్ఞానానికి చెందిన మంత్రా లనేకం కనబడతాయి. అది ప్రజ్ఞానంగా, చేతగా, ధృతిగా (ధారణావతిగా) – చతుర్వేదాలను ధారణచేయగల శక్తిగా వర్ణించబడింది. కనుకనే పూర్వ పరిచ్ఛేదంలో (పేరాలో) మానవులలోని విశిష్టబుద్ధి ప్రకృతి మొదటి పరణామమైన మహతత్త్వం నుండి పుట్టినదిగా వ్రాయటం జరిగింది. ఇంతేగాక, యమ నియమాది అష్టాంగయోగసాధనలు చేసే వారిలో బుద్ధి పరిణతి చెందుతూ మేధగా, ప్రజ్ఞగా, ప్రతిభగా, చివరకు ఋతంభరాప్రజ్ఞగా ఎదుగుతుంది. అది ఆత్మ పరమాత్మల సాక్షాత్కారాన్ని, వేదమంత్రాల అర్థదర్శనాన్ని కలిగించి ఆనందతృప్తితో బాటు జ్ఞానతృప్తిని కలిగిస్తుంది.

అట్టి ఋతంభరా ప్రజ్ఞను వేదం 'ప్రథమజా ఋతస్య' – ప్రకృతి నుండి ముందుగా పుట్టిన మహతత్త్వబుద్ధి యంటుంది. దానిని పొంద పూర్ణపురుషార్థం చెయ్యమంటుంది.

న విజానామి యది వేదమస్మి
నిణ్యః సన్నద్ధో మనసా చరామి ।
యదా మాగన్ ప్రథమజా ఋతస్య
ఆదిద్వాచో అశ్నువే భాగమస్యాః ॥

ఋ. 1.164.37, అథర్వ. 9.10.15

నే నిదియేనా – ఈ శరీరమేనా ? లేక జీవాత్మనా ? లేక మరేమైనానా? లియకున్నాను. మనస్సుతో బాగుగా బంధింపబడి సంశయముతో రుగుచున్నాను. ఒకవేళ నాకు ఋతమునుండి (ప్రకృతినుండి) మొదటగా పుట్టిన మహతత్త్వబుద్ధి లభిస్తే నా ఈ శాబ్దిక జ్ఞానం అనుభవమౌతుంది కదా!

**ఉపస్థాయ ప్రథమజామృతస్య**

**ఆత్మనాత్మాన మభి సంవివేశ ॥** యజు. 32-11

ఋతముయొక్క (ప్రకృతి యొక్క) మొదటి పరిణామముగా ఏర్పడిన మహతత్త్వబుద్ధి నాశ్రయించి జీవుడు పరమాత్మను పొందుచున్నాడు.

ఆ స్థితిని అందుకోవటంకొరకే గాయత్రీజపం చేస్తూ బుద్ధిలో పరమేశ్వరుని భర్గః స్వరూపాన్ని ధ్యానం చెయ్యమంటారు మన ఋషులు.

వేదాల మనన చింతనలద్వారా తమ బుద్ధిని పదునుపెట్టుకున్న మన ఋషులు అద్భుతమైన దర్శన ఉపనిషదాది శాస్త్రా లనేకం రచించారు. వాటిలో వివిధ పదార్థాల వివరణతో బాటు మనస్సునుకూడా ఒక ద్రవ్యంగా –పదార్థంగా గ్రహించి దాని ఉనికిని లక్షణ ప్రమాణాలతో నిరూపించారు. దాని వివిధ గుణాలను, శక్తులను వర్ణించారు. స్థలాభావంతో వాటి నిక్కడ ఉదహరించలేక పోతున్నాము. అభిరుచి గలవారు ప్రముఖ వేద విద్వాంసులు ఆచార్య రాజవీర శాస్త్రిగారి రచన 'వైదిక మనో విజ్ఞాన్' అనే హిందీ పుస్తకం చదువగోరుచున్నాము. (ప్రాప్తిస్థానం : ఆర్ష సాహిత్య ప్రచార ట్రస్టు, 2ఎఫ్, కమలానగర్, ఢిల్లీ -7)

ఆధునిక మనోవైజ్ఞానికులును చాలా పరిశోధనలను చేసి అర్ధచేతన (స కాన్షియస్), చేతన (కాన్షియస్), అతి చేతన (సూపర్ కాన్షియస్) మనస్సు యొక్క శక్తులను కనిపెట్టారు. అద్భుతమైన చికిత్సా పద్ధతులను రూపొందించార ఇంతజరిగినా వారు మనస్సు అనేది ఒక పదార్థంగా లేదా సూక్ష్మపదార్థం అంగీకరించలేకపోతున్నారు. వారు బుద్ధిపైన కూడా చాలా పరిశోధనలు చేసా వారి ఆలోచనలు ఈ విధంగా ఉన్నాయి.

డా. స్టర్న్ యొక్క అభిప్రాయం ప్రకారం బుద్ధివలననే మానవు పరిస్థితులకనుగుణంగా నిర్ణయాలు తీసుకొని జీవనయాత్ర సాగిస్తున్నాడు.

డా. టర్‌మన్ ఏమంటారంటే - బుద్ధి ఒక విషయంపైన లోతుగా ఆలోచిస్తున్నపుడు ఏ ఆకారమూ స్మృతిపథంలో రాదు. అయినా ఒక చక్కటి ఆలోచన (థాట్) వస్తుంది. కనుక అమూర్తచింతన యోగ్యత కలిగిందే బుద్ధి అంటాడు.

డా. థార్న్‌డాయిన్ మరియు డా. థామ్సన్ చేసిన పరిశోధనల సారంశమేమంటే - బుద్ధిలో కేవలం ఏదో ఒక ప్రకారమైన యోగ్యతమాత్రమే లేదు. అది అనేక యోగ్యతలను కలిగి స్వతంత్ర నిర్ణయాలు తీసుకోగల సత్తాగా సమయస్ఫూర్తితో వ్యవహరిస్తుంది. అది ఒక జ్ఞాన భండారం.

డా. వేల్స్ ఏమంటారంటే : "బుద్ధి అంటే సరియైన అర్థమేమంటే మన జీవన వ్యవహారాలను పునః సంఘటితపరచి క్రొత్త పరిస్థితులలో మరింత నిపుణతతో వ్యవహరించేశక్తి" అంటారు.

ప్రొ. వుడ్‌వర్థుగారు బుద్ధియొక్క సరియైన స్వరూపం తెలుసుకోవడానికి బుద్ధి మరియు మనీషాలలో ఉండే భేదం తెలుసుకోవాలంటారు. ఈ రెంటిలోనూ చాలా దగ్గర సంబంధాలున్నప్పటికీ కొన్ని భేదాలున్నాయంటారు. 'మనీషా' అంటే - ఆలోచిస్తూ, తెలిసికుంటూ, జ్ఞాపకం పెట్టుకుంటూ క్రొత్త జ్ఞానాన్ని కలిగించే ఒక శక్తి. అంటే మనీషా మనకు జ్ఞాన ప్రాప్తి కలిగిస్తున్నది. అయినప్పటికీ దీనికన్న బుద్ధియే చాలా గొప్పది. అది మనను సమస్యల బంధనాలనుండి బయటపడవేయగల శక్తి గలది అంటారు.

డా. స్పీయర్ ఏమంటారంటే - బుద్ధిని రెండుగా విభజిస్తే సరిపోతుందంటారు. ఒకటి సామాన్యబుద్ధి. రెండు విశిష్టబుద్ధి.

పైవిధంగా ఆధునిక మనోవైజ్ఞానికులలో భిన్న భిన్న అభిప్రాయా లున్నాయి. అయినప్పటికీ వీరంతా అది ఒక జ్ఞానాత్మకశక్తి అంటారు. వీరందరికన్న విశిష్టంగా వేదం బుద్ధిని సుయోగ్య సారథి అంటుంది.

సుషారథి రశ్వానివ యన్మనుష్యా
న్నేనీయతేऽభీషుభి ర్వాజిన ఇవ,

హృత్ప్రతిష్ఠం యదజిరం జవిష్ఠమ్
తన్మే మనః శివసంకల్ప మస్తు ॥ - యజుర్వేదం. 34-6

ఏ విధంగానైతే నేర్పరియైన మంచి సారథి కళ్ళెములతో వేగ వంతములైన గుఱ్ఱాలను సరియైన మార్గంలో నడుపుతాడో, ఏది హృదయ ప్రాంతమున ఉంటుందో, అజిరమో - నిత్యయౌవ్వనంతో ఉంటుందో, మిక్కిలి శక్తివంతమో అట్టి నా మనస్సు శివసంకల్పయుక్త మగును గాక !

ఇచట మనః పదము బుద్ధికి పర్యాయవాచకంగా ప్రయోగింపబడింది.

పై వేదోపదేశాన్ని ఋషులు మనవంటి సామాన్యుల కర్థమగుటకు ఈ క్రింది విధంగా వివరించి చెప్పారు.

కఠోపనిషత్తులో యమాచార్యు డనే గురువు జిజ్ఞాసువుగా వచ్చిన నచికేతునకు ఈ విధంగా ఉపదేశించాడు -

శ్లో॥ ఆత్మానం రథినం విద్ధి, శరీరం రథమేవ తు ।
బుద్ధిం తు సారథిం విద్ధి, మనః ప్రగ్రహ మేవ చ ॥

శ్లో॥ ఇంద్రియాణి హయా నాహుర్
విషయాం స్తేషు గోచరాన్ ।
ఆత్మేంద్రియ మనోయుక్తం
భోక్తే త్యాహుర్ మునీషిణః ॥ - కఠోపనిషత్తు. 3-3, 4

ఓ శిష్యా ! నచికేతా ! శరీర మనబడే ఈ రథంలో జీవాత్మను రథికునిగా - రథస్వామిగా - రాజుగా తెలిసికో. నిశ్చయాత్మకమగు చిత్తవృత్తిని - బుద్ధిని సారథిగా తెలుసుకో. మనస్సు కళ్ళెమువలె ఉంటుంది.

మనీషులైన విద్వాంసులు ఇంద్రియాలే కళ్ళెమునకు కట్టబడిన గుఱ్ఱములుగా ఉంటాయంటారు. ఇంద్రియాలు గుఱ్ఱాలయినపుడు రూపరసాది విషయాలే మార్గములు. ఈ విధంగా శరీర యింద్రియ మనస్సులతో కూడిన జీవుడు సుఖదుఃఖాల ననుభవిస్తూ భోక్తగా ఉంటాడు.

పై వివరణను బట్టి బుద్ధి మన జీవన సారథి. దానిని మంచిగా శక్తివంతంగా, యోగ్యత కలిగినదిగా చేసుకోగలిగితే మన జీవితం చక్కగా సాగిపోతుంది. నిత్య జీవితంలోనూ ఈ బుద్ధియొక్క అవసరమెంతో ఉంది. అనేక మోసాలతో కూడిన ఈ ప్రపంచంలో బ్రతుకు బండి సరిగా నడవాలంటే యిది అనివార్యమే. కల్తీలనుండి అసలునూ, చెడునుండి మంచినీ, అసత్యాన్నుండి సత్యాన్నీ వేరుచేయాలంటే బుద్ధి అవసరమే. ఇది చురుకుగా పనిచేయకపోతే ఎన్నో సమస్య లుత్పన్నమౌతాయి. అనేక సందేహాలు ఉక్కిరిబిక్కిరి చేస్తాయి. సత్యమేమిటో, కర్తవ్యమేమిటో అర్థం కాదు. అప్పుడే బుద్ధియొక్క ప్రకాశం మనకవసరం.

బుద్ధి మూడు రకాలుగా ఉంటుంది. అవి 'సామాన్య బుద్ధి, సుబుద్ధి, కుబుద్ధి'. వీటిలో మనం సుబుద్ధినే కోరుకోవాలి. అదే మనచేత కొన్ని మంచి పనులను చేయించి పుణ్యాత్ములను చేస్తుంది. సామాన్య బుద్ధివల్ల మనకు విశేష ప్రయోజన మేమీ ఉండదు. జీవితం యిబ్బందిలేకుండా జరుగుతుందంతే. కుబుద్ధివల్ల మనకు కీడే కలుగుతుందికాని మేలెంతమాత్రం కలుగదు. ఇది రజోగుణ తమోగుణయుక్తంగా ఉంటుంది. బుద్ధిలో ఈ పరిణామాలు కలగటానికి కారణం మనం పూర్వజన్మలలోను, ఈ జన్మలోను చేసిన కర్మలు, గడపిన జీవితం. ఇప్పటికైనా మనం జాగ్రత్తపడి శ్రీకృష్ణ భగవానుడు గీతలో వివరించిన త్రివిధ బుద్ధులను గురించి చదివి, అర్థంచేసుకొని సాత్త్విక బుద్ధికొరకు యత్నించాలి. కృష్ణ భగవానుడు చెప్పిన వివరణ ఏమంటే -

**ప్రవృత్తించ నివృత్తించ కార్యాకార్యే భయాభయే ।**
**బంధం మోక్షం చ యా వేత్తి బుద్ధిః సా పార్థ ! సాత్వికీ ॥**

ఏది ప్రవృత్తి మార్గమో ఏది నివృత్తి మార్గమో, ఏ కార్యాలు చేయతగినవో ఏవి చేయకూడనివో, ఏది భయరహితమో ఏది భయకారకమో, ఏది మనను సంసారంలో బంధిస్తున్నదో ఏది మనను బంధనాలనుండి విడిపించి ముక్తిని కలిగిస్తున్నదో చక్కగా తెలుసుకోగల బుద్ధిని సాత్త్వికబుద్ధి అంటారు.

ఆ విధంగా తెలుసుకొని - చేయకూడని కర్మలను, భయకారకమైన కర్మలను పూర్తిగా విడచిపెట్టి మనకు ఉన్నతిని కలిగించే పరోపకారాది పుణ్యకార్యాలు

చేయాలి. సంసారంపై రాగాన్ని పోగొట్టుకుని ముక్తిని పొందటానికి ఆ సత్కర్మల ఫలాలను భగవంతుని కర్పించి భగవదానంద ప్రాప్తియే లక్ష్యంగా జీవించాలి. అట్టి లక్ష్యంవైపు మనను తీసుకువెళ్ళే సారథినే సాత్విక బుద్ధి అంటారు.

**యయా ధర్మ మధర్మం చ కార్యం చాకార్యమేవ చ ।**
**అయథావత్ ప్రజానాతి బుద్ధిః సా పార్థ ! రాజసీ ॥**

ఓ అర్జునా ! ఏ బుద్ధి ధర్మాధర్మాలను కార్యాకార్యాలను యథావత్‌గా ఉన్నది ఉన్నట్లుగా తెలిసికోలేకపోతుందో అట్టి బుద్ధిని రాజసబుద్ధి అంటారు.

ఇట్టివారికి ఆలోచన తక్కువగాను ఆవేశం (తొందరపాటు) ఎక్కువగాను ఉంటుంది. వారు అట్టి రజోగుణాన్ని తగ్గించుకోవడానికి ఆహార విహార వ్యవహారాలలో సాత్వికతను పాటించాలి. ప్రశాంతంగా ఆలోచించే ప్రయత్నం చెయ్యాలి.

**అధర్మం ధర్మమితి యా మన్యతే తమసావృతా ।**
**సర్వార్థాన్ విపరీతాం శ్చ బుద్ధిః సా పార్థ ! తామసీ ॥**

(భగ. 18-30, 31, 32)

ఓ పార్థ ! తమోగుణంతో ఆవరింపబడిన బుద్ధి అధర్మాన్ని ధర్మంగా భావిస్తుంది. సమస్త విషయాలను విపరీతంగానే అర్థం చేసుకొంటుంది.

ఈ తామసబుద్ధి చాలా ప్రమాదకరమైనది. ఇది మనను నీచయోనులలోనికి తీసుకుపోతుంది. అంటే క్రిమి కీటకాది నిమ్న జన్మలను కలిగిస్తుంది. దీనిని పోగొట్టుకోవడానికి విశేష ప్రయత్నం చెయ్యవలసి ఉంటుంది. సద్గ్రంథపఠనం, సత్సాంగత్యం వీరికి సహకరిస్తాయి. అహింసా సత్యాది వ్రతాలను నిష్ఠగా ఆచరించాలి. తపస్సు చేయాలి. అంటే గీతలో చెప్పినట్లు శారీరక వాచక మానసిక తపస్సులు చెయ్యాలి.

పై వివరణను అర్థం చేసుకున్న వివేకవంతుడు తన బుద్ధియొక్క స్థితిని అర్థంచేసుకొని దానిని సరిచేసుకొన యత్నిస్తాడు. 'బుద్ధి నాశాత్ ప్రణశ్యతి' అనే హెచ్చరికను గుర్తించి జాగ్రత్తపడతాడు.

కనుకనే, ఆర్య చాణక్యుడు ఈ విధంగా ప్రార్థిస్తాడు - "హే పరమేశ్వరా! నా పాపకృత్యాలవల్ల నా సర్వస్వం నశించినా సరే! ధనధాన్యాలు గృహారామాలు పరివారం నాశనమైపోయినా, నా శరీరావయవాలు శిథిలములై పోయినా నేను పెద్దగా చింతింపను. కేవలం ఒకే ఒక వస్తువు బుద్ధిని మాత్రం నావద్ద ఉండనియ్యి. దానిని నానుండి దూరం చెయ్య"వద్దని ప్రార్థిస్తాడు.

మహాభారత ఉద్యోగపర్వంలో బుద్ధియొక్క విశిష్టతను తెలపటానికి ఒక ప్రసంగం కల్పింపబడింది. 'దేవత లెవరినైనా రక్షించాలన్నా నాశనం చెయ్యాలన్నా వారేమి చేస్తారు?" అనేది ప్రశ్న. దానికి సమాధానంగా - 'దేవత లెవరినైనా నశింపచెయ్యాలనుకుంటే అస్త్ర శస్త్రాలనుగాని విషాన్నిగాని ప్రయోగింపరు. కేవలం వాని బుద్ధినిమాత్రం భ్రష్టం చేస్తారు. దానితో అతడు తనకు తానే వక్రమార్గంలోపడి నశిస్తాడు. అట్లే, వారు ఎవరినైనా రక్షించాలనుకుంటే తమ సైన్యాన్నో, అంగరక్షకులనో, దూతలనో పంపరు. కేవలం అతని బుద్ధిని సన్మార్గంలో నడువ ప్రేరేపిస్తారు. దానితో అతడు స్వయంగానే రక్షింపబడతాడు' అని చెప్పబడింది. దీని భావమేమంటే - ఒకడికి తన పాపకర్మలఫల మనుభవింప సమయు మాసన్నమైనపుడు అతని బుద్ధి వక్రిస్తుంది. దానితో విపరీత కార్యాలు చేసి కష్టాలపాలౌతాడు. అందుచేతనే **'వినాశకాలే విపరీత బుద్ధి'** యనే సామెత ఏర్పడింది.

బుద్ధి నశించటంవల్లనే దీర్ఘవ్యాధులు కలుగుతాయంటాడు ప్రసిద్ధ ఆయుర్వేదాచార్యుడు పునర్వసు మహర్షి. **'ప్రజ్ఞాపరాధో మూలం సర్వరోగాణాం'** - సర్వరోగాలకు మూలం బుద్ధి నశించటమే. బుద్ధి నశించటంతో రాజసిక తామసిక సంస్కారాలు రాజ్యం చేస్తాయి. దానితో అతడు మద్య మాంస వ్యభిచారాదులకు లోనై రోగాల పాలౌతాడు. కనుక మనం ఆరోగ్యంగా ఉండాలన్నా, ఆనందంగా ఉండాలన్నా సద్బుద్ధికొరకు ప్రార్థించటమే ఉత్తమం. అందుకు గాయత్రీ మంత్రమే ఉత్తమోత్తమ మంత్రం. ఇంతేగాక, వైజ్ఞానిక పురోగతికీ, శాస్త్ర కళారంగాల అభివృద్ధికీ, సామాజిక జీవన వికాసానికీ కొంత విశేష బుద్ధి అవసరం. కనుక,

మనం సదా సద్బుద్ధితోబాటు బుద్ధివికాసంకొరకు ప్రార్థిస్తూ అందుకు తగిన ప్రయత్నం, పరిశ్రమ చెయ్యాలి.

మన ఆయుర్వేద గ్రంథాలలోను, ధర్మగ్రంథాలలోను సత్త్వగుణాన్ని, బౌద్ధిక శక్తిని పెంచే ఆహారవిహారాలు తెలుపబడ్డాయి. వాటిని సేవిస్తే తప్పక సుబుద్ధి బలపడుతుంది. ముఖ్యంగా ఆవుపాలు, అంజీర ద్రాక్ష ఉసిరిక మొదలైన పండ్లు, తులసి సరస్వతి శంఖపుష్పి మొ. ఆకులు, బాదం అక్రోట్ మొ.కాయలు ; చిలకకూర, బతువా, కేరెట్లు మొ. కూరలు మేలు చేస్తాయి. రాజస తామసాహారాలు పూర్తిగా విసర్జించి సాత్వికాహారాలు తీసుకుంటే మంచిది. మద్యమాంసాలను ఏరూపంలోనూ తీసుకోకూడదు. కేవలం మద్యమేకాక బుద్ధిని నశింపజేసే గంజాయి, భంగు, బీరు, ఆధునిక డ్రగ్స్ కూడా నిషిద్ధమే. **'బుద్ధిం లుంపతి యద్ద్రవ్యం మదకారీ తద్ ఉచ్యతే'** అని చెప్పినట్లు అవన్నీ మద్యం వంటివే. బుద్ధిని నశింపచేసేవే.

ప్రతీ తల్లీ, ప్రతీ తండ్రీ తమ బిడ్డలు మేధావులు కావాలని కోరుకుంటారు. అందుకు తమ శక్తికొలది ప్రయత్నిస్తారు. అయితే, ఆ ప్రయత్నం తమ పిల్లలు విద్యార్థి దశలో ఉన్నప్పుడు కన్న అంతకు పూర్వమే వారు తల్లి గర్భంలో ఉన్నప్పుడే ప్రారంభిస్తే మంచి ఫలితాలుంటాయని మన ఋషు లంటారు. అందుకొరకే గర్భిణీస్త్రీలకు పుంసవన, సీమంతోన్నయన సంస్కారాలు జరిపించాలంటారు. ఆ సంస్కారాల విధి విధానాల ననుసరిస్తే తప్పక మంచి ఫలితాలుంటాయి. ఆహార విహార వ్యవహారాలలో కొన్ని జాగ్రత్తలు పాటిస్తే గర్భిణులు తమ గర్భంలో పెరిగే బిడ్డల మేదస్సును వికసింపజేయవచ్చు. వాటిని గురించి వివరంగా తెలుసుకో గోరువారు మాచే ప్రచురింపబడిన గ్రంథం **"దౌహృదిని" (ఋషుల దృష్టిలో గర్భిణీ స్త్రీ)** చదువగోరుచున్నాము.

## 'ధియః' - సారాంశం

సర్వాంతర్యామివైన ఓ పరమేశ్వరా ! నీవు సర్వజ్ఞుడవు. పరిపూర్ణ జ్ఞానివి, నిన్నుపాసించి మేమును జ్ఞానవంతుల మగుదుము గాక ! ఆ జ్ఞానముతో అభ్యుదయ నిఃశ్రేయసముల నొందుదుముగాక !

# యో నః ప్రచోదయాత్

ఈ వాక్యంలోని మొదటిపదం 'యో' యొక్క అసలు రూపం 'యః'. 'యః' అంటే యిక్కడి ప్రకరణాన్నిబట్టి ఆ పరమేశ్వరుడని అర్థం. ఎవడు సర్వజ్ఞుడో, పాపరహితుడో, శ్రేష్ఠుడో అట్టి పరమేశ్వరుడని భావం.

'నః' అంటే మాయొక్క అని అర్థం. ఈ గాయత్రీ మంత్రంతో ఎవరి బుద్ధికొరకు ప్రార్థిస్తున్నాము ? కేవలం మన ఒక్కరి బుద్ధికొరకే కాదు. అందరి బుద్ధికొరకు. మన తోటి మానవులందరి బుద్ధికొరకు ప్రార్థించవలెనని ఈ పదము సూచిస్తున్నది. వేదాలలోని ప్రార్థనలలో చాలావరకు సామూహిక సంక్షేమంకొరకు చేసే ప్రార్థనలే. మానవుడు సామాజిక ప్రాణి. ఇతరుల సహకారం లేకుండా అతడు ఒంటరిగా జీవించలేడు. అందువలన ప్రతీవ్యక్తీ తనను ఒక సమిష్టి ప్రాణిగా గుర్తించి 'అందరి ఉన్నతిలోనే తన ఉన్నతి గల'దని తెలుసుకోవాలి. అందుకు తగినట్లుగా జీవించాలి. భౌతిక రంగంలోనేకాక ఆధ్యాత్మికరంగంలోనూ యిట్టి భావననే కలిగి యుండాలి. వేద సందేశం ఏమంటే

**సం గచ్ఛధ్వం సంవదధ్వం సంవో మనాంసి జానతామ్ ।**
**దేవా భాగం యథా పూర్వే సంజానానా ఉపాసతే ॥**

– ఋగ్వేదము. 10-191-2

ఓ మానవులారా ! మీరు కలిసి నడవండి. కలిసి ప్రేమతో వార్తాలాపములు చేయండి. కలిసి ఆలోచించండి. ఒకరినొకరు అర్థం చేసుకోండి. పూర్వం శ్రేష్ఠమానవులు ఏరకంగా పరస్పరం కలిసిమెలిసి సామాజిక యున్నతికొరకు నిర్ణయాలు తీసుకున్నారో, వారివారికి లభించిన సంపదలతో సంతృప్తి చెందారో,

కలిసిమెలిసి జీవించారో మీరును అట్లే జీవించండి. అట్లే ఉపాసించండి, ప్రార్థించండి.

సామాజిక జీవనంలో తోటివారి ప్రభావం మనపైన పడుతుంది. మనం ఆరోగ్యంగా ఉండాలంటే తోటివారు ఆరోగ్యంగా ఉండాలి. లేకుంటే వారి అనారోగ్యం మన కంటుకుంటుంది. అట్లే, మూర్ఖులు బుద్ధిహీనులు సోమరుల మధ్య మనం ఉంటే అవి మనలో ప్రవేశించే అవకాశం ఉంటుంది. కనుక అందరి బౌద్ధిక ఉన్నతిలోనే మన బౌద్ధిక ఉన్నతి ఉంటుందని గ్రహించి తోటివారిని బుద్ధిమంతులుగా విద్యావంతులుగా వివేకవంతులుగా చేయ యత్నించాలి. మన ఉన్నతి కొరకు ప్రార్థించినట్లే తోటివారి ఉన్నతికొరకు ప్రార్థించాలి.

**'ప్రచోదయాత్'** అంటే **'వికసింపజేయు'**మని అర్థం. మానవులందరిలోను ఎంతోకొంత బుద్ధి ఉంటుంది. అది ఎంత వికసిస్తే మానవు డంత ఉన్నతి చెందుతాడు. సూర్యకిరణ స్పర్శతో కమలం వికసించినట్లు అంతర్యామియైన **'భర్గః'** సూర్యుని అనుగ్రహంతో సంకుచితమైన మన బుద్ధి వికసిస్తుంది. కనుకనే మనం ఈ గాయత్రీ మంత్రంతో మా బుద్ధిని వికసింపజేయుమని ప్రార్థిస్తున్నాము.

మానవ శరీరంలోఉన్న జీవుడు తాను ఈ లోకానికి ఒంటరిగా వచ్చినా ప్రపంచంలోని కొందరితో మమకారబంధ మేర్పరచుకుంటాడు. ఆ మమకార పరిధిలోనివారే తనవారనీ, మిగిలిన వారంతా పరులనీ భావిస్తాడు. తనకొరకు, తనవారికొరకు శ్రమిస్తాడు. వారు సుఖంగా ఉంటే తాను సంతోషిస్తాడు. వారు బాధలలో ఉంటే తాను బాధపడతాడు. అప్పుడప్పుడు తనకొరకు, తనవారికొరకు పరులను బాధించి పాపభాగి ఔతాడు. దాని పరిణామంగా దుఃఖాల పాలౌతాడు. ఇట్టి సంకుచితభావాలు బుద్ధి వికసించనందుననే కలుగుతాయి. కనుక, మనం సదా భగవంతుణ్ని మా బుద్ధులను వికసింపజేయుమని ప్రార్థించాలి. వేద సందేశ మేమంటే -

**యస్మిన్ త్సర్వాణి భూతాన్యాత్మైవాభూద్ విజానత ః।**
**తత్ర కో మోహః కః శోక ఏకత్వ మనుపశ్యతః ॥**

- యజుర్వేదం 40-7

ఏ జ్ఞానమయ స్థితియందుండి సమస్త ప్రాణుల సుఖదుఃఖాలు తన సుఖదుఃఖాల వంటివేనని గ్రహిస్తాడో అట్టి వాడే శోకమోహాలనుండి విడివడి ఆనందాన్ని పొందుతాడు.

కనుక, మనం అట్టి జ్ఞానమయ బుద్ధికొరకే ప్రార్థించాలి. అట్టి జ్ఞానమయ బుద్ధితోనే మానవుడు ధర్మాత్ముడై క్రమంగా మోక్షాన్ని పొందుతాడు. ఈ భావాన్నే మన పెద్దలు 'బుద్ధి వికసించినంత మాత్రాన సరిపోదు, హృదయం విశాలం కావా'లన్నారు. ఇచ్చట హృదయ పదం విశాలబుద్ధికి పర్యాయవాచకంగా ప్రయోగింపబడింది. కేవల విద్యా విజ్ఞానాలు మనను త్రివిధ దుఃఖాలనుండి విడిపించలేవు. అంతర్యామియైన సవితా దేవుని అనుగ్రహంతో వికసించిన విశాలబుద్ధియే మనను సర్వ దుఃఖాలనుండి విడిపించి శాశ్వత సుఖాన్ని, శాశ్వత శాంతినీ ప్రసాదిస్తుంది. అట్టి విశాలబుద్ధికి స్థానం హృదయం. వేద మేమంటుందంటే -

**సుషారథిరశ్వానివ యన్మనుష్యాన్**
**నేనీయతేఽ భీషు భిర్వాజిన ఇవ ।**
**హృత్ప్రతిష్ఠం యదజిరం జవిష్ఠం**
**తన్మే మనః శివసంకల్పమస్తు ॥** - యజుర్వేదము (34-6)

"కుశల సారథి కళ్ళెములతో వేగవంతములైన గుఱ్ఱములను చక్కగా నడిపించునట్లు ఏ నా మనస్సు నన్ను నడిపించుచున్నదో, ఏది హృదయ స్థానమున ఉంటుందో; అజిరమో-ముసలితనములేనిదో; అత్యంత వేగవంతమైనదో అట్టి నా మనస్సు సదా శివసంకల్పయుక్త మగును గాక !" సదా నాకును సర్వప్రాణులకును హితమును కోరునది యగును గాక !'' అని సంకల్పించమంటుంది.

మాటిమాటికి చేయు నిట్టి శివసంకల్పములు మనను మహాత్ములను చేస్తాయి. పూర్వ సంస్కారాలవల్ల కలుగుచున్న స్వార్థ సంకుచిత భావాలను

తొలగించి విశాల భావాలను కలిగిస్తాయి. సవితాసూర్యుడు మన హృదయంలో ఉదయిస్తాడు. మన బుద్ధి మేధగా పరిణమిస్తుంది. అది మనను మహాదేవునివద్దకు నడిపిస్తుంది. మన జన్మ ధన్యమౌతుంది.

**'ప్రచోదయాత్'** అంటే **'ప్ర=చక్కగా-సరియైన మార్గంలో, చోదయాత్ = ప్రేరేపింపుము'** అని మరియొక అర్థం. కేవలం బుద్ధి వికసిస్తే పెద్దగా ప్రయోజనం లేదు. అది సరియైన మార్గంలో పయనిస్తేనే మనకు గొప్ప మేలు కలుగుతుంది. అందుకొరకే మనం పరమేశ్వరుని ప్రార్థించాలి. సూర్యోదయంతో చీకటంతా పటాపంచలై మార్గాలు స్పష్టంగా గోచరిస్తాయి. అట్లే అజ్ఞానాంధకారంతో కూడిన ఈ ప్రపంచంలో జీవన పథికుడైన మానవునకు సరైన మార్గమేదో గోచరించాలంటే భర్గోజ్యోతి బుద్ధిలో ప్రకాశించాలి. అవిద్యాది క్లేశాలను దగ్ధం చేయాలి. అప్పుడే సరియైన మార్గమేదో స్పష్టమౌతుంది.

బుద్ధి అనేది ఒక బలమైన సాధనం మాత్రమే. దానితో మనం మంచి పనులూ చేయవచ్చు, చెడు పనులూ చేయవచ్చు. దేవతలమూ కావచ్చు, రాక్షసులమూ కావచ్చు. దానిలో చక్కని ప్రేరణ కలిగితే అది మనకు స్వర్గాన్ని ప్రసాదిస్తుంది. అంటే - ఇహపర సుఖాలను కలిగిస్తుంది. అదే వక్రించి వక్రమైన ప్రేరణలను కలిగిస్తే నరకాన్ని - కష్టాలను కలిగిస్తుంది. కనుక మనం పరమేశ్వరుని **"హే అంతర్యామీ ! మా బుద్ధిని సత్కర్మలలో ప్రేరేపింపు"**మని సదా ప్రార్థన చేస్తూ ఉండాలి.

వేదాలలో ఆలోచించదగిన ప్రార్థన లనేకం. అందులో - **'శం నో దేవా విశ్వదేవా భవన్తు (ఋగ్వేదం. 7-35-11)'** అనేది ఒకటి. **'మా దేవతలు విశ్వదేవతలై లోకానికి శాంతిని చేకూర్చువారు అగుదురు గాక !'** అని దీని భావం. తల్లి, తండ్రి, ఆచార్యుడు, అతిథి - ఈ నలుగురూ ప్రతీ వ్యక్తికి దేవతలుగా ఉంటారు. ఈ దేవతల పరిధి సీమితంగా ఉంటుంది. వీరు తమ పిల్లలకు, తమ శిష్యులకు మాత్రమే మేలుచేసేవారుగా ఉంటారు. తమవారికొరకు ఇతరుల యెడ పక్షపాతంతో వ్యవహరించటానికైనా వెనుకాడరు. ఇట్టి దేవతలు విశ్వదేవతలు

వాలి. 'విశ్వదేవత' లంటే అందరికీ మేలుచేసేవారని అర్థం. ఇట్టివారు తనవారూ, రాయివారూ అనే పక్షపాతం లేకుండా న్యాయంగా వ్యవహరిస్తూ ఉంటారు. ందువల్ల కాలాంతరంలో తనవారికీ పరాయివారికీ అందరికీ మేలుకలుగుతుంది.

అట్లే విద్వాంసులను, విజ్ఞానవేత్తలను కూడా దేవత లనవచ్చును. వారునూ మ వారికే దేవతలుకాని మానవమాత్రులందరికి కాదు. అట్టివారు విశ్వదేవతలైతే గొప్పమేలు జరుగుతుంది. నేడు వైజ్ఞానిక బలంతోనే అనేక ఆయుధాలు, అణుబాంబులు కనిపెట్టబడుతున్నాయి. వారు తమ విద్యావిజ్ఞానాలను విశ్వకల్యాణానికి వినియోగిస్తే తప్పక గొప్ప ప్రయోజనం కలుగుతుంది. తరతరాలకు వాటివల్ల మేలు కలుగుతుంది. అట్లుకాక, వారు స్వార్థంతో వ్యవహరిస్తే గొప్ప నష్టమే జరుగుతుంది. సామాన్య దుర్మార్గుని కన్న తెలివైన దుర్మార్గునివల్ల ఎక్కువ నష్టం కలుగుతుంది. 'సాక్షరాః రాక్షసాః భవంతి' – అను లోకోక్తి యిట్టి సందర్భాలలో సత్యమౌతుంది. కనుక ప్రార్థన యొక్క లక్ష్యం స్వార్థ ప్రయోజనం కొరకుగాక విశ్వకల్యాణం కొరకుగా నుండాలి. కనుక మనం **'శం నో దేవా విశ్వదేవా భవన్తు'** – మా దేవతలు విశ్వదేవతలై లోకానికి శాంతిని చేకూర్చేవారు కావా'లని ప్రార్థిద్దాం. గాయత్రీ మంత్రంలోనూ యిట్టి విశ్వకల్యాణకర ప్రార్థనయే ఉంది.

**'నః ధియః ప్రచోదయాత్'** – హే పరమేశ్వర మా అందరి బుద్ధులను సత్కర్మలలో ప్రేరేపింపుము.

## 'యో నః ప్రచోదయాత్' సారాంశం.

హే సర్వవ్యాపక ! సచ్చిదానంద స్వరూపా ! సర్వాంతర్యామివైన ఓ పరమేశ్వర ! మా బుద్ధులను వికసింపజేసి నీ వేదజ్ఞానము నందుకొనగల శక్తిని మా కిమ్ము. మాలోని స్వార్థ సంకుచిత భావాలను పోగొట్టి మా హృదయాలను విశాలము జేయుము. మమ్ము సత్కర్మలు చేయ ప్రేరేపించి అభ్యుదయ నిశ్శ్రేయసముల ప్రాప్తింపజేయుము. నీ కివే మా శతసహస్ర వందనములు.

## బుద్ధివికాస మెంతవరకు ?

## సామాన్యబుద్ధి నుండి 'ఋతంభరాప్రజ్ఞ' వరకు

సామాన్యంగా మానవుడు తన బుద్ధి వికసించాలనీ, చాలా విషయాలు తెలుసుకోవాలనీ కుతూహలపడతాడు. క్రొత్తవి తెలుసుకోవాలనీ, క్రొత్తవి నేర్చుకోవాలనీ ప్రయత్నం చేస్తాడు. ముఖ్యంగా విద్యార్థులలో యిది స్పష్టంగా కనబడుతుంది. తల్లిదండ్రులు తమ పిల్లలు చదువులో వెనుకబడివుంటే, మరచిపోతూవుంటే చాలా ఆందోళన చెందుతారు. **'జ్ఞాపకశక్తి'** పెరగటానికి మందులేమైనా ఉంటాయా' అని వైద్యుల నడుగుతూవుంటారు. బలహీనతవల్లా కొన్ని ఖని జలవణాలు (బయో కెమికల్స్), విటమిన్లు తక్కువ కావటంవల్లకూడా మరుపువస్తుంది. అటువంటివారిని మందులతో సరిచేయవచ్చు. (ఈ విషయం యీ ప్రకరణం చివర తెలుసుకుందాము). కాని, పూర్వజన్మ సంస్కారాల లోపం వల్ల వచ్చే మందబుద్ధిని బలపరచుకోవాలంటే విశేష ప్రయత్నం చెయ్యాలి. సాత్త్వికాహారవిహారాలు, విద్యావంతుల సాంగత్యం, నియమంగా అధ్యయన సాధన చెయ్యాలి. ఆ విధంగా చేస్తూ గాయత్రీజపం చేస్తే అద్భుతమైన ఫలితాలు వస్తాయి.

పూర్వప్రకరణంలో తెలిసికొన్నట్లుగా బుద్ధి ఒక జ్ఞానగ్రహణ సాధనం. అది అనేక జన్మల నుండి (అనాదిగా కూడా) మనవెంట వస్తున్నది. పూర్వజన్మలలో మనం చేసిన సాధనసంస్కారాలనుబట్టి అది కొందరిలో శక్తివంతంగానూ, స్ఫూర్తివంతంగానూ, పదునైనదిగాను ఉంటుంది. కొందరిలో బలహీనంగా మత్తుగా (డల్‌గా) మొద్దుగా ఉంటుంది. వివేకవంతులు తమ బుద్ధియొక్క స్థితిని గుర్తించి దానిని అభివృద్ధి చేసుకోవడానికి ప్రయత్నిస్తారు. నిష్ఠగా ప్రయత్నిస్తే ఎంతటి మొద్దు బుద్ధియైనా పదును పెట్టబడుతుంది. బలపడుతుంది. స్ఫూర్తివంతమౌతుంది. అందుకు గాయత్రీ మంత్రజపం చాలా మేలు చేస్తుంది.

అనుభవజ్ఞులైన యోగు లేమంటారంటే శ్రద్ధాభక్తులతో, నియమనిష్ఠలతో అర్థభావనతో గాయత్రీజపం చేసేవారి బుద్ధి క్రమంగా వివిధ రకాల పరిణామాలను పొందుతుందంటారు. ముందుగా అది మేధ ఔతుంది. అనంతరం అది ప్రజ్ఞగా

ప్రతిభగా పరిణమించి చివరకు ఋతంభరాప్రజ్ఞగా ఎదుగుతుందంటారు. వీటిని గురించి సంక్షిప్తంగా తెలిసికొందాము.

## మేధాబుద్ధి

**'మేధా-ఆశుగ్రహణే'** ఎంత గూఢమైన విషయాన్నైనా సులువుగా గ్రహించి, దానిని ఎంతకాలమైన మరచిపోకుండా తనలో నిలపుకోగల సామర్థ్యంపున్న బుద్ధిని మేధాబుద్ధి యంటారు పాణినిమహర్షి.

**'యజ్ఞానో సప్త మాతృభిః మేధాం ఆశాసత శ్రియే** (సామవేదము-101)

అంటుంది వేదం. **'ఓ మానవులారా ! మీరు అష్టాంగయోగపు యమ నియమాది సప్త సోపానము లధిరోహించి ధ్యానమగ్నులై భర్గోదేవుని కోరవలసింది మేధను మాత్రమే'** నని పై వేదవాక్య భావం. వేదాలలో మేధను కోరే ప్రార్థనామంత్రా లనేకం ఉన్నాయి. ముఖ్యంగా అథర్వవేద పంచమకాండలోని 108వ సూక్తం పూర్తిగా మేధను కోరేదే. మేధను మనం సృష్టికర్తనుండే కోరాలి. గాయత్రీమంత్రం యిదే విషయం చెబుతుంది. సృష్ట్యాదినుండి మహాభారతకాలంవరకు మేధలో భారతీయులదే అగ్రస్థానం. ఇందుకు పాణినీయ వ్యాకరణమే ప్రమాణం.

భావాన్ని వ్యక్తం చేసేది భాష అయితే, ఆ భాషను నియమించి నడిపించి వన్నె తెచ్చేది వ్యాకరణం. అన్ని శాస్త్రాలకు వ్యాకరణమే ఆధారంగా ఉంటుంది. ప్రపంచంలోని అన్ని వ్యాకరణాలకన్నను సంస్కృత వ్యాకరణమే మిన్న యంటారు సర్ మేక్డోనాల్డ్. ఆయన తన 'ఇండియాస్ పాస్ట్' (భారతదేశ పురాతన చరిత్ర) అనే గ్రంథంలో "శబ్ద స్వరూపాన్ని విశ్లేషణాత్మకంగా పరిశీలించి, ధాతువుకీ ప్రత్యయానికీ ఉన్న భేదాన్ని గుర్తించి, ప్రత్యయాలు చేసేపనిని నిర్ణయించి; నిర్దుష్టమూ, పరిపూర్ణమూ నైన ఒక వ్యాకరణ ప్రక్రియను ప్రప్రథమంగా కనిపెట్టిన గౌరవం సంస్కృత వైయ్యాకరణులకే చెందుతుంది. ప్రపంచంలోని ఏ దేశంలోనూ కూడా జరగని సాటిలేని ప్రక్రియ ఇది" అంటారు.

అట్టి విశిష్టమైన మన ప్రాచీన వ్యాకరణాలు వందలుకొలది ఉండేవి. వాటన్నిటిని సమన్వయపరచి రచించినదే పాణినీయ వ్యాకరణం. దానిని రచించినది పాణిని మహర్షి. కేవలం 4000 చిన్న చిన్న సూత్రాలతో సమస్త వైదిక లౌకిక సంస్కృతాన్ని బంధించిన ఘనత ఆయనదే. దాని నిర్మాణాన్ని చూసి

ప్రపంచ భాషావేత్తలంతా పాణినిమహర్షిని వేనోళ్ళ కీర్తిస్తున్నారు. అట్టి మేధావికి మేధ నిచ్చింది గాయత్రీమంత్రమే. చారిత్రికులు పరిశీలించి తెలుసుకున్నదేమంటే-

పాణిని మహర్షి జన్మస్థానం శాలాతుర గ్రామం. ఇది పూర్వ పంజాబ్ రాష్ట్రంలో సింధు–కాబూల్ నదుల సంగమస్థానానికి కొద్ది దూరంలో ఉంది. అతడు చిన్నతనంలో కాత్యాయనుడు మొదలైన కొందరు విద్యార్థులతో కలిసి 'వర్షుడు' అనే ఉపాధ్యాయుని వద్ద విద్యాభ్యాసం చేసేవాడు. పాణిని మందబుద్ధి కావటంవల్ల చదువులో చాలా వెనుకబడి ఉండేవాడు. తరచుగా గురువుల శిక్షకు లోనయ్యేవాడు. విషయం అర్థంకావటం కష్టంగా ఉండటమే కాక చదివింది జ్ఞాపకం ఉండేది కాదు. అతడు తన ఈ లోపాన్ని తెలుసుకొని గురువుగారికి ప్రణమిల్లి తనకేదైనా తరుణోపాయం తెలుపుమని ప్రాధేయపడ్డాడు. దానికి గురువుగారు జాలిపడి "నాయనా ! నీవు కొంతకాలం శ్రద్ధాభక్తులతో నిష్ఠతో గాయత్రీజపం చేయు"మన్నారు.

పాణిని గురువుగారు చేసిన సూచన మేరకు హిమాలయ పర్వత ప్రాంతాలలోని ఒక గ్రామానికి చేరుకొని నదీతీరంలో ఒక కుటీరం నిర్మించుకున్నాడు. ఆకలివేసినప్పుడు మాత్రమే గ్రామంలోనికి వెళ్ళి భిక్ష తీసుకొని మిగిలిన సమయమంతా గాయత్రీజపంలో గడిపాడు. పరమేశ్వరానుగ్రహంవల్ల క్రమంగా అతని బుద్ధి వికసించింది. ధారణశక్తి పెరిగింది. తిరిగి గురువుగారి వద్దకు చేరుకొని చదువుట ప్రారంభించాడు. ఉదయసాయం సంధ్యలలో గాయత్రీజపం చేస్తూ విద్యాభ్యాసం సాగించాడు. అనతికాలంలోనే అతడు కాత్యాయనాది సహాధ్యాయులను మించిపోయాడు. గురువులు, తోటి విద్యార్థులు పాణినిలో గలిగిన ఈ మార్పును చూసి హర్షించారు.

పాణిని అప్పటివరకు ఉన్న వివిధ వ్యాకరణపద్ధతులన్నిటిని పరిశీలించి ఒక సరళ వ్యాకరణపద్ధతిని రూపొందించాడు. వ్యాకరణం అంటే భయపడే వారికికూడా సరళంగా అర్థమయ్యే రీతిలో కేవలం నాలుగువేల చిన్న చిన్న సూత్రాలతో క్రొత్త వ్యాకరణాన్ని రూపొందించాడు. అది 8 అధ్యాయాలుగా విభజింపబడి ఉండటంవల్ల 'అష్టాధ్యాయి' అనే పేరుతో ప్రసిద్ధిని పొందింది. ఆయన కాలంలోనివారూ, తరువాతివారూ అందరూ ఆ పద్ధతిని ప్రశంసించి అనుసరించారు. అంతకన్న సరళంగా సమగ్రంగా వ్యాకరణం వ్రాయటం

అసంభవమేనని అంగీకరించారు. అందరూ అతనిని 'మహర్షి', 'మహామేధావి' అన్నారు.

క్రీ.శ. 7వ శతాబ్దంలో భారతదేశాన్ని సందర్శించిన హ్యూయన్‌త్సాంగ్ తన 'యాత్రలు' అనే గ్రంథంలో పాణిని మహర్షిని గురించి వ్రాస్తూ "పాణిని అతి ప్రాచీనకాలంనుండి తనకాలంవరకూ ప్రచారంలో ఉన్న సకలశబ్దరాశినీ సమగ్రంగా వ్యాకరించి అష్టాధ్యాయిని రచించాడు. దానిని సమ్రాట్టుకు పంపగా అతడు దానిని ఎంతగానో ప్రశంసించినాడు" అని వ్రాసి యున్నాడు. ఆయన 'శాలాతురం' గ్రామం గురించి వ్రాస్తూ ఈ గ్రామంలో నాలుగు శతాబ్దాల పాటు అవిచ్ఛిన్నంగా పాణినీయాధ్యయనం కొనసాగిందనీ, పాణిని శిష్యులైన ఈ గ్రామంలోని విద్యార్థులు పాణిని గుణగణాలను స్మరిస్తూ ఉంటారనీ, ఆయన గౌరవార్థం నెలకొల్పిన ఒక శిలాప్రతిమ అక్కడ ఉన్నదనీ వ్రాశాడు.

లియోనార్డ్ బ్లూమ్‌ఫీల్డ్ అనే పండితుడు పాణినీయ వ్యాకరణ వైశిష్ట్యాన్ని వర్ణిస్తూ - 'ఈ వ్యాకరణం మానవుని లోకోత్తర మేధకు స్మృతి చిహ్నం. అతి సూక్ష్మమైన అంశాలనుకూడా విడువకుండా ఈ వ్యాకరణం పదముల కలయికలోని ప్రతీమార్పునూ, పదముల ఉత్పత్తినీ - నిర్మాణాన్నీ, ఆ భాషకు చెందిన వాక్యప్రయోగపద్ధతినీ అద్భుతంగా వివరించింది. ఈనాటివరకూ మరి యే భాషాకూడా యింత నిర్దుష్టంగా అభివర్ణింపబడలేదు" అని వ్రాశారు. అట్టి మహోన్నత మేధావికి మేధను ప్రసాదించినది గాయత్రీమంత్రమే నన్న విషయం మరువకండి.

బుద్ధి మూడు విధాలుగా ఉన్నట్లే మేధయును మూడు విధాలుగా ఉంటుంది. అవి సామాన్యమేధ, సుమేధ, కుమేధ. నేడు మేధావీవర్గంగా పరిగణింపబడుతున్నవారంతా సామాన్యమేధకు చెందినవారు. ఎవరు తమ మేధాశక్తితో మానవులలోని ఆసురీ ప్రవృత్తులను దూరంచేసి వారిని ధర్మాత్ములుగా తీర్చిదిద్దుతారో, వారిలోని అవిద్యా అజ్ఞానాలను పోగొట్టి వారికి ఆత్మపరమాత్మల జ్ఞానాన్ని, మానవ కర్తవ్యాలను బోధిస్తారో, అభ్యుదయ నిశ్శ్రేయసాలను పొందటానికి ఉత్తమమైన మార్గం చూపిస్తారో వారు సుమేధులు. మన ప్రాచీన ఋషులు, మునులు, నేటి ఉత్తమ తరగతికి చెందిన సంఘసంస్కర్తలు, ఆధ్యాత్మ ప్రవక్తలు ఈ వర్గానికి చెందుతారు. ఈ రెంటికీ భిన్నంగా ఎవరు తమ మేధతో అవినీతికీ

అక్రమాలకు పాల్పడతారో, మారణాయుధాలనూ మారణహోమాన్ని సృష్టిస్తారో వారంతా కుమేధావర్గానికి చెందుతారు. ఇట్టివారివల్ల మానవసమాజానికి చాలా హాని కలుగుతుంది. కనుక మనం పొరబాటునకూడా కుమేధకొరకు ప్రార్థన చేయకూడదు. ఇట్టి పొరబాట్లు జరుగకుండా ఎట్టి మేధకొరకు ప్రార్థించాలో వేదం చక్కగా నిర్దేశిస్తుంది.

**యాం మేధాం దేవగణాః పితరశ్చోపాసతే ।**
**తయా మామద్య మేధయాగ్నే మేధావినం కురు స్వాహా ॥**

-యజుర్వేదం (32-14)

"ఓ అగ్నీ ! జ్ఞానప్రకాశక పరమేశ్వరా ! విద్యాపరోపకారాది దివ్య గుణములుగల దేవగణములు, మమ్ము పాలించు జ్ఞానులు, యోగులు, రక్షకులు ఏ మేధను ఉపాసిస్తున్నారో మమ్మును అట్టి మేధావంతులుగా నిపుడే చేయుము" అని ప్రార్థించమంటుంది.

గాయత్రీ జపం వల్ల కలిగే మరొక ఉన్నత సిద్ధి ప్రజ్ఞాబుద్ధి. దీనిని గురించి కొద్దిగా తెలుసుకుందాము.

## ప్రజ్ఞా బుద్ధి

### "ప్ర జానాతి యేన తద్ బుద్ధి స్వరూపమ్ - ప్రజ్ఞా'

ఏ బుద్ధితో విషయం విశేషంగా తెలియబడుతుందో – దానిని గురించిన విశేషజ్ఞానం కలుగుతుందో దానిని "ప్రజ్ఞాబుద్ధి" అంటారు. ఇది మేధకన్న కొంత ఉన్నతమైనది. ప్రజ్ఞగలవాడు శాస్త్రాలలోని అత్యంత సూక్ష్మమైన విషయాలనుగూడ స్పష్టంగా గ్రహించగలడు. తాను గ్రహించటమేకాక యితరులకు బోధించగలడు. శిష్యులకు కలిగే ఎంతటి గూఢమైన సందేహాలకైనా సమాధానాలు చెప్పగలడు. వారికి సరియైన మార్గదర్శనం చెయ్యగల నేర్పు అతని కుంటుంది. వేదమంత్రాలకు ప్రకరణానుగుణంగా అర్థం చెప్పగల సమర్థత అతనికి కలుగుతుంది. ఇట్టి ప్రజ్ఞాబుద్ధి పూర్వం ఎందరెందరో గురువులకు, గురుకులాచార్యులకు ఉండేది. బ్రాహ్మణ ఆరణ్యక దర్శన ఉపనిషదాది శాస్త్రకర్తలంతా యిట్టి ప్రజ్ఞాబుద్ధి గలవారే. వారికట్టి

యోగ్యత సంధ్యా గాయత్రీజపాలవల్ల, తాపసిక జీవనంవల్ల కలిగేది. ఆ కాలంలో అందరూ విధిగా పంచ మహాయజ్ఞాలు చేస్తూ ఉండేవారు. ఆ వైదికప్రథ విదేశీయుల పాలనలో లుప్తమైపోయింది. నేడు నామమాత్రంగా సంధ్యావందనం చేసేవారు కొందరున్నా నిష్ఠగా గాయత్రీజపం చేసేవారు చాలా అరుదు.

మన పూర్వాచార్యుల చరిత్రలు, ఆనాటి దేశకాల పరిస్థితులు మనకు స్పష్టంగా తెలియవుకాని 200 సంవత్సరాలకు పూర్వపువాడైన గురు విరజానందుని గురించి మనకు కొంత తెలుసు. ఆయన అంధుడైనా ప్రజ్ఞా చక్షువుగా ప్రసిద్ధిని పొందారు. ఆయన కట్టి ప్రజ్ఞ కలిగింది గాయత్రీ జపంవల్లనే. ఈ సందర్భంలో వారిని గురించి సంక్షిప్తంగా తెలుసుకుందాము.

## ప్రజ్ఞాచక్షువు విరజానందుని కథ

ప్రజ్ఞాచక్షువు విరజానంద స్వామిగారు క్రీ.శ. 1778వ సంవత్సరంలో జలంధర్‌లోని కర్తార్‌పూర్ అనే గ్రామంలో జన్మించారు. వీరి తల్లిదండ్రులు భరద్వాజ గోత్రీయ సద్బ్రాహ్మణులు. తండ్రి పండిత నారాయణదత్త భరద్వాజగారు సుప్రసిద్ధ సంస్కృత పండితులు కావటంవల్ల వారి ప్రాథమిక విద్య సంస్కృతంతోనే ప్రారంభమయ్యింది. కాని, దురదృష్టవశాత్తు వీరు చిన్ననాటనే తీవ్రమైన మశూచివ్యాధికి గురియై కంటిచూపును కోల్పోయారు. అనతికాలంలోనే తల్లిదండ్రులు దివంగతులయ్యారు. అన్నా వదినల ఆదరాభిమానాలునూ ఆయనకు లభించలేదు. దానితో ఆ బాలుడు విరక్తి చెంది యిల్లు వదలి దేశసంచారయ్యాడు. మూడేండ్ల తదుపరి ఎట్లో ఋషీకేశం చేరుకున్నాడు.

స్వామి విరజానందుని పూర్వనామ మేదియో మనకు తెలియదు. ఋషీకేశంలో అతడు కందమూల ఫలాలు తింటూ మూడేండ్లు తాపసిక జీవనం గడిపాడు. ప్రతిదినము గంగానదిలో నిలబడి గంటలకొలది గాయత్రీజపం చేశాడు. భిక్షకొరకు బయటకు వెళ్ళేవాడు కాదు. భక్తులెవరైనా వారంతట వారుగా ఏమైనా పెడితే తినేవాడు, లేకున్న పస్తులుండేవాడు. ఈ కఠోరమైన తపస్సుతో, గాయత్రీజపంతో వారిలో ప్రజ్ఞాచక్షువు ప్రకటమయ్యింది. ఏకసంధాగ్రాహి కావటమే కాక అతడు శాస్త్రీయ విషయాలను వివేచించగల వివేకి అయ్యాడు. వీటికి

తోడు సుప్రసిద్ధ సంస్కృత విద్వాంసులైన స్వామీ పూర్ణానంద సరస్వతులవారి అనుగ్రహం అతనికి లభించింది. వీరే ఆ బాలుని వైరాగ్యాన్ని సమగ్రంగా పరీక్షించి సంన్యాసదీక్ష నిచ్చి విరజానంద సరస్వతి యని పేరు పెట్టారు. పూర్ణానంద స్వాములవారు విరజానందులచే పాణినీయ అష్టాధ్యాయిని కంఠస్థం చేయించి ప్రతీ సూత్రానికి భాష్యం చెప్పారు.

ప్రాచీన ఋషులనుసరించిన వేదార్థ ప్రక్రియను తెలిపి ఆర్షగ్రంథాలపట్ల అమితమైన శ్రద్ధను కలిగించారు. దేశభక్తిని, స్వాభిమానాన్ని కలిగించారు. దానితో అంధుడైన విరజానందులు ప్రజ్ఞాచక్షువయ్యారు. వ్యాకరణ భాస్కరుడయ్యారు. నిత్యం నిష్ఠతో చేసిన గాయత్రీజపమే వారి కంతటి యోగ్యతను ప్రసాదించింది.

గాయత్రీజపం బుద్ధిని వికసింపజేయటమేగాక ఏకాగ్రపరుస్తుంది. ఏకసంధాగ్రాహిని చేస్తుంది. అద్భుతమైన ధారణాశక్తిని ప్రసాదిస్తుంది. స్వామి విరజానందుని ధారణాశక్తి ఎంత గొప్పదంటే -

అది ఆంగ్లేయుల పాలనా కాలం. ఒక దినం స్వామి విరజానందులు గంగానదిలో నిలబడి దీర్ఘకాలం జపం చేసుకొని తిరిగి వస్తూండగా యిద్దరు ఆంగ్లేయాధికారులు ఆంగ్లంలో వాదించుకుంటూ ఉండటం గమనించారు. పరిణామం ఏమౌతుందోనని వారు అక్కడే నిలబడి గమనించసాగారు. ఆంగ్లేయాధికారుల వాదనలు క్రమంగా తిట్టుకోవటం కొట్టుకోవటం వరకు వెళ్ళాయి. ఇద్దరకు పెద్ద పెద్ద గాయాలే అయ్యాయి. వారి అరుపులకు, కేకలకు దూరంగా గుడారాలలోఉన్న ఉన్నతాధికారులు వచ్చారు. ఇద్దరిని విడదీశారు. ఏమయ్యిందని అక్కడ నిలబడి ఉన్న విరజానందస్వామిని ఆంగ్లంలో ప్రశ్నించారు. దానికి వారు **"నాకు ఆంగ్లం రాదు. దయచేసి హిందీలో అడగం"**డని అన్నారు. అంతట ఉన్నతాధికారులు - 'బాబా ! మీ రిక్కడే నిలుచున్నారు కదా ! వీళ్ళిద్దరు ఏమని తిట్టుకున్నారు ? ఎందుకు కొట్లాడుకున్నారు ? అసలు ఏమి జరిగింది ? మీరు చెప్పాలి" అన్నారు.

అందుకు ఆ అంధ మహాశయుడు - "అయ్యాలారా ! ఏం జరిగిందో చెప్పడానికి నేను చూడలేను. కనుక చెప్పలేను. కానీ, వీళ్ళు ఏమి మాట్లాడుకున్నది నాకు జ్ఞాపకం ఉంది. నాకు ఆంగ్లభాష రాదుకనుక ఆ మాటల అర్థాలు నాకు

తెలియవు. వాళ్ళెలా మాట్లాడుకున్నారో అలా మాట్లాడి వినిపిస్తాను. మీరే అర్థం చేసుకోండన్నారు. 'సరే' నన్నారు అధికారులు. అంతట విరజానంద స్వామి అద్భుతమైన రీతిలో సరిగా ఆంగ్లేయులు ఉచ్చరించినట్లుగానే ఆంగ్లపదాల నుచ్చరిస్తూ వాళ్ళెలా మాటలు ప్రారంభించి చివరకు తిట్టుకోవడం కొట్టుకోవడం వరకు జరిగాయో తు.చ. తప్పకుండా మాట్లాడి వినిపించారు. అది విని ఆంగ్లేయాధికారులు జరిగిన సంగతి తెలుసుకొని వారిద్దరినీ తీసుకువెళ్ళి తగిన విధంగా దండించారు.

ఆ అద్భుతమైన సంఘటన ఆ నోటా ఈ నోటా సమీపంలో బసచేసిన అల్వార్ మహారాజుగారి చెవివరకు వెళ్ళింది. ఒకతను మహారాజుగారిని సమీపించి – 'మహారాజా ! మన మజలీకి దగ్గరలోనే ఒక అద్భుతం జరిగింది. ఆంగ్లభాష ఎంతమాత్రం రాని ఒక అంధసాధువు ఇద్దరు ఆంగ్లేయులు వాదోపవాదాలు చేసి కోట్లాడుకున్న సంఘటనంతా యథాతథంగా మాట్లాడి వినిపించాడు. అతని అద్భుతమైన జ్ఞాపకశక్తిని చూసి అందరూ ఆశ్చర్యపోయారు. ఇంతేగాక, అతడు సంస్కృతంలో అనర్గళంగా మాట్లాడుతున్నా"డని చెప్పారు. ఇది విన్న అల్వార్‌రాజు పరుగెత్తుకుంటూవచ్చి స్వామిని చూశాడు. అతని శరీరం బలహీనంగా బక్కపలుచగా ఉన్నా అతడు బ్రహ్మవర్చస్సుతో దేదీప్యమానంగా కనబడ్డాడు. అల్వార్‌రాజుకు అతనిపై శ్రద్ధ కలిగింది. చేతులు జోడించి 'మహాత్మా ! మీరు నాకు గురువులు కండని ప్రాధేయపడ్డాడు. ఒక షరతు మీద విరజానంద స్వామీజీ అంగీకరించారు.

ఆ షరతు ఏమంటే – 'ప్రతి దినం రాజు తన రాచకార్యాల నన్నిటినీ సర్దుబాటు చేసుకొని రెండుగంటలు స్వామీజీ వద్ద సంస్కృతం, ఆర్ష సాహిత్యం చదువుకోవాలి. నిత్యం నియమంగా ప్రాతః సాయం సంధ్యలలో గాయత్రీ జపం చెయ్యాలి". స్వామీజీ మరికొంత వివరిస్తూ – 'నేను నీకు ముందుగా ఉపదేశించేది గాయత్రీనే. గాయత్రీజపం ఏమంత కఠినమైనది కాదు. నీవు చేయగలవు. అందరూ చేయగలరు. నా వద్ద ఉన్నది ఆ గాయత్రీ శక్తినే. నీవు కూడా సాధన చెయ్యి. నీకు కూడా అది లభిస్తుం'దన్నారు.

అనంతరం స్వామీజీ అల్వార్ రాజ్యానికి వెళ్ళి అక్కడ కొంతకాలం ఉండటం, రాజు నియమంగా వారివద్ద విద్య నభ్యసించటం జరిగాయి.ఒక దినం రాజు

వినోదకార్యక్రమంలో నిమగ్నమై స్వామీజీ వద్దకు పాఠానికి వెళ్ళలేదు. దానితో స్వామీజీ క్రోధితుడై ఆ రాజ్యాన్ని వదలిపెట్టి వెళ్ళిపోయారు. స్వామీజీది చాలా ఉగ్రస్వభావం. అనార్షగ్రంథాలను, అలసత్వాన్ని ఆయన సహించేవారు కాదు. తన వద్దకు ఎవరైనా విద్య నభ్యసించటానికి వస్తే ముందుగా అతనివద్ద ఉన్న అనార్ష గ్రంథాలన్నిటినీ నదిలో పడవేసి రమ్మనేవారు. ఆ చదువంతా మరిచిపొమ్మని చెప్పేవారు. తరువాతనే అతనిచే పాణినీ వ్యాకరణం చదివించి ఆర్షగ్రంథాలను చదివించేవారు. తనవద్ద విద్యనభ్యసించవచ్చిన దయానంద స్వామిపట్లకూడా ఆయన అట్లే వ్యవహరించారు.

ఆర్షగ్రంథా లంటే ఋషులు వ్రాసిన గ్రంథాలు. ఎవరైతే శిక్షా కల్ప వ్యాకరణ నిరుక్త ఛందో జ్యోతిషా లనే షడంగాలను అధ్యయనం చేస్తారో, ఆ అధ్యయనంతో పాటు తాపసిక జీవనం గడుపుతూ యోగసాధనచేసి నిర్వికల్ప సమాధి స్థితిని పొందుతారో వారిని ఋషులంటారు. అట్టివారు వ్యాకరణం ద్వారా వేదార్థాన్ని గ్రహించటమేకాక సమాధిస్థులై దానిని సాక్షాత్కారం చేసుకోగలరు. అట్టివారి రచనలలో భ్రమ ప్రమాదము లుండవు. విషయాన్ని సంక్షిప్తంగా సూటిగా చెబుతారు. అవి యుక్తికి, అనుభవానికి, విజ్ఞానానికి అనుకూలంగా ఉంటాయి. బ్రాహ్మణ ఆరణ్యకాలు, ఉపవేదాలు ఉపనిషత్తులు వేదాంగాలు షడ్దర్శనాలు స్మృతులు మొదలైనవి యీ వర్గానికి చెందుతాయి. ముఖ్యంగా యివి ఈశ్వరీయజ్ఞానమైన వేదాలకు అనుకూలంగా ఉంటాయి. ఇట్టివాటినే ఆర్షగ్రంథా లంటారు. వీటికి భిన్నమైనవన్నీ అనార్షగ్రంథాలు. వాటిలో కొంత సత్యమున్నా వాటిని మనం విసర్జించాలి. వదలిపెట్టాలి. లేకుంటే వాటిలోని అజ్ఞానం మనలో తిష్ఠవేసుకునే ప్రమాదముంది. మూఢనమ్మకాలే తొందరగా వ్యాపిస్తాయి కదా !

గురు విరజానందులవారి వద్ద విద్యనభ్యసించిన తదుపరియే మహర్షి దయానందులవారికి సత్యం అవగతమయ్యింది. అనేక సందేహాలకు సమాధానాలు లభించాయి. వేదార్థం బోధపడింది. షడ్దర్శనాల సమన్వయం సాక్షాత్కారమయ్యింది. ఏకాంతానికి వెళ్ళి తానొక్కని ఉన్నతికే తపస్సు చేసేకన్నా అందరి ఉన్నతికొరకు తపిస్తూ జీవించాలనే ప్రేరణ కలిగింది. సంకట స్థితిలో నున్న దేశాన్ని, ధర్మాన్ని రక్షించటం కోసం తన సర్వస్వాన్ని అర్పించటానికి సంసిద్ధుడయ్యింది గురు విరజానందుని బోధనల వల్లనే.

గురు విరజానందస్వామి కంతటి బోధనా పటిమ, ధారణా శక్తి, వివేక జ్ఞానం వారు నియమంగా నిష్ఠగా చేసిన గాయత్రీజపం వల్లనే కలిగాయి.

## ప్రతిభా బుద్ధి

గాయత్రీ జపంవల్ల కలిగే మరొక ఉన్నత ఉపలబ్ధి ప్రతిభాబుద్ధి. ప్రతిభావంతులు తాము జ్ఞానవంతులు కావటమేకాక ప్రజలను జ్ఞానవంతుల చేయగలరు. ప్రభావితుల చేయగలరు. లోకంలోని అవిద్యను అజ్ఞానాన్ని పారద్రోలి జ్ఞానజ్యోతిని వెలిగించగలరు. వీరివల్ల లోకానికి చాలామేలు కలుగుతుంది. ఆదిశంకరులు, మహర్షి దయానందులు మొదలైనవారు ఇట్టి కోవకు చెందుతారు. వీరిరువురు గాయత్రిని జపించినవారే.

ఈ సందర్భంలో ఆదిశంకరులలోని ప్రతిభాశక్తిని సంక్షిప్తంగా తెలిసికొందాము.

## ఆదిశంకరులు

జగద్గురువులుగా ప్రసిద్ధి చెందిన ఆదిశంకరులు సుమారు 2,400 సంవత్సరాల పూర్వం దక్షిణభారతంలోని కేరళ రాష్ట్రంలో జన్మించారు. వీరి తల్లిదండ్రులు ఆర్యాంబశివగురులు. వీరు శివభక్తులు. సద్బ్రాహ్మణులు. శంకరుని బుద్ధివైశిష్ట్యాన్ని చూసి తండ్రి శివగురు 3వ ఏటనే అక్షరాభ్యాసం చేయించి అవసరమైన శ్లోకాలను, శాస్త్రాలను కంఠస్థం చేయించారు. ఐదవ ఏట ఉపనయనం చేసి గురుకులానికి పంపారు. ఆనాటినుండి ఆది శంకరులు గాయత్రీమంత్రాన్ని విడిచిపెట్టలేదు. గాయత్రీజపం ఆయన దినచర్యలో ఒక భాగం అయ్యింది. అనతికాలంలోనే ఆయన సకల శాస్త్రాలను అధ్యయనం చేశారు.

ఆదిశంకరులు విద్యార్థిగా ఉన్నపుడే **'బాలబోధ సంగ్రహ'** మనే ఒక గ్రంథాన్ని వ్రాశారు. నిగూఢమైన విషయాన్ని అంత సరళభాషలో అంత పిన్న వయస్సులో వ్రాయటం గొప్ప విశేషమే. ఆ గ్రంథం ఆయన ప్రతిభకు సాక్షిగా నేటికీ నిలిచి ఉంది. శంకరులు గురుకులంలో ఉండగానే తండ్రి కాలంచేశాడు. అందుచే తల్లి తన ఆశలన్నీ కొడుకుపైనే పెట్టుకుంది. తన కొడుకు గృహస్థుడై భార్యా పిల్లలతో కళకళలాడాలనేది ఆమె కోరిక కాగా, శంకరులకు సంన్యసించి

లోకాన్ని సంస్కరించాలనే కోరిక. ఈ రెంటిలో శంకరుల కోరికే నెరవేరింది. శంకరుడు యుక్తితో తల్లిని ఒప్పించి సంన్యాసం స్వీకరించాడు. సరియైన మార్గదర్శనం చేయగల గురువును వెతుక్కుంటూ దేశసంచారానికి బయలుదేరాడు. స్నేహితుడు విష్ణుశర్మకూడా అతనిని అనుసరించాడు.

వీరిరువురు గురువును వెదుకుతూ దేశం నాలుగుదిక్కులా తిరిగారు. చివరకు నర్మదానది ఒడ్డున అమరకాంతంలో యోగి గోవిందపాదుల వద్దకు చేరుకున్నారు. పరస్పర పరిచయాల అనంతరం తనకు తగిన గురువు లభించాడని శంకరులు ; తనకు తగిన శిష్యులు లభించారని గోవిందపాదులు గ్రహించారు. వారు గురు శిష్యులయ్యారు. ఆనాడు వైదిక ధర్మం చాలా క్లిష్ట పరిస్థితిలో ఉండేది. ఆ దురవస్థనుండి దానిని ఉద్ధరించడానికి మార్గమేదో వారు తెలుసుకున్నారు. కార్యరంగంలో ప్రవేశించారు.

ఆదిశంకరుల సంస్కరణలు అర్థం కావాలంటే ఆనాటి దేశపరిస్థితులు కొంత తెలిసి ఉండాలి.

సుమారు 5100 సంవత్సరాలకు పూర్వం జరిగిన మహాభారత యుద్ధానంతరం మన వైదికధర్మం క్షీణించటం ప్రారంభమయ్యింది. వీరులు విజ్ఞులు భారతయుద్ధంలో అసువులు కోల్పోగా వితంతువులు, విలపించే బంధువులు మిగిలిపోయారు. విద్యావిజ్ఞానాలు, సిరిసంపదలు నశించి అవిద్యా అజ్ఞానాలు, దారిద్ర్యం మిగిలిపోయాయి. దానితో మన వైదికధర్మం క్షీణించటం ప్రారంభమయ్యింది. ముఖ్యంగా యజ్ఞయాగాది వైదిక కర్మకాండ వికృతరూపం ధరించింది. పురుషార్థం లోపించి విలాసాలు, వికృతచేష్టలు చోటుచేసు కున్నాయి. మద్యపాన మాంసభక్షణలు యజ్ఞం పేరుతో చేయటం ప్రారంభించారు. వాతావరణాన్ని పరిశుద్ధం చేసి తద్వారా సర్వ ప్రాణులకు మేలు కలిగించే యజ్ఞయాగాదులలో పశువులను వధించి వాటి మాంసాన్ని ఆహుతులుగా యిచ్చారు. మిగిలిన దానిని ప్రసాదం పేరుతో ఆరగించారు. సోమపానం పేరుతో సురాపానం చేశారు. క్రమంగా పవిత్రమైన యజ్ఞశాలలు కబేలాలుగా (పశువుల వధశాలలుగా) మారిపోయి వికృతరూపం ధరించాయి. మహాత్మా బుద్ధుని కాలంనాటికి యివి తారాస్థాయికి చేరుకున్నాయి.

ఆ పశుహింసను చూసి బుద్ధుని హృదయం ద్రవించిపోయింది. యాజ్ఞికులను ప్రశ్నిస్తే వారు మా వేదాలు ఈ విధంగానే చెబుతున్నాయన్నారు. **'వైదికహింసా హింసా న భవతి'** – యజ్ఞం కొరకు చేసే హింస హింసకాదన్నారు. ఆ పశువులు కూడా స్వర్గానికి వెడతాయన్నారు. వేదాలను తరచి చూచే సంస్కృత జ్ఞానం బుద్ధునికి లేకపోవటంవల్ల యాజ్ఞికులతో తర్కంచేయలేకపోయాడు. మానవతావాదం ప్రవేశపెట్టడమే మంచిదనుకున్నాడు. అహింసయే పరమధర్మ మన్నాడు. సంఘసేవయే నిజమైన యజ్ఞమన్నాడు. ఆ మహానుభావుని ప్రబోధాలు ఆనాటి ప్రజల వివేకాన్ని తట్టిలేపాయి. దానితో వేలమంది లక్షలమంది ఆయన అనుయాయులైపోయారు. అది బౌద్ధమతంగా ప్రాచుర్యం పొందింది.

మహాత్మా బుద్ధుడు మానవులకు కలిగే కష్టాలకు కారణం కనుగొని పరిష్కారమార్గాలు ప్రచారం చేశాడేకాని పరమేశ్వరుని గురించి గానీ, వేదాలను గురించి గానీ ఏమీ చెప్పలేదు. అయినా, ఆయన అనంతరం ఆయన అనుయాయులు బుద్ధుని ఉపదేశాలతోబాటు దేవుడు లేడనీ, సృష్టికి కర్త ఎవరూ లేరనీ, వేదాలు బూటకమనీ, వాటిని అనుసరించి ఎవరూ ఉన్నతి చెందలేరనీ నాస్తిక్యాన్ని ప్రచారం చేశారు. ఆ నాస్తిక్యాన్ని నిరూపించుకోవటానికి **'తథాగత దర్శనం'** పేరుతో ఒక దర్శనాన్ని వ్రాశారు. అదే నేడు బౌద్ధదర్శనంగా పేరొందింది. జైనముని అనుయాయులునూ బౌద్ధులనే అనుసరించారు. వారు వారి సిద్ధాంతాలను గట్టి పరచుకోవడానికి **'అర్హతదర్శనం'** వ్రాసారు. ఇదే కాలాంతరంలో **'జైనదర్శనం'**గా ప్రసిద్ధి చెందింది. ఈ రెంటికన్న ముందే విలాసప్రియులు, సోమరులునైన కొందరు చార్వకమతాన్ని స్థాపించి ప్రచారం చేశారు. వారిది **'చార్వాక దర్శనం'**.

పై మూడు దర్శనాలు పరమేశ్వరుణ్ణి కానీ, వేదాలను కానీ ఒప్పుకోవు. వైదిక సాంప్రదాయం ప్రకారం ఏర్పడ్డ వర్ణాశ్రమధర్మాలనుగానీ, పంచ మహాయజ్ఞ షోడశసంస్కారాలను గానీ అంగీకరించవు. ఇంతేగాక, అవి వీటిని ఖండిస్తాయి. చార్వాక మతస్థులు నీతి నియమాలను కూడా గణించరు. ఇంద్రియ సుఖాలు, విశ్రాంతే వీరి లక్ష్యం. పరోపకారం మాటే లేదు. **'యావజ్జీవేత్ సుఖం జీవేత్, ఋణం కృత్వా ఘృతం పిబేత్। భస్మీ భూతస్య దేహస్య పునరాగమనం కుత'** అనేదే వాళ్ళ సిద్ధాంతం. ఈ మూడు దర్శనాలు చాలా కుతర్కంతో కూడిఉ

ంటాయి. తర్కశాస్త్రం బాగా తెలిసినవారేతప్ప మరెవ్వరూ వారి తర్కాన్నీ, కుయుక్తులనూ ఎదుర్కోలేరు. దానితో శంకరాచార్యులవారి వరకు వారి రాజ్యం నిరాటంకంగా నడిచిపోయింది.

శ్రీ శంకరాచార్యులవారు ఆనాటి దేశ పరిస్థితినీ, వైదికధర్మ పరిస్థితినీ బాగా అర్థం చేసుకున్నారు. బౌద్ధ జైన దర్శనాలను చదివిచూచారు. వారి కుయుక్తులేమిటో అర్థమయ్యాయి. వారిని శాస్త్రార్థాలతో ఓడించవచ్చుననీ, వైదికధర్మాన్ని పునరుద్ధరించ వచ్చుననీ గట్టి నమ్మకం కలిగింది. దానితో వారు ముందుగా ఉజ్జయనీ నగరానికి చేరుకున్నారు. ఆ కాలంలో ఉజ్జయినీ నగరాన్ని సుధన్వు డనే రాజు పాలించేవాడు. అతడు విద్యాప్రియుడు, జైనగ్రంథాలతోబాటు కొన్ని సంస్కృత గ్రంథాలుకూడా చదివినవాడు. శంకరాచార్యులు ఉజ్జయనీ నగరం చేరుకుని అచట వేదం చెప్పే వైయక్తిక సామాజిక నియమాలనూ, విద్యా విజ్ఞానాలను ఉపదేశించ నారంభించారు. క్రమంగా ప్రజలలో వివేకం జాగృతమయ్యింది. క్రమంగా వీరి విద్వత్తును గూర్చిన ప్రశంస రాజువరకు చేరింది. ఒకనాడు శ్రీ శంకరులు రాజును సందర్శించి ' ఓ రాజా ! మీరు విద్యావంతులు. జైన గ్రంథాలు, సంస్కృత గ్రంథాలు చదివినవారు. జైనమతంపై విశ్వాసం కలవారు. ఇంతేగాక, మీరు సత్యాసత్యజిజ్ఞాస కలవారు. కనుక, నేను సూచించేదేమంటే - **“ఓడినవారు గెలిచినవారి మతాన్ని స్వీకరించాలనే నియమంతో నాకును మీ జైన పండితులకును శాస్త్రార్థం చేయించండి. గెలిచినవారి మతమునే మీరునూ స్వీకరించండి”** అన్నారు. రాజులో జిజ్ఞాస జాగృతమయ్యింది. సంస్కృత గ్రంథాలు చదివినవాడుకనుక ఆయనలో కొన్ని సందేహాలు చోటు చేసుకున్నాయి. ఏది సత్యమో ఏది అసత్యమో తెలుసుకోవాలని చాలా కాలంగా ఎదురుచూస్తున్నాడు. ఈ సవాలును చక్కటి అవకాశంగా భావించి శాస్త్రార్థసభ ఏర్పాటు చేశాడు.

రాజు దేశం నలుమూలల నుండి ప్రసిద్ధ జైన పండితులను పిలిపించాడు. వందల సంఖ్యలో జైన పండితులు విచ్చేశారు. వారందరిది జైనమత పక్షంకాగా వైదికధర్మ పక్షంలో శంకరాచార్యులవారు ఒక్కరే. సృష్టికర్త ఎవ్వరూ లేరనీ, జీవుడూ, ఈ జగత్తూ అనాదులనీ, ఈ రెంటికీ ఉత్పత్తి వినాశనాలు లేవనీ జైనుల మతం.

దీనికి విరుద్ధంగా - ఈ సృష్టికి కర్త ఒకడున్నాడనీ, అతడే దేవుడనీ, వేదం ఈశ్వరీయ జ్ఞానమనీ, సర్వవిద్యా నిలయమనీ, వేదమార్గమే అభ్యుదయ నిశ్రేయసాలను కలిగించే ఉత్తమ మార్గమనీ శంకరుల మతం. ఈ చర్చ చాలా దినములు నడచింది. శంకరాచార్యులవారిని ఎలాగైనా ఓడించి తమలో కలుపుకోవాలని జైనులు చాలా ప్రయత్నం చేశారు. వారిని ఓడిస్తే మొత్తం భారతదేశం జైనం అయిపోతుందని వారి ఆశ. కాని, వారి ఆశలు అడియాశలయ్యాయి. ఆచార్యులవారి సునిశిత తర్కం ముందు ఎవరూ నిలువలేకపోయారు. అందరూ ఓటమిని చవిచూశారు. దానితో విధిలేక వారంతా జైనమతాన్ని విడిచి వైదికధర్మాన్ని స్వీకరించారు.

సుధన్వ మహారాజు సత్యాన్ని తెలుసుకోగలిగినందుకు చాలా సంతోషించాడు. శ్రద్ధా భక్తులతోనే వైదికధర్మాన్ని స్వీకరించాడు. ఇంతేగాక, తన మిత్రులైన రాజులకు లేఖలు వ్రాసి వారి వారి రాజ్యాలలో శాస్త్రార్థ సభల నేర్పాటు చేయించాడు. బౌద్ధపండితులుకూడా ఆచార్యుల వారి నెదుర్కొన్నారు. వారి దర్శనం, వారి యుక్తులు ఆచార్యుల వారి తర్కంముందు నిస్తేజమయ్యాయి. అంతటా ఆచార్యులవారికే విజయం లభించింది. దానితో దేశమంతటా కలకలం మొదలయ్యింది. సామాన్య ప్రజలునూ ఆలోచించటం మొదలు పెట్టారు. ఐచ్ఛికంగానే జైన బౌద్ధమతాలను విడచి వైదికాన్ని స్వీకరించటం ఆరంభమయ్యింది. సుధన్వరాజు, మిగిలిన రాజులు శంకరాచార్యులవారు దేశమునందంతటా సంచారం చేసి ప్రచారం చేసుకోవటానికి తగిన ఏర్పాట్లు చేశారు. వారి సంరక్షణార్థం కొంత సైన్యాన్ని, సేవలు చేయటానికి పరిచారకులను నియమించారు. వేల లక్షల సంఖ్యలో మత పరివర్తనలు జరిగాయి. ఆచార్యుల వారి వద్ద పెద్ద శంఖం ఉండేదట. దానితో వారు ఓ3మ్‌కార నాదాన్ని చేసేవారట. అది విన్నవారంతా శుద్ధులైనట్లుగా భావించేవారట. అంటే వేలమంది ఒకేసారి శుద్ధులై ఆర్యులయ్యేవారట. అప్పటి నుండే ద్విజులు - విద్యావంతులు యజ్ఞోపవీతాలను ధరించి వేదపఠన పాఠనాలు చేయుటం ప్రారంభించారు.

ఆ విధంగా శంకరాచార్యులవారు 10 సంవత్సరాలు దేశ సంచారం చేసి జైనులుగా బౌద్ధులుగా మారిపోయిన మన వైదికులనందరినీ శుద్ధిచేసి ఆర్యులుగా

చేశారు. జైనమందిరాలలో వేదపాఠశాలలను ఏర్పాటుచేసి వేదవిద్యా విజ్ఞానాలను ప్రచారం చెయ్యాలని చాలాకుతూహలపడ్డారు. ఇంతలోనే యిరువురు కపట జైనమునులు బయటికి వేదమతాన్ని స్వీకరించినట్లు నటించి కపట శ్రద్ధాభక్తులతో ఆచార్యులవారికి అంతేవాసులయ్యారు. వారు సమయంచూసి శంకరాచార్యులవారికి విషయుక్త ఆహారం పెట్టారు. ఆ తీవ్ర విషప్రభావంవల్ల ఆచార్యులవారికి ఆకలి మందగించి శరీరమంతా వ్రణాలుఏర్పడ్డాయి. ఆరు నెలల్లోనే వారు శరీరాన్ని త్యజించి నిర్యాణం చెందారు. వారిపై విషప్రయోగం జరిగి ఉండకపోతే నూరు సంవత్సరాలపైననే జీవించి యుండేవారు. వేదప్రచారం చేసి ఉండేవారు. మన భారతదేశాన్ని ప్రపంచ గురువుగా, ప్రపంచ సామ్రాజ్ఞిగా చేసి ఉండేవారు. కాని అట్లు జరుగలేదు. ఇది మన దురదృష్టం.

అంత అల్ప వయస్సులో, అంత అల్ప సమయంలో అంతటి మహత్కార్యం చేసిన ఆ మహానుభావుని ప్రతిభకు వెనుక ఉన్నది గాయత్రీ శక్తియే. వారు నేపాల్‌లో ఒక ప్రశాంత రమణీయ స్థలంలో కూర్చుని కొన్ని సంవత్సరాలు గాయత్రీజపం చేశారు. అనంతరం గాయత్రీ వైశిష్ట్యాన్ని కొనియాడుతూ ఒక చిన్న పుస్తకం వ్రాశారు. నేపాల్‌లో అది యిప్పటికీ సురక్షితంగా ఉందట. వారు అందులో-గాయత్రీమంత్ర సాధనచేసేవారికి 40 రకాల శక్తులు కలుగుతాయనీ, అది తన స్వీయానుభవమనీ వ్రాశారు. ఒక్కొక్క శక్తిని గురించి వివరించి, యివన్నీ ఎలా కలిసి పనిచేస్తాయో వివరించారట. ఈ విషయం శ్రీ సుధాంశు మహారాజ్‌గారు తమ ఉపన్యాసాలలో చెబుతూ ఉంటారు. "గాయత్రీలో 24 అక్షరాలుంటాయనీ, ప్రతి మనుష్యుని మస్తిష్కంలో 24 జ్ఞానతంతు కేంద్రాలు (జ్ఞాననాడులు మెదడుతో కలిసే చోట్లు) ఉంటాయనీ, గాయత్రిలోని 24 అక్షరాలూ ఆ 24 కేంద్రాలను ప్రభావితం చేస్తాయనీ" కూడా వారు చెబుతూ వుంటారు.

శ్రీ శంకరాచార్యులవారు ప్రస్థానత్రయం, అనేక స్తోత్రాలతో బాటు గాయత్రీ మంత్రాన్ని గూర్చిన వ్యాఖ్యాన గ్రంథంకూడా ఒకటి వ్రాశారు. అది 11 ఖండికలుగా (చిన్న చిన్న అధ్యాయాలుగా) ఉంటుంది. ఇవన్నీ ఆయన ప్రతిభకు నిదర్శనంగా నేటికీ నిలిచి ఉన్నాయి.

# ఋతంభరాప్రజ్ఞ

గాయత్రీజపం వల్ల కలిగే మరొక ఉపలబ్ధి ఋతంభరాప్రజ్ఞ. ఇది అన్నిటికన్న ఉన్నత ఉపలబ్ధి–సర్వోన్నత ఉపలబ్ధి. ఇదే మనకు సమాధిస్థితిని కలిగించి సత్యసాక్షాత్కారం చేయిస్తుంది. ఆ సత్యం సామాన్య సత్యంకన్న చాలా గొప్పది . దానినే 'ఋతం' అంటారు. సామాన్య సత్యానికీ ఋతానికి చాలా అంతరముంది. ఎట్లన –

ఇప్పుడు మీరు నన్ను 'సమయ మెంత?' అని అడిగితే నేను చేతి గడియారం చూచి ఉదయం 10 గంటల 34 నిముషా లయినదని చెబుతాను. మరొక అరగంట తదుపరి సమయమెంత ? యని అడిగితే గడియారం చూచి ఉదయం 11 గంటల 4 నిముషా లయినదని చెబుతాను. ఈ రెండు పర్యాయములు నేను చెప్పినది సత్యమే. అయినప్పటికీ యిది ఋతం కాదు. అది ప్రవాహసత్యమేగాని నిత్యసత్యంగాదు. ఏది నిత్యసత్యమో, ఎప్పుడూ ఒకేరకమైన సమాధానం వస్తుందో దానిని మాత్రమే ఋతమంటారు. ఉదా: **'అగ్ని వేడినీ ప్రకాశాన్నీ కలిగి ఉంది. భూమి ఆకర్షణశక్తిని కలిగిఉంది'** ఈ మాటలు నిత్య సత్యములు. సంవత్సరాలు గడచినా యుగాలు గడచినా వీటిలో మార్పురాదు. ఇటువంటి ప్రాకృతిక అచల నియమాలను, పదార్థాల గుణాలను ఋతమంటారు. ఇట్టి ఋతజ్ఞానంతో కూడినదే ఋతంభరాప్రజ్ఞ.

ముఖ్యంగా గాయత్రీజపంవల్ల ఏకాగ్రత పెరుగుతుంది. అట్టి బుద్ధి ఏ విషయాన్నయినా ధారణ చెయ్యగలుగుతుంది. ధారణ బలపడినపుడు అంటే ఒకే విషయాన్ని నిరంతరాయంగా ధారణ చేసినపుడు అది ధ్యానమౌతుంది. ధ్యాన పరిపక్వత సమాధిని కలిగిస్తుంది. సమాధిలో – అంటే చిత్తవృత్తులు శాంతించి చిత్తము వృత్తిరహితమైనపుడు ధారణచేయబడిన పదార్థం లేదా విషయం సాక్షాత్కారమౌతుందంటారు యోగులు. ఇది బాహ్యప్రత్యక్షం వంటిది కాదట. దానిని యౌగికప్రత్యక్ష మంటారు. ఆ విధంగా కలిగిన జ్ఞానంలో ఎట్టి దోషంగానీ, మార్పుగానీ ఉండదు. అది ఋతంభరాజ్ఞానం – ఋతజ్ఞానం.

నేడు వైజ్ఞానికులు ప్రకృతిని నిశితంగా పరిశీలిస్తూ యిందు దాగియున్న శాశ్వత నియమాలను తెలుసుకోవడానికి చాలా ప్రయాసపడుతున్నారు. వీరి

యీ ప్రయాస ప్రశంసనీయమే. ఇది ఒకరకమైన తపస్సు. వీరి యీ శ్రమవల్ల కొన్ని నూతనావిష్కారాలు లభిస్తున్నాయి. కొన్ని సుఖసాధనాలు సమకూరుతున్నాయి. మన ప్రాచీన వైజ్ఞానికులునూ ఈ విధంగానే శ్రమించారు. దీనితోబాటు వారు గాయత్రీజపంచేస్తూ అంతర్ముఖులయ్యేవారు. అంతర్యామియైన పరమేశ్వరుని ధ్యానిస్తూ వారి ఆలోచనలు సరిగా ఉన్నవా ? లేవా ? అని సృష్టికర్త నడిగేవారు. ఆ పదార్థాన్ని గురించిన లేదా ఆ విషయాన్ని గురించిన విశేషజ్ఞానాన్ని పొంద యత్నించేవారు. ఆ రెండు ప్రయత్నాల వల్ల వారికి గొప్ప మేలుజరిగేది. పరమేశ్వరుని సహాయం లభించేది. సృష్టి రహస్యాలు చక్కగా తెలుసుకోగలిగేవారు. అట్టి వైజ్ఞానికులనే ఋషులంటారు.

వేదాలను మనం పరిశీలించి చూస్తే ప్రతీ సూక్తానికీ ముందు ఆ సూక్తంలోని మంత్రాలకు ఎవరెవరు ఋషులో, ఏవేవి దేవతలో, ఛందస్సు లెవ్వో, స్వరము లెవ్వో వ్రాసిఉంటాయి. అందులో ఋషులంటే - సృష్ట్యాదిలో మొదటగా ఆ మంత్రార్థాన్ని సమాధిస్థితిలో దర్శించినవారు. దర్శించిన లేదా పరమేశ్వరుని ద్వారా గ్రహించిన ఆ మంత్రార్థాన్ని సామాన్య మానవులకు తెలిపినవారు. అట్టి మహానుభావులపై కృతజ్ఞతతో వారి పేరును ఆ మంత్రానికి ఋషిగా చెప్పుకోవటమనేది అనాదిగా వస్తున్న సాంప్రదాయం. ఋతంభరా ప్రజ్ఞతోనే అది ఆ ఋషికి సాధ్యమయ్యింది. మనంకూడా సాధనచేసి ఋతంభరా ప్రజ్ఞను పొందవచ్చు. సమాధిస్థులమై ఆ మంత్రార్థాన్ని దర్శించవచ్చు. మన దేశంలో వేదకాలంనుండి ఈ 27వ చతుర్యుగంలోని ద్వాపరయుగాంతం వరకు చాలామంది ఋషులే ఉండేవారు. మహాభారత యుద్ధానంతరం జరిగిన పరిణామాలవల్ల వైదికప్రథ క్షీణించింది. వేదవ్యాస, జైమిని మహాఋషుల తదుపరి మహర్షి దయానంద సరస్వతి తప్ప మరెవ్వరూ ఆ స్థితిని అందుకోలేక పోయారు. ఆ మహాపురుషుడు స్వామీ విరజానంద సరస్వతి గారినుండి పొందిన వేదజ్ఞానంతోను, విశుద్ధ జీవనంతోను, నిష్ఠతో చేసిన సంధ్యా గాయత్రీజప యోగాభ్యాసాలతోను ఋతంభరాప్రజ్ఞను, ఋషిత్వాన్ని పొందారు. వారి సంక్షిప్త జీవనగాథ ఏమంటే -

## మహర్షి దయానందుని కథ

మహర్షి దయానందులవారి జన్మనామం మూలశంకరుడు. వీరిది సామవేదీయ ఔదీచ్య బ్రాహ్మణ కుటుంబం. గుజరాత్ రాష్ట్రంలోని టంకారా

గ్రామం. తండ్రి శ్రీ కర్షన్‌జీ తివారీ, తల్లి శ్రీమతి అమృతాబాయి, తండ్రి ఒక భూస్వామి మరియు రెవెన్యూ అధికారి (కలెక్టర్). వీరు శివభక్తులు. నిత్యం పార్థివలింగాన్ని పూజించేవారు. శైవ పురాణాదుల శ్రవణం, కీర్తనం చేసేవారు. తన కుమారుడునూ తనవంటి శివభక్తుడు కావాలని శ్రీ కర్షన్‌జీ అభిలాష.

శ్రీ కర్షన్‌జీ ఐదవ యేటనే మూలశంకరునకు అక్షరాభ్యాసం చేయించి సామాన్య సంస్కృతాన్ని నేర్ప నారంభించాడు. ఎనిమిదవ యేట ఉపనయన వేదారంభ సంస్కారాలు జరిపించి గాయత్రీ ఉపదేశాన్ని చేశాడు. వారి కుటుంబ సాంప్రదాయాన్ననుసరించి సామవేదాన్ని ఆరంభింపజేసినా మధ్యలో దాని నాపి యజుర్వేదాన్ని చెప్పించాడు. పూర్వజన్మ సంస్కారంవల్లా, గాయత్రీజపంవల్లా మూలశంకరుని బుద్ధి ధారణావంతమయ్యింది. పద్నాలుగేండ్లు నిండకముందే సంపూర్ణ యజుర్వేద సంహితనూ, ధాతుపాఠాది వ్యాకరణ గ్రంథాలను కంఠస్థం చేశాడు.

మూలశంకరుని పద్నాల్గవ యేట జరిగిన ఒక సామాన్య సంఘటన అతని జీవితంలో ఒక పెద్ద మార్పునకు కారణమయ్యింది. తండ్రి కర్షన్‌జీ తన కుమారుడు శివభక్తుడు కావాలనే తొందరబాటుతో ఒక శివరాత్రినాడు అతనిచే ఉపవాస జాగరణలు చేయించాడు. ఉపవాస జాగరణలు చేస్తే శివుని దర్శనం అవుతుందనీ, కోరిన వరాల నిస్తాడనీ ఆశచూపించాడు. దానితో ఆ బాలుడు శ్రద్ధాభక్తులతో పగలంతా ఉపవసించి జాగరణ చేయటానికి తండ్రివెంట శివాలయానికి వెళ్ళాడు. ఆలయంలో పూజలతో, భజన సంకీర్తనాదులతో రెండు ఝాములు గడచిపోయాయి. మూడవ ఝామునుండి భక్తుల రద్దీ పలుచబడసాగింది. ఆలయంలో ఉన్నవారునూ క్రమంగా నిద్రలోకి జారుకున్నారు. కాని, మూలశంకరుడు మాత్రం బలవంతంగా నిద్ర నాపుకుంటూ శివదర్శనం కొరకు లింగంవైపే తదేకంగా చూస్తున్నాడు. అంతటా నిశ్శబ్ద వాతావరణ మేర్పడింది.

అప్పటివరకు తినటానికి అవకాశంలేక ఆకలితోనున్న కొన్ని ఎలుకలకు ప్రసాదాల నారగించే అవకాశం యేర్పడింది. అవి భక్తులు నైవేద్యంగా పెట్టిన పండ్లు ప్రసాదాల నారగించి కడుపులు నింపుకొని పరుగులు తీయసాగాయి. శివలింగంపైకి కూడా ఎక్కి మలమూత్రాలను విసర్జిస్తూ గంతులు వేయసాగాయి.

దీనినంతా పరిశీలించి చూస్తున్న మూలశంకరుని మదిలో చాలా సందేహాల్లు కలిగాయి. శివపురాణంలో తాను చదివిన విషయాలు గుర్తుకు వచ్చాయి. 'శివుడు త్రిశూలధారి, త్రిపురారి, తన పాశుపతాస్త్రంతో ఎంతటి దైత్యులనైనా సంహరించ సమర్థుడు కదా ! అట్టి శివుడు ఈ ఎలుకల నేల యదలించుటలే'దని యాతని సందేహము. సందేహనివృత్తికై నిద్రలోకిజారుకున్న తండ్రిని లేపి ప్రశ్నించాడు. కాని, తండ్రి యతనికి సంతృప్తికరమైన సమాధానం యివ్వలేకపోయాడు.

'అసలైన శివుడు కైలాసంలో ఉంటాడు. ఈ కలియుగంలో అతడు క్రిందికి దిగిరాడు. ఆయన ప్రతిమను(లింగాన్ని) పూజించియే మనం మన భక్తిని తెలుపుకోవాలి' అని సమాధానపరచ యత్నించాడు తండ్రి. కాని, మూలశంకరుని కీ మాటలు రుచించలేదు.

'న తస్య ప్రతిమా-అస్తి యస్య నామ మహద్యశః'

అని తాను చదువుకున్న యజుర్వేద (32-3) మంత్రం జ్ఞాపకం వచ్చింది. మహాయశస్వియైన పరమేశ్వరునకు ప్రతిమ లేదనీ, ఉండదనీ కదా ! వేదం చెబుతున్నది. ఆ భగవంతుని ఉపదేశాన్ని కాదని ప్రతిమలను కల్పించుకొని పూజించుటెందులకు ? నేను ఎప్పటికైనా సత్యశివుని దర్శించియే పూజింతు'నని సంకల్పంచేసుకొని యింటికి వెళ్ళిపోయాడు. అమ్మ నడిగి అన్నం పెట్టించుకుని తిని నిద్రపోయాడు. అప్పటినుండి విగ్రహారాధనపై అతనికి శ్రద్ధ తగ్గిపోయింది.

అనంతరం అతని 16వ యేట చెల్లెలి మరణం, 19వ యేట తనను ప్రేమగా ఆదరించే పినతండ్రి మరణం జరిగాయి. దానితో మూలశంకరునికి విపరీతమైన దుఃఖం కలగటమేకాక మదిలో మృత్యుభయమేర్పడింది. ఎటులనైనా ప్రయత్నించి అమరత్వమార్గం తెలుసుకోవాలనీ, మృత్యువును జయించాలనీ, ప్రజలను కూడా మృత్యువు నుండి తప్పించాలనీ దృఢ సంకల్పం కలిగింది.

యోగసాధన చేసి నిజమైన శివుని దర్శించవచ్చుననీ, మృత్యువును జయించ వచ్చునని విద్వాంసులు చెప్పగా విన్నాడు. అందుచే ఒకనాడు ఎవరికీ తెలియకుండా యిల్లు వదలి యోగుల అన్వేషణలో దేశసంచారానికి బయలుదేరాడు. ఎక్కడెక్కడ గొప్ప యోగులున్నారని ప్రజలు చెబితే అక్కడక్కడకు వెళ్ళి వారు చెప్పిన యోగసాధనలు చేసి చూశాడు. వాటివల్ల అనుకున్న లాభం కలుగలేదు.

ఒక నైష్ఠిక బ్రహ్మచారి నుండి నైష్ఠిక బ్రహ్మచర్యదీక్ష తీసుకున్నాడు. మూల శంకరుడు శుద్ధచైతన్య బ్రహ్మచారిగా మారాడు. సిద్ధపుర జాతరలో తండ్రికి పట్టుపడియు ఎటులో యుక్తితో తప్పించుకొని ఉత్తరాఖండ్ వైపు పయనం సాగించాడు.

వేద శాస్త్రాల నధ్యయనం చేసి సత్యాన్ని తెలుసుకోవాలనే తీవ్రేచ్ఛ అతనికి కలిగింది. నైష్ఠిక బ్రహ్మచర్యదీక్షలో భిక్ష చేసుకొని స్వయంగా వంటచేసుకోవాలనే నియమముంటుంది. దానివల్ల అతని సమయంలో చాలా భాగం వాటన్నిటిని సమకూర్చుకోవడానికే సరిపోయేది. అధ్యయనానికి సమయం సరిపోయేది కాదు. అందుచే దక్షిణ భారతదేశానికి చెందిన స్వామి పూర్ణానంద సరస్వతి గారిని వేడుకొని వారిచే సంన్యాసదీక్ష గ్రహించాడు. శుద్ధచైతన్యుడు - స్వామీ దయానంద సరస్వతిగా మారాడు.

మరల విద్వాంసుల అన్వేషణలో యోగుల అన్వేషణలో దేశసంచారం ప్రారంభించాడు. ఛిన్నాడే, చాణోదకర్ణాలీ మొదలైన గ్రామాలలో వ్యాకరణ వేదాధ్యయనాలు చేశాడు. జ్వాలానందపురి, శివానందగిరి మొదలైన ఉత్తమ తరగతికి చెందిన యోగుల అంతేవాసియై పెక్కు యోగరహస్యాలను తెలుసుకున్నాడు. అరణ్యాలలో పర్వతశిఖరాలపై గంటల తరబడి యోగాభ్యాసం చేసి యోగారూఢుడయ్యాడు. అయినను వేదశాస్త్రాలను గూర్చిన అనేక సందేహాలు అతనిని ఉక్కిరిబిక్కిరి చేస్తుండేవి. ఎవరినైనా పూర్ణ విద్వాంసుని ఆశ్రయించి సందేహనివృత్తి చేసుకోవాలని ఉత్తరాఖండమంతా తిరిగి చూచాడు. అక్కడ తన సందేహాలను నివృత్తిచేయగల విద్వాంసులెవరూ కానరాలేదు. మథురానగరంలో స్వామీ విరజానంద సరస్వతి గారిని గూర్చి విన్నాడు. ఆయన వ్యాకరణంలో పూర్ణవిద్వాంసుడనీ, అష్టాధ్యాయీ మహాభాష్యాలలో ఆయనకు పూర్ణజ్ఞానం ఉందనీ తెలుసుకున్నాడు. అందుచే ఉత్తరాఖండాన్ని విడచి మథురానగరానికి చేరుకున్నాడు.

విరజానందస్వామికి అధ్యాపన విషయంలో (చదువుచెప్పే విషయంలో) కఠిన నియమాలుండేవి. ఆయన ఈశ్వరీయ జ్ఞానమైన వేదాలను, ఋషులు వ్రాసిన గ్రంథాలను మాత్రమే ప్రమాణంగా తీసుకునేవాడు. మిగిలిన అనార్ష గ్రంథాలను తీవ్రంగా ఖండించేవాడు. వాటివలననే భారతజాతి అనేక సాంప్రదాయాలవలలలో చిక్కుకొని విలవిలలాడుచున్నదని సప్రమాణంగా నిరూపించేవాడు. అట్టి విరజానందస్వామి వద్దకు సత్యాన్వేషియైన దయానందస్వామి చేరటం, ఆయనపెట్టిన నియమాలన్నిటికీ బద్ధుడై తనవద్దనున్న

అనార్ష గ్రంథాలన్నీ యమునలో పడవేసి రావటం జరిగాయి. ఇంతవరకు నీవు చదివిన అనార్ష గ్రంథాలనన్నిటిని విస్మరించి నే చెప్పిన అష్టాధ్యాయీ పద్ధతిలో అధ్యయనం చేయుమని విరజానందస్వామి విధించాడు. దయానందస్వామి అట్లే చేశాడు.

దయానందస్వామి నిత్యం రెండువేళలా సంధ్యావందనం, గాయత్రీజపం చేస్తూ అధ్యయనం కొనసాగించాడు. అనతి కాలంలోనే దయానందస్వామి అష్టాధ్యాయీ, మహాభాష్యాలపై పట్టు సాధించాడు. వ్యాకరణ రహస్యాలన్నీ కరతలామలకమయ్యాయి. వేదమంత్రాలలోని అసలు అర్థం అవగతం కాసాగింది. క్రమంగా సందేహాలన్నీ తీరిపోయాయి. శుద్ధమైన వైదికధర్మ మేమిటో బోధపడింది. సంతృప్తిగా అధ్యయనం పూర్తిచేశాడు. అప్పుడప్పుడు గురువుతో శాస్త్రార్థంచేసి సందేహాలన్నీ తీర్చుకున్నాడు. గురువునుండి సెలవు తీసుకొని ఏకాంతమునకు వెళ్ళి యోగసాధనచేస్తూ ముక్తిని పొందాలనుకున్నాడు. గురువుకు ప్రియమైన కొన్ని లవంగాలను సమర్పించి సెలవు కోరాడు. కాని, గురువు ఆ దక్షిణతో తృప్తిపడలేదు.

గురువు విరజానందుడు దయానందస్వామిపై చాలా ఆశలు పెట్టుకున్నాడు. దయానందుని బ్రహ్మచర్యము, తపస్సు, యోగాభ్యాసము, స్ఫూర్తి, సూక్ష్మబుద్ధి, శాస్త్రార్థప్రవృత్తి, దేశభక్తి, దైవభక్తి ఆయనకు చాలా నచ్చాయి. వేదమతం పేరుతో చలామణీ అవుతున్న అనేక సాంప్రదాయాలను, మతమతాంతరాలను ఖండించి శుద్ధమైన వైదికధర్మాన్ని పునరుద్ధరించగల శక్తి ఆయనకు శిష్యునిలో కనబడింది. ఆయనవల్లనే తిరిగి ఆర్షగ్రంథాల ప్రచారం జరుగగలదనీ, శుద్ధమైన వేదభాష్యం వెలువడగలదనీ గురువుకు గట్టి నమ్మకం. అందుచేతనే ఆయనకు దయానందస్వామి ఏకాంతానికి వెళ్ళి ముక్తికొరకు సాధనచెయ్యటం యిష్టం కాలేదు.

**"ప్రియ దయానంద ! ఈ చిన్న కానుక గుప్పెడు లవంగాలు గురుదక్షిణగా సరిపోతుందా ? నీవు ఇంక ఏమీ యివ్వలేవా? నీ వద్ద ఉన్నదానినే నేను కోరుచున్నాను. సంన్యాసివైన నిన్ను నీవద్ద లేనిదాని నేనెట్లు కోరుదును?"** అన్నాడు. దానితో దయానందస్వామి హృదయం కరిగిపోయింది. **'గురుదేవా! మీవల్ల నాకు చాలా జ్ఞానం కలిగింది. ఎన్నెన్నో సందేహాలు పటాపంచలయ్యాయి. శుద్ధమైన వైదికధర్మమేమిటో తెలిసింది. భగవన్ ! ఆజ్ఞాపించండి. మీరేమి అడిగినా యివ్వటానికి ఈ శిష్యుడు సిద్ధంగా ఉన్నా'** దని ప్రణమిల్లాడు.

గురువు విరజానందుడు వాత్సల్యంతో – 'వత్సా దయానంద ! నీమీదనే నే నెన్నెన్నో ఆశలు పెట్టుకున్నాను. నేడు భారతీయులు పరపాలనలో మ్రగ్గటమే కాక అనేక మూఢనమ్మకాలలో మునిగియున్నారు. అభావ అజ్ఞాన అవిద్యలలో పడి వాటినుండి బయటపడే మార్గం కానకున్నారు. వారికి నీవు వేదాల వెలుగుచూపి ఉద్ధరించు. వారి పూర్వవైభవాన్ని గుర్తుచేసి నిద్రమేల్కొల్పు. కనుమరుగైపోతున్న వేదాల నుద్ధరించి వాటికి ఆర్షపద్ధతిలో భాష్యం వ్రాయి. ఇదే నేను కోరుకుంటున్న గురుదక్షిణ' అన్నాడు.

దయానందస్వామి గురుదేవుల యాదేశ వచనములను విని వానిని శిరసా వహించుచూ గద్గద కంఠముతో **"గురుదేవా ! మీ శిష్యుడు మీ యాజ్ఞలనెట్లు ప్రాణములొడ్డి పాలించునో చూతురు గాక !"**అని శపథముచేసి సెలవు తీసుకొని కార్యక్షేత్రంలో ప్రవేశించాడు.

దయానందస్వామి కార్యక్షేత్రంలో ప్రవేశించి ప్రవచనాల ద్వారా, శాస్త్రార్థాల ద్వారా వైదిక సిద్ధాంతాలను ప్రచారం చేశారు. **'సత్యార్థప్రకాశ'** మనే పేరుతో ఒక అద్భుత గ్రంథం వ్రాశారు. అది జగత్ప్రసిద్ధి చెందింది. పెక్కు భాషలలోనికి అనువదింపబడి లక్షలాది ప్రతులు అమ్ముడుపోయాయి. దానిలోని మొదటి పది సముల్లాసాలు (అధ్యాయాలు) వేదసిద్ధాంతాలను తెలుపుతాయి. తదుపరి నాలుగు సముల్లాసాలు మత మతాంతరాలలోని, వివిధ సాంప్రదాయాలలోని లోపాలను సప్రమాణికంగా చూపుతాయి. అది సత్యాన్వేషణ కలిగిన ప్రతీవ్యక్తి చదువతగిన అద్భుత మార్గదర్శక గ్రంథం. దానిని ఎన్ని పర్యాయాలు చదివితే అంతగా మన బుద్ధి వికసిస్తుంది. హేతుబద్ధంగా ఆలోచించే వివేకబుద్ధి కలుగుతుంది. తద్వారా మన నిత్య జీవనంలో అన్ని రంగాలలోను ఉన్నతి కలుగుతుంది.

స్వామీజీ సత్యార్థప్రకాశ మొక్కటేకాక వేదవిద్యలను పరిచయం చేసే **'ఋగ్వేదాదిభాష్య భూమిక"**, మానవులు నిత్యం ఆచరించవలసిన కర్మలను వివరించే **'పంచమహాయజ్ఞవిధి'**, మానవ జీవన మైలురాళ్ళుగా చేయవలసిన వివిధ సంస్కారాలను తెలిపే అద్భుత స్మృతిగ్రంథం 'షోడశ సంస్కారవిధి' వ్రాశారు. ఈ సంస్కారవిధిలో గర్భాధానం మొదలు అంత్యేష్టి (శవదహనం) వరకు చేసుకోవలసిన 16 సంస్కారాలను గురించి వివరించారు. ఆ ప్రక్రియల ననుసరిస్తే మానవుడు సంస్కరింపబడి మహాత్ముడౌతాడు. ఇవేగాక, మరెన్నో లఘుగ్రంథాలు వ్రాశారు. వారు చేసిన శాస్త్రార్థాలు, వ్రాసిన లేఖలు కూడా గ్రంథాలుగా వెలువడి అనేక విషయాలలో మనకు మార్గదర్శనం చేస్తున్నాయి.

పూర్వం మన ప్రాచీన ఋషులు ఈశ్వరీయ జ్ఞానమైన వేదాలకు వ్యాఖ్యాన గ్రంథాలు వ్రాశారు. అవే బ్రాహ్మణ ఆరణ్యక గ్రంథాలుగా ప్రాచుర్యం పొందాయి. శాఖా గ్రంథాలలోనూ అక్కడక్కడ ఋషుల వ్యాఖ్యానాలు కనబడతాయి. అయితే ఆ బ్రాహ్మణ ఆరణ్యక గ్రంథాలు చాలావరకు లుప్తమైపోయాయి. కొన్ని మాత్రమే మిగిలి ఉన్నాయి. అవియును సంపూర్ణ వేదానికి భాష్యాలు కావు. కొన్ని మంత్రాలకు మాత్రమే వ్యాఖ్యానాలు. మధ్యకాలంలో సాయణ ఉవ్వట మహీధరాది ఆచార్యులు వేదాలకు భాష్యాలు వ్రాశారు. కాని, వారు ప్రాచీన ఋషులశైలి ననుసరించలేదు. వారు వారి కాలంనాటికి లోకంలో వేదమంత్రాల వినియోగం ఏవిధంగా జరుగుతున్నదో అందుకు అనుగుణంగానే భాష్యాలు వ్రాశారు.

సాయణాదుల కాలంనాటికి వేదమంత్రాలు కేవలం యజ్ఞయాగాది కర్మకాండలలోనే వినియోగింపబడేవి. ఆ యాజ్ఞికులలో కొందరు ధూర్తులు వాటిని తమ దుశ్చర్యలకు వినియోగించుకున్నారు. వేదమంత్రాలకు వికృతార్థాలు చెప్పి యజ్ఞాలలో పశువధ, మద్యపాన మాంసభక్షణ వ్యభిచారాదులను ప్రోత్సహించారు. ఉవ్వట మహీధరాదులును వాటి కనుగుణంగానే భాష్యాలు వ్రాశారు. అనంతరం వచ్చిన పాశ్చాత్య వేదభాష్య కారులైన సంస్కృత ప్రొఫెసర్లు మాక్స్‌ముల్లర్, మోనియర్ విలియమ్స్, భ్లూంఫీల్డు, హ్విటనీ, గ్రిఫిత్ మొదలైనవారు సాయణ ఉవ్వట మహీధరాదుల భాష్యాలే ప్రామాణిక మనుకొని వాటినే అనుసరించారు. ఆ వక్రించిన వేదభాష్యప్రథ మహర్షి దయానందుని వరకు అట్లే కొనసాగింది.

పై వ్యాఖ్యానకారులంతా సామాన్య సంస్కృతం తెలిసిన ఆచార్యులేకాని ఋషులుకారు. వారికి సంస్కృత పదముల వ్యావహారికార్థమే తెలుసునుకాని యౌగికార్థం తెలియదు. మన ప్రాచీన వేదాంగశైలి తెలిసినవారు మాత్రమే వేదపదములకు సరియైన అర్థం వ్రాయగలరు. అట్టివారునూ కొన్ని చోట్ల పొరబడవచ్చు. కనుక, యోగసాధనచేసి సమాధిస్థితిని పొంది తాము గ్రహించిన అర్థం పరమేశ్వర సమ్మతమా ? కాదా ? అని తెలుసుకోవాలి. సరియైన అర్థం స్ఫురింపజేయుమని ప్రార్థించాలి. అప్పుడు అంతర్యామియైన పరమేశ్వరుడు ఆ మంత్రార్థాన్ని ప్రకాశపరుస్తాడు. దానినే మంత్రార్థదర్శన మంటారు. అట్టి యోగ్యత కలిగినవారినే ఋషులంటారు. **'ఋషిర్దర్శనాత్'** అని ఋషి పదమును నిర్వచిస్తుంది నిరుక్తం.

స్వామి దయానంద సరస్వతిగారు అజ్మీర్ నగరానికి కొంతదూరంలోగల పుష్కర్ క్షేత్రంలో వేదాలకు భాష్యం వ్రాశారు. స్వామీజికి అక్కడి ప్రాకృతి

వాతావరణం బాగా నచ్చింది. దేవాలయం ప్రక్కనున్న సత్రంలో బసచేసి, వేదభాష్యం వ్రాయ నారంభించారు. మొదట ఋగ్వేదానికి భాష్యం వ్రాయ ప్రారంభించి కొంత వ్రాసిన తదుపరి అంతకన్నను యజుర్వేదానికి భాష్యం వ్రాయుట ముందవసరమనుకున్నారు. పౌరాణిక కర్మకాండ ఎక్కువగా యజుర్వేద మంత్రాలతో కూడి ఉంటుంది. ఆ మంత్రాలలోవున్న భావం ఒకటయితే క్రియలు మరొకరకంగా ఉంటాయి. అందుచే ప్రజలకు ఈ సత్యం తెలియ జేయాలనే సదుద్దేశ్యంతో ముందుగా యజుర్వేదానికి పూర్తిగా భాష్యం వ్రాశారు.

స్వామీజీ పుష్కర్‌లోని సత్రంలో రెండు గదులు వాడుకున్నారట. ఒక గదిలో భాష్యంవ్రాస్తూ ఏ మంత్ర విషయంలోనైనా సందేహం - సందిగ్ధత కలిగినపుడు ప్రక్క గదిలోనికి వెళ్ళి ఆ మంత్రంపై ధారణా ధ్యాన సమాధుల సమీక్షించేవారట. పరమేశ్వరుని ద్వారా ఆ మంత్రార్థం గ్రహించి తిరిగి మొదటి గదిలోనికి వచ్చి భాష్యం వ్రాశేవారట. ఈ విషయం యిప్పటికీ పుష్కర్ క్షేత్రాన్ని చూడవచ్చిన భక్తులకు క్షేత్రదర్శకులు (గైడ్స్) చెబుతూవుంటారు.

స్వామీజీ ఆ విధంగా యజుర్వేదానికి పూర్తిగా భాష్యం వ్రాశారు. ఋగ్వేద సప్తమ మండలంలోని 91వ సూక్తం వరకు (సగానికిపైగా) భాష్యం వ్రాశారు. కనుక, వారిని సామాన్య ఋషి అనటంకన్న మహాన్‌ఋషి - మహర్షి యనటమే సమంజసంగా ఉంటుంది. ఆయన కృషి వలననే నేడు మనం వేదాలను చూడగలుగుతున్నాం. వినగలగుతున్నాం, చదువగలుగుతున్నాం. అర్థంచేసుకొని, ఆవిధంగా ఆచరించగలుగుతు న్నాం. లేకున్న వేదాలను శంఖాసురుడు దెత్తుకుపోయాడనో, మరెవరో తీసుకుపోయారనో అనుకునేవారం. అప్పుడు వేదాలను గూర్చి అట్టి అభిప్రాయాలుండేవి. అట్టి సమయంలో మహర్షి **"వేదాలను ఎవరూ ఎత్తుకుపోలేదు. కొన్ని ప్రతులు జపాన్‌వారు తీసుకు వెళ్ళి ఉండవచ్చుకాని వేదం పూర్ణంగా మనవద్ద ఉం**"దని చూపించారు. వేదాలను కంఠస్థం చేసినవారు వాటిని పరిశీలించి సరిగానే ఉన్నవన్నారు. ఈ విధంగా మహర్షి వేద పునరుద్ధారకుడు.

ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు, వేదభక్తులు, నాలుగు వేదాలను పూర్తిగా చదివినవారు, రాజర్షిగా పిలువబడినవారు అయిన పూజ్యశ్రీ ఆచార్య వినోభా భావే గారు దయానందస్వామిగారి గురించి ఏమన్నారంటే -

"ఆధునిక కాలంలో వేదంయొక్క అధ్యయనం గడచిన 80-75 ఏళ్ళల్లో

భారతదేశంలో జరిగినంతగా దానికి ముందు వేయి పదిహేనువందల ఏళ్ళలోపు జరుగలేదు. నేటి యుగంలో తిరిగి వేదాన్ని ఉద్ధరించి భాష్యం, మొదలయినవి వ్రాసిన ఘనత కేవలం స్వామి దయానంద సరస్వతికే దక్కుతుంది. ఆయన వేదాలను చాటిచెప్పాడు. ప్రచారం చేశాడు. అంతేగాదు, మన తత్త్వజ్ఞానం గూడా వేదమూలకమే నన్నాడు. వేదం కేవలం జీవనాధారమేకాదు తత్త్వజ్ఞానానికికూడా అదే మూలం. వేదంయొక్క కొంత అంశ ఉపనిషత్తులలో కూడా వస్తుంది. ఉంది. మొత్తాన్ని చూడాల్సివస్తే వేదాన్నే చూడాలి" - అని చెబుతూ "వేదానికి ఆర్షపద్ధతిలో స్వతంత్ర్యమైన అర్థం చేయడానికి ప్రయత్నించాడాయన (స్వామి దయానంద సరస్వతి). ఇదో గొప్ప పని" అన్నారు. 'వేదచింతనం' - 17వ పేజీనుండి సంగ్రహీతము).

ఇట్లే, వేదాలలో కృషిచేసిన భారతీయులలో అరవిందయోగి, సాత్వలేకర్ పండితులు, విదేశీయులైన మాక్సముల్లర్, మోనియర్ విలియమ్స్ మొదలైనవారు దయానందస్వామి చేసిన కృషిని గురించి ప్రస్తుతించారు.

మహర్షి దయానంద సరస్వతిగారికి వేదాలపై భాష్యం వ్రాయగల, వేదాలపై శాస్త్రార్థాలు చేయగల బౌద్ధిక శక్తి గాయత్రీజపం వల్లనే కలిగింది. దీనినే ఋతంభరాప్రజ్ఞ యంటారు. ఆయన ఎక్కడున్నా తెల్లవారుఝామున 3 గంటలకే నిద్రలేచి ఊరికి దూరంగా ఏకాంత ప్రదేశానికి వెళ్ళి సంధ్యా గాయత్రీజపాలు, యోగాభ్యాసం చేసివచ్చేవారు. అందరినీ గాయత్రీజపం చేయుమని ప్రోత్సహించే వారు. మన ప్రాచీనార్యులంతా దీర్ఘకాల సంధ్యా గాయత్రీజపాలు చేసేవారని తరచు చెబుతూ ఉండేవారు. ఈ మంత్రం వర్ణభేదంగానీ, స్త్రీ పురుష భేదంగానీ లేకుండా అందరూ జపించవచ్చునని సూచించేవారు. అందుకు వారు ఎన్నెన్నో ప్రమాణాలు చూపించేవారు. ఆ మహర్షికి మనమెంతో ఋణపడి ఉన్నాము. ఆ ఋణం తీరాలంటే మనం కూడా వేదాలను చదివి లేదా విద్వాంసులద్వారా వైదిక సిద్ధాంతాలను తెలుసుకొని వేదధర్మప్రచారం చెయ్యాలి.

## బుద్ధివికాసానికి (జ్ఞాపకశక్తికి) ఔషధాలుంటాయా ?

ఏ విధంగా శారీరక బలాన్ని పెంచుకోవడానికి మందులూ వ్యాయామాలు ఉన్నాయో, అట్లే బుద్ధి బలాన్ని పెంచుకోవడానికి ఆయుర్వేదంలో కొన్ని మూలికలు, మందులు, వ్యాయామాలు చెప్పబడ్డాయి. మందులు

వాడటంతోబాటు సాత్త్వికాహారవిహారాలు సేవిస్తూ కొన్ని రకాల యోగాసన ప్రాణాయామాలు చేస్తే మంచి ఫలితాలుంటాయి. వయసు మళ్ళినవారిలోకన్నా బాల్యంలో నున్నవారి కివి ఎక్కువ మేలు చేస్తాయి. తమకు పుట్టబోయే పిల్లలు మేధావంతులు కావాలంటే పిల్లలు తల్లిగర్భంలో ఉన్నప్పటినుండీ ఆ ప్రయత్నం చేస్తే మరింత ప్రయోజనకరంగా ఉంటుంది. అందుకొరకే మన ప్రాచీన ఋషులు పుంసవన, సీమంతోన్నయన సంస్కారాలు రూపొందించారు. అవి గర్భిణులు విధిప్రకారం జరుపుకొని ; అందులో సూచించిన ఆహారాలు, మూలికలు సేవిస్తూ మానసికప్రసన్నతతో, ఉన్నతభావాలతో ఉంటే తప్పక ఆశించిన ఫలితాలు కలుగుతాయి. వివరాలకు మా ప్రచురణలు 'వైజ్ఞానిక సంస్కృతి', 'దౌహృదిని' చదువగోరుచున్నాము.

## బుద్ధివృద్ధికర మూలికలు, ఔషధాలు, ఆహారాలు సంక్షిప్తంగా :

సరస్వతీయాకు (బ్రాహ్మీ), శంఖపుష్పి, వస, జ్యోతిష్మతీ, అశ్వగంధా, జటామాంసీ, పుష్కరమూలము, కరక్కాయ, శొంఠి, కస్తూరి, కుంకుమపువ్వు, గుంటకలగర, తుంగముస్తలు, తులసి, లవంగాలు, మిరియాలు, దాల్చినచెక్క నేల తంగేడు, బోడతరము మొదలగు మూలికలు.

స్వర్ణభస్మము, రజితభస్మము, తగరభస్మము, పచ్చకర్పూరం, ద్రాక్షాసవము, బ్రాహ్మీఘృతము, బ్రాహ్మీరసాయనము, మేధోవటి, ప్రవాళపిష్టి, మోతీపిష్టి మొదలైన ఔషధాలు.

ఆవుపాలు, అంజీరుపండ్లు, బాదం, అక్రోట్, కొబ్బరి, పెద్ద ఉసిరికాయలు (అమలకములు), చిలుకకూర, బతువా మొదలైన ఆహారాలు బుద్ధిని వృద్ధి చేస్తాయి. సత్త్వగుణాన్ని కలిగిస్తాయి.

హోమియో ఔషధాలలో ముఖ్యంగా ద్వాదశ లవణాలలో Kali Phos (పోటాషియం ఫాస్ఫేట్) 6x అను మందు మెదడుకు టానిక్‌గా పనిచేస్తుంది. విద్యార్థులు, బుద్ధితో ఎక్కువగా పనిచేసేవారు దీనిని నిరభ్యంతరంగా వాడవచ్చు. ఇది మెదడును, నాడీ కణాలను బలపరచటమేగాక అలసటను పోగొట్టి సుఖనిద్రను

కలిగిస్తుంది. ఇది ఒక జీవరసాయనము. అంటే, మన శరీరంలో సహజంగా ఉండే ఒక ఖనిజము (బయో కెమికల్). ఇది నిరాశా నిస్పృహలను కూడా తగ్గించి స్ఫూర్తినిస్తుంది. ఈ మందొక్కటేకాక హోమియోలో మతిమరుపుకు మందులు చాలా ఉన్నాయి. వాటిని లక్షణాలనుబట్టి ఎంపిక చేసుకోవలసివస్తుంది. ముఖ్యంగా Anacardium, Aethusa, Baryta Carb, Ignatia, Nat Mur, Staphisagria, Silicea, Tuberculinum తరచుగా ఉపయోగపడతాయి.

ఆహారాలలో దేశీ ఆవులపాలు చాలా శ్రేష్ఠమైనవి. దీనిలో ఉండే గోధుమవర్ణం (లేదా కెరటిన్) మెదడులోని గ్రేమేటర్‌ను వృద్ధిచేస్తుంది. తద్వారా జ్ఞాపకశక్తి వృద్ధిచెందుతుంది. ఇంతేగాక, ఇది నాడీ మండలాన్ని బలపరచి ఉత్సాహాన్ని, స్ఫూర్తిని, సాత్త్వికతను, ఉన్నత భావాలను కలిగిస్తుందని పలువురు ఆయుర్వేద వైద్యులు, మహాత్ములు చెబుతారు. దేశీ ఆవుయొక్క పాలేగాక పెరుగు, వెన్న, నెయ్యికూడా ఆరోగ్యవర్ధకములే. వీటి మల మూత్రాలు అద్భుతమైన ఔషధగుణాలను కలిగి ఉంటాయి. వీటిపై దేశ విదేశాలలో చాలా పరిశోధనలు జరుగుతున్నాయి. పంచగవ్య చికిత్స రూపుదిద్దుకుంటోంది. వివరాలకు మా ప్రచురణ 'గోమాత' చదువండి.

రాత్రి పరుండబోయేముందు ఆవుపాలలో చిటికెడు మిరియాలపొడి కలిపి త్రాగితే జ్ఞాపకశక్తి పెరుగుతుందని ఒక ఆయుర్వేద వైద్యుని అనుభవం. ఇట్లే మరెన్నో చిట్కాలు వస్తుగుణదీపకలో ఉన్నాయి. ప్రయత్నించి చూడండి.

పూజ్యశ్రీ స్వామీ రాందేవ్‌గారు సూచించే పద్ధతిలో యోగవ్యాయామ, ప్రాణాయామాలు చేస్తే వందలవేలమందికి మానసిక సమస్యలు తొలగిపోయాయి. దేశీ ఆవునేతితో హోమం చేస్తే అనేకరకాల పిచ్చిలు బాగయ్యాయని డా. బేరీ రత్నార్ చేసిన పరిశోధనలలో వెల్లడయ్యింది. గాయత్రీ మంత్రాలతో ఆహుతులిస్తూ చేసే హోమం భౌతిక ప్రయోజనాలకేగాక మానసిక శాంతిని కలిగిస్తుంది. ధారణాశక్తిని వృద్ధిపరుస్తుంది. ప్రయత్నించి చూడండి.

ఇప్పుడు దేశీఆవుల సంఖ్య తగ్గిపోయి జర్సీఆవుల సంఖ్య పెరుగుతున్నది. వీటివల్ల పాలు సమృద్ధిగా లభిస్తున్నాయేకాని పైన పేర్కొన్న ఔషధగుణాలు తక్కువగా

..ంటున్నాయి. కనుక దేశీఆవుపాలు లభించనివారు రెండవ పక్షంగా జర్సీఆవుపాలు ..డుకోవచ్చును.

## అనుష్ఠానము

గాయత్రీ మంత్రాన్ని జపమంత్ర మన్నారు. ఎన్ని ఎక్కువ పర్యాయాలు జపిస్తే అంత ఎక్కువగా మేలుజరుగుతుంది. ఉదయ సాయం సంధ్యాసమయాలలో స్నానాదులొనర్చి శుద్ధులై ఈ మంత్రజపం చేస్తే మంచిది. సంధ్యాసమయాలలో మనస్సు తేలికగా ఈశ్వరాభిముఖమౌతుంది. వేదసందేశంకూడా యిదే -

**ఉపత్వాగ్నేఽ దివే దివే దోషావస్తర్ధియా వయమ్ ।**

**నమో భరంత ఏమసి ॥** (సామవేదం - 14)

"హే పరమేశ్వరాగ్నీ ! జ్ఞాన ప్రకాశక పరమేశ్వరా ! మేము ప్రతిదినము ఉదయ సాయం సంధ్యాసమయాలలో భక్తితో నీకు నమస్కరిస్తూ అంతర్యామివైన నీ సమీపమునకు చేరుదుము గాక !" అంటూ ఉపాసించమంటుంది.

వీలైనంతగా ఏకాంత నిశ్శబ్ద ప్రశాంత ప్రదేశాన్ని ఎంచుకొని ఆసనబద్ధులై ఈ జపం చెయ్యాలి. పద్మాసన సిద్ధాసన సుఖాసనాలు ఇందుకు అనుకూలంగా ఉంటాయి. ఇవికూడా వేయలేనివారు వారు స్థిరంగా ఎక్కువ సమయం కూర్చోగల ఆసనంలో కూర్చోవచ్చును. వెన్నెముక, మెడ వంగకుండా నిటారుగా ఉండాలి. అందువల్ల మనశ్చాంచల్యం శాంతిస్తుంది. కూర్చుండే ఆసనం గీతలో శ్రీకృష్ణభగవానుడు సూచించినట్లుగా ఉంటే మరింత అనుకూలంగా ఉంటుంది.

**శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిర మాసన మాత్మనః ।**

**నాత్యుచ్ఛ్రితం నాతినీచం చైలాజిన కుశోత్తరమ్ ॥** (భ.గీ. 6-11)

శుద్ధమైన ప్రదేశంలో ఎక్కువ ఎత్తుగా గాని, ఎక్కువ పల్లముగా గాని లేనిచోట దర్భలు పరచుకొని దానిపై మృగచర్మము, దానిపై వస్త్రాన్ని పరచుకొని ఆసనాన్ని ఏర్పాటు చేసుకోవాలి.

నేటి కాలంలో దర్భలు, మృగచర్మము దొరకుట కష్టమే. కనుక, ఒక తుంగచాప పరచుకొని దానిపై కంబలిని నాలుగుమడతలుగా చేసి వేసుకోవచ్చు. కాని, వాటిని మరొక పనికి వినియోగించకుండా జపధ్యానాదులకే వినియోగించుకోవాలి. ఇట్టి ఆసనంపై పైన తెలిపినట్లు స్థిరంగా ఎక్కువ సమయం కూర్చోగల ఏదైనా ఒక ఆసనంవేసుకొని ఆసీనులు కావాలి.

అనంతరం సంధ్యావందన విధిని ఆచరించి గాయత్రీజపానికి ఉపక్రమిస్తే చాలా అనుకూలంగా ఉంటుంది. నేడు లోకంలో చాలారకాల సంధ్యావందన విధులు ప్రచారంలో ఉన్నాయి. వీటన్నిటిలోను మహర్షి దయానంద సరస్వతిగారు సంకలనం చేసిన **'వైదిక సంధ్యావిధి'** శ్రేష్ఠంగా, ఉత్తమంగా ఉంది. అన్నీ వేదమంత్రాలే గల ఈ విధిలో మానవుడు తనకొరకు ఏమి ఆచరించుకోవాలో, పరులతో ఎట్లు మెలగాలో, ఆత్మోన్నతికి ఏమి చెయ్యాలో నిర్దేశించబడింది. ఇంతేగాక, చంచలమైన మనస్సును స్వాధీనపరచుకొని అంతర్ముఖం చేయగల సాధనాలు ఆ విధిలో ఉన్నాయి. ఆ విధిని అర్థభావనతో ఆచరించగలిగితే అవే యోగాంగాలైన ప్రత్యాహార ధారణా ధ్యాన సమాధు లౌతాయి. ఈ విధిలోని మంత్రాలలో ఎంతో విజ్ఞానము హేతుబద్ధత ఉన్నాయి. వివరంగా తెలుసుకోగోరువారు మా ప్రచురణ 'సంధ్యావందనం - వైజ్ఞానిక సమాలోచనము' చదువండి. కేవల విధి విధానాలు, భావార్థం ఈ పుస్తకం చివరలో ప్రచురింపబడుతున్నాయి. వాటిని అనుసరించండి.

సంధ్యావందన విధిలో గాయత్రీమంత్ర మొకటే జపమంత్రం. మిగిలిన మంత్రాలన్నీ ఒకసారి పఠిస్తే సరిపోతుంది.

## గాయత్రీ జపం ఎప్పుడు చెయ్యాలి ?

యాజ్ఞవల్క్య మహర్షి తన స్మృతిగ్రంథంలో సంధ్యా గాయత్రీజప సమయాల గురించి ఈ విధంగా వివరించాడు.

**శ్లో॥ జపన్నాసీత సావిత్రీం ప్రత్యగాతారకోదయాత్ ।**
**సంధ్యాప్రాక్ ప్రాతరేవ హి తిష్ఠే దా సూర్య దర్శనాత్ ॥**

-యాజ్ఞవల్క్యస్మృతి (ఆచారాధ్యాయం - 245)

"సాయంకాలం - సూర్యాస్తమయం మొదలు నక్షత్రోదయమగువరకు, ప్రాతఃకాలం - నక్షత్రాస్తమయం (నక్షత్రాలు కనబడకుండా పోయినది) మొదలు సూర్యోదయమగువరకు నుండు సంధ్యాసమయాలలో సావిత్రీజపాన్ని అంటే గాయత్రీజపాన్ని ఆచరించుటకు ఆసీనుడు కావాలి"

అనివార్య కారణాల వల్ల ఆ సమయాలలో గాయత్రిని జపించటానికి వీలుపడకపోతే పూర్తిగా మానుకోవటంకంటె వారికి వీలైన సమయాలలో చేయుట మంచిది. అందువల్ల ఏదో అశుభం జరుగుతుందని భయపడ నక్కరలేదు. ఋషుల యభిప్రాయం మనో ఏకాగ్రతకు సంధ్యా సమయాలు అనుకూలంగా ఉంటాయని చెప్పటమే.

కొందరు 'గాయత్రీజపాన్ని రాత్రిమాత్రం ఎప్పుడూ జపించకూడదు. సూర్యాస్తమయం తరువాత గాయత్రిని జపించరాదని శాస్త్రవిధి' అని వ్రాశారు. కాని, ఇది వారి వ్యక్తిగత అభిప్రాయం మాత్రమే. దీనికి ప్రామాణిక శాస్త్రధారమేదీ లేదు. బహుశః వారు గాయత్రీమంత్రంలోని సవిత భౌతికంగా ఆకాశంలో కనబడే సూర్యునిగా భావించి ఉండవచ్చు. కనుక సూర్యుదున్నపుడే సూర్యుని ప్రార్థించాలనే భ్రమలో పడి ఉంటారు. కాని, మనం పూర్వం తెలిసి కొన్నట్లుగా 'సవిత' అంటే సృష్టికర్త యనీ, అంతర్యామియై ప్రేరేపించు పరమేశ్వరుడనీ అర్థం. అతడు అన్నివేళలా ఉంటాడు. కనుక గాయత్రీమంత్రంతో ఎప్పుడైనా ప్రార్థన చేసుకోవచ్చు.

మన పూర్వులు రాత్రి 4వ ఝాము ప్రారంభంకాగానే లేచి కాలకృత్య స్నానాదులు ముగించుకొని సంధ్యా గాయత్రీజపాలు చేసుకొన్నట్లుగా చరిత్రలో కనబడుతున్నది. మరి, అది రాత్రియే కదా ! సూర్యోదయంతోనే దినం ప్రారంభమౌతుంది కదా ! అట్లే పనుల వత్తిడివల్ల తీరికలేక సాయం సంధ్యా సమయంలో జపించుటకు వీలుపడకపోతే పనులు ముగించుకొని భోజనం చేసేముందు ప్రశాంతంగా కూర్చుని గాయత్రీజపం చేసుకుంటే తప్పేముంది?

## ఎన్ని పర్యాయాలు జపించాలి ?

**శ్లో॥ సహస్ర పరమాం దేవీం శతమధ్యాం దశావరామ్ ।**
**గాయత్రీ యో జపే న్నిత్యం న స పాపేన లిప్యతే ॥**

– హరీత స్మృతి – అ. 4-48

వెయ్యి పర్యాయాలు గాయత్రిని జపించటం శ్రేష్ఠం. నూరు పర్యాయాలు జపించటం మధ్యమం. పది పర్యాయాలు జపించటం అధమం. గాయత్రిని జపించేవారిని పాపాలు అంటవు. అంటే వారు పాపకార్యాలకు దూరంగా ఉంటారు. తద్వారా వారికి దుఃఖాలు దూరమౌతాయి.

<u>జపం మూడు రకాలుగా ఉంటుంది.</u>

1. **వాచకము–** శ్రద్ధా భక్తులతో నెమ్మదిగా దగ్గరవారికి మాత్రమే వినబడునట్లు మంత్రాన్ని ఉచ్చరించటం.
2. **ఉపాంశువు –** పైకి ఏమాత్రము శబ్దము చేయక పెదవులను నాలుకను ఆడిస్తూ జపించటం.
3. **మానసికము –** కేవలము మనస్సులోనే జపించటం.

వీటిలో వాచకముకన్న ఉపాంశువు, ఉపాంశువుకన్న మానసిక జపము ఉత్తమమని ఋషులంటారు.

అగ్నిహోత్రంలో ఆహుతులిస్తూకూడా గాయత్రిని జపించవచ్చును. దానివల్ల మనోవాక్కాయములు శుద్ధం కావటంతో బాటు అగ్నిహోత్ర వాయువులవల్ల వాతావరణ దోషాలు తొలగిపోయి అవి శుద్ధమౌతాయి. సమయానికి వర్షాలు పడతాయి. ఋతువులన్నీ ప్రాణి మనుగడకు అనుకూలంగా మారతాయి. శంఖస్మృతి గాయత్రీహోమాన్ని గురించి మరికొన్ని విషయాలు చెబుతుంది.

**శ్లో॥ హుతా దేవీ విశేషేణ సర్వకామ ప్రదాయినీ ।**
**సర్వపాప క్షయకరీ వరదా భక్తవత్సలా ॥** – శంఖస్మృతి. 12-19

దివ్యగుణయుక్తమైన ఈ (గాయత్రీ) మంత్రానుచ్చరిస్తూ అగ్నిలో ఆహుతులర్పిస్తే అట్టివారి శారీరక దోషాలను, బాధలను పోగొట్టి గాయత్రి సకల మనోరథాలను నెరవేరుస్తుంది.

యజుర్వేదం మరొక విషయం చెబుతుంది.

**'పృథివ్యాం విష్ణు ర్వ్యక్రగం స్త గాయత్రేణ ఛన్దసా'** -యజుర్వేదం 2-25

గాయత్రీ మంత్రాలతో చేయబడిన యజ్ఞం ఈ పృథివీమండల ఃణులన్నిటికీ మేలుచేస్తుందంటుంది.

అయితే ఏఏ కోరికలతో మనం గాయత్రీహోమం చేస్తామో అందుకు గిన ఓషధులు సేకరించి విధి పూర్వకంగా అగ్నిహోత్రం చెయ్యవలసి ఉంటుంది. ుగ్నిహోత్రంవల్ల కలిగే ప్రయోజనాలను వివరంగా తెలుసుకోగోరువారు మా ఁచురణలు **'అగ్నిహోత్ర-వైజ్ఞానిక స్వరూపము', 'అగ్నిహోత్ర రాసాయనిక విశ్లేషణ'** అను పుస్తకాలు చదువండి.

## అందరూ జపించవచ్చునా ?

నిస్సంకోచంగా అందరూ జపించవచ్చును. స్త్రీలు, పురుషులు, పిల్లలు పెద్దలు, అన్ని వర్ణాలవారు, అన్ని కులాలవారు, అన్ని మతాలవారు, అన్ని సాంప్రదాయాలవారు అందరూ జపించవచ్చును. వీరంతా ఒక్క గాయత్రీ మంత్రమేకాదు అన్ని వేదమంత్రాలూ చదువవచ్చును. అర్థంచేసుకొని ఆచరించవచ్చును. ఈ మాట స్వయంగా వేదమే చెబుతున్నది -

**యథేమాం వాచం కల్యాణీ మావదాని జనేభ్యః ।**

**బ్రహ్మరాజన్యాభ్యాం శూద్రాయ చార్యాయ చ స్వాయ చారణాయ ।**

- యజుర్వేదం (26-2)

సృష్టికర్తయైన పరమేశ్వరుడు ఈ విధంగా ఉపదేశిస్తున్నాడు.

ఓ మానవులారా ! పరమేశ్వరుడనైన నేను ఈ కల్యాణకరమగు వేదవాణిని మానవమాత్రులందరికొరకు ఉపదేశించుచున్నాను. బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులకు; వారి స్త్రీలకు, భృత్యులకు మరియు సదాచారపరులైన అంత్యజులకును ఉపదేశించుచున్నాను. అట్లే మీరును అందరకు ఉపదేశించి ముందుతరాలవారి కందించండి" అంటున్నది. అంటే మానవమాత్రులందరు వేదమును చదువవచ్చును - చదివించవచ్చును. వినవచ్చును- వినిపించ వచ్చును. వైదిక ధర్మాన్ని ఆచరించవచ్చును - ఆచరింపజేయవచ్చును.

ధర్మాధర్మాలను కర్తవ్యాకర్తవ్యాలను తెలుసుకొని ధర్మాన్ని, కర్తవ్యాన్ని ఆచరించి ఇహపర సుఖాలను పొందవచ్చును. జ్ఞాన విజ్ఞానాలను పెంచుకొని అన్ని రంగాలలోను అభ్యుదయాన్ని పొందవచ్చును. సత్కర్మల ఫలాన్ని పరమేశ్వరున కర్పిస్తూ త్యాగమయ జీవితాన్ని గడపి ముక్తిని పొందవచ్చును.

కొందరు **"స్త్రీశూద్రౌ నాధీయతా మితి శ్రుతేః"** - స్త్రీలు శూద్రులు వేదం చదువకూడదని శ్రుతి (వేదం) చెప్పుచున్న"దని అంటున్నారు. ఈ మాటలు వారి కపోల కల్పితములేకాని నాలుగు వేదాలలోను ఇట్టి మాటలు లేనేలేవు. ఇంతేగాక, స్త్రీలకు వేదం యిచ్చినంత మహోన్నతస్థానం మరే మతగ్రంథం యివ్వలేదు.

**'బ్రహ్మచర్యేణ కన్యా యువానం విందతే పతిమ్'**అథర్వవేదం. 21.24.28

ఏ విధంగా మగపిల్లలు ఉపనయనం చేసుకొని గురకులానికి వెళ్ళి వేదశాస్త్రాలు చదువుకుంటారో ఆ విధంగానే ఆడపిల్లలుకూడా ఉపనయనం చేసుకొని, గాయత్రీ ఉపదేశాన్ని పొంది, కన్యాగురుకులానికి వెళ్ళి వేదశాస్త్రాలు చదువుకోవాలంటుంది వేదం.

**'స్త్రీ హి బహ్మా బభూవిథ'** (ఋ. 8-33-19) - స్త్రీలు నాలుగు వేదాలు చదువుకొని బ్రహ్మవేత్తలై యజ్ఞాలలో అధ్యక్షులు కావాలంటుంది.

**"చోదయిత్రీ సూనృతానాం చేతన్తీ సుమతీనామ్ । యజ్ఞం దధే సరస్వతీ"** (యజు. 20-85) - స్త్రీలు ఉపదేశకులై తమ సుమధుర జ్ఞాన వాక్కులతో ప్రజలను జ్ఞానవంతులను చేయాలనీ, తాము పరోపకారాది యజ్ఞాలను చేస్తూ ప్రజలను ప్రేరేపించాలనీ, వారిని యజ్ఞశీలురను చేయాలనీ వేదం ప్రబోధిస్తుంది.

నేడు నాగరికత పెరిగి స్త్రీలు అన్ని రంగాలలోను రాణిస్తున్నా నేటికీ కొందరు మూర్ఖులు స్త్రీలు వేదాలు చదువగూడదనీ, గాయత్రిని జపించకూడదని అంటున్నారు. కానీ, దానికి ప్రమాణమేమిటో చూపలేకపోతున్నారు. అట్టివారు ఒకసారి మన చరిత్రను పరిశీలిస్తే బాగుంటుంది. వాల్మీకి రామాయణంలో కౌసల్య మంత్రపూర్వకంగా అగ్నిహోత్రంలో ఆహుతులువేస్తూ హోమం చేసినట్లుగా, సీతాదేవి సంధ్యావందనం చేసినట్లుగా స్పష్టమైన వర్ణనలున్నాయి. పరిశీలించండి.

**శ్లో॥ సా క్షేమవసనా హృష్టా నిత్య వ్రతపరాయణా ।**
**అగ్నిం జుహోతి స్మ తదా మంత్రవత్కృత మంగళా ॥**

-వాల్మీకి రామాయణం (అయోధ్యాకాండ. 20-25)

శ్రీరాముడు వనవాసమున కేగుటకై తల్లి ఆశీర్వాదం కొరకు ఆమె వద్దకు వెళ్ళినపుడు "నిత్య అగ్నిహోత్ర వ్రతపరాయణియు, ప్రసన్నచిత్తయు నగు కౌసల్యాదేవి పట్టువస్త్రాలు ధరించి వేదమంత్రాల నుచ్చరిస్తూ అగ్నిహోత్రం (హోమం) చేయుచుండెను."

శ్లో॥ **సంధ్యాకాలమానాః శ్యామా ధ్రువమేష్యతి జానకీ ।**
**నదీం చేమాం శుభజలాం సంధ్యార్థే వరవర్ణినీ ॥**

-వాల్మీకి రామాయణం (సుందరకాండ. 14-49)

ఆంజనేయుడు లంకానగరమున సీతాదేవిని వెదుకుచూ సంధ్యాసమయ మగుట గమనించి - "సీతాదేవి ఆర్యగృహిణి కనుక ఈ సంధ్యాసమయమున సంధ్యచేయుటకై ఈ పవిత్ర నదీ తీరమునకు తప్పక రాగలదని" తలంచెను. వానరస్త్రీ తారకూడా యజ్ఞోపవీతం ధరించినట్లున్నది.

ఇంతేగాక, ఆమె వేదం చదువుకొన్న విదుషీమణిగా కనబడుచున్నది. వాల్మీకి రామాయణంలోని ఈ క్రింది రెండు శ్లోకాలను పరిశీలించండి.

రెండవసారి సుగ్రీవుడు వాలిని ద్వంద్వయుద్ధము చేయుటకు లలకారం చేయగా తార అనుమానించి వాలిని యుద్ధమునకు పోవద్దని మిక్కిలిగా వారించినది. అయినను వాలి యుద్ధానికి పోవటానికే కటిబద్ధుడయ్యాడు. అప్పుడు -

శ్లో॥ **తం తు తారా పరిష్వజ్య వాలినం ప్రియవాదినీ ।**
**చకార రుదతీ మందం దక్షిణా సా ప్రదక్షిణిమ్ ॥**

తన హితమును, పరహితమును గూడ సమానముగా కోరునదియు ప్రియము పలుకునదియు నగు తార మెల్లగా రోదించుచు వాలికి ప్రదక్షిణము చేసెను.

శ్లో॥ **తతః స్వస్త్యయనం కృత్వా మంత్రవ ద్విషయైషిణీ ।**
**అంతఃపురం సహస్త్రీభిః ప్రవిష్టా శోకమోహితా ॥**

-వా.రా. కిష్కింధకాండ (16-11,12)

అనంతరం ఆమె (తార) వేదమంత్రములతో, స్వస్తివాచనము పలికి, శోకపీడితయై తక్కిన స్త్రీలతో అంతఃపురమున ప్రవేశించెను.

రామాయణంలో పేర్కొన్న వానరులను పెక్కురు కోతులనుకుంటారు. అట్లే, కోతుల మాదిరిగానే వారి చిత్రాలను వేస్తారు. నాటకాలలో వేషాలు వేస్తారు. సినిమాలనూ అట్లే తీస్తున్నారు. ఇది పెద్ద పొరబాటు. వాల్మీకి రామాయణాన్ని జాగ్రత్తగా పరిశీలిస్తే వానరులు ఆ కాలంలో గిరిజన తెగకు చెందిన మానవులుగానే కనబడతారు వారిలోనూ విద్యావంతులు, వీరులు, వివేకవంతులు పెక్కురు కనబడతారు. వ్యాకరణాన్ని చదువుకొని వేదాల నధ్యయనం చేసిన వారునూ ఉన్నారు. అంజనీపుత్రుడైన ఆంజనేయుడు వ్యాకరణ పండితునిగా, చతుర్వేద వేత్తగా స్వయంగా శ్రీరాముడే ఒక సందర్భంలో పేర్కొంటాడు. ఈ క్రింది శ్లోకాలను గమనించండి.

సుగ్రీవుని మిత్రుని చేయగోరి రాయబారిగా హనుమంతుడు మొదటిసారిగా శ్రీరామునివద్దకు వచ్చి చాలాసేపు మాట్లాడి వెళ్ళిన తదుపరి శ్రీరాముడు లక్ష్మణునితో ఈ విధంగా అంటాడు.

శ్లో॥ నానృగ్వేద వినీతస్య నాయజుర్వేద ధారిణః ।
నాసామవేదవిదుషః శక్యమేవం ప్రభాషితమ్ ॥

శ్లో॥ **నూనం వ్యాకరణం కృత్స్నమనేన బహుధా శ్రుతమ్ ।**
**బహు వ్యాహరతానేన నకించి దపశబ్దితమ్ ॥**

వా.రా. కిష్కింధా (3-28-29)

ఓ లక్ష్మణా ! ఋగ్యజుస్సామ వేదములను క్షుణ్ణముగా అభ్యసింపనివానికి ఈ విధంగా మాట్లాడుట సాధ్యంకాదు. ఇతడు (ఆంజనేయుడు) పలుసార్లు వ్యాకరణశాస్త్రము శ్రవణము చేసినట్లున్నది. ఇది నిశ్చితం. కావుననే ఎంతగానో మాట్లాడుచున్నను ఒక్క యపశబ్దమైనను ఈతని నోట రాలేదు. ఈతడు మాట్లాడునపుడు ముఖములోగాని, కన్నులలోగాని, మరి ఏ యితర అవయవములందుగాని, ఎట్టి వికారమును (దోషమును) కలుగలేదు.......... ఈవిధంగా శ్రీరాముడు ప్రశంసించిన హనుమంతుని వాక్చాతుర్యమును వాల్మీకి మహర్షి 8 (వా.రా.కిష్కింధా - 3-28 నుండి 35) శ్లోకములలో వర్ణించెను. దీనినిబట్టి ఆనాడు గిరిజనులలోనూ బ్రాహ్మణక్షత్రియాదులున్నట్లు తెలియుచున్నది. విదుషీమణులైన స్త్రీలునూ ఉన్నట్లున్నది.

వీరేగాక ఘోషా, అదితి, గోదా, నదీ, యమీ, శశ్వతీ, సరమా, ఊర్వశీ, ...త్రేయీ, అపాలా, ఇంద్రాణీ, రోమశా, లోపాముద్రా, విశ్వవారా, సూర్యా, దక్షిణా, ...హూవాగ్, రాతీ, గోధా, శ్రద్ధా, ఇంద్రమాతురః, శచీ, సర్పరాజ్ఞీ, మొదలైన ...దుషీమణులెందరో మంత్రద్రష్టలైన ఋషికలుగా వేదములందు కనబడతారు. ...ల్లే గార్గీ, మైత్రేయి, సులభ మొదలగువారు ఉపనిషత్తులలోను, మదాలస, ...భయ భారతీదేవి మొదలగువారు చరిత్రలోను బ్రహ్మవాదినులుగా కనబడతారు.

'భీమా జాయా బ్రహ్మణ స్యోపనీతా' (ఋ. 10-109-4) అని వేదం ...ెబుతున్నది.

**"పూరాకల్పే కుమారీణాం మౌఞ్జీ బంధన మిష్యతే ।**
**అధ్యాపనం వేదానాం సావిత్రీవాచనం తథా॥"**

అని యమస్మృతి చెబుతున్నది.

**'పావృతం యజ్ఞోపవీతనీ మభ్యదానయన్'**
**'సూపనీతం వా అనుపనీతం వా కన్యామాదాయ'**

అను వాక్యాలు గృహ్యసూత్రాలలోను,

**'ఇమం మంత్రం పత్నీ పఠేత్'** మొదలగు వాక్యాలు శ్రౌత సూత్రాలలోను కనబడుతున్నాయి.

కాదంబరి కావ్యంలో బాణు డను కవి **"బ్రహ్మసూత్రేణ పవిత్రీ కృతకాయామ్"** అని మహాశ్వేతను వర్ణించాడు.

ఇన్ని ప్రమాణములుండగా స్త్రీ లెందుకు యజ్ఞోపవీతాన్ని ధరించకూడదు? గాయత్రి నెందకు జపించకూడదు ?

కక్షీవంతుడు, శబరుడు, సత్యకాముడు మొదలగువారు జన్మతో శూద్రులైనా ఋషులు, బ్రహ్మవేత్తలునైనట్లుగా చరిత్ర సాక్ష్యమిస్తున్నది. కనుక నిస్సంకోచముగా స్త్రీలు, శూద్రులు గాయత్రిని జపించవచ్చును. పూజ్యశ్రీ స్వామీ చిన్మయానందగారు ఏమంటారంటే -

"ప్రాచీన కాలంలో మగవారివలె స్త్రీలు కూడా ఈ గాయత్రీమంత్రాన్ని జపించేవారు. ప్రతీ స్త్రీకి ఆ రోజులలో ఉపనయన సంస్కారం జరిగేదని మనుమహర్షి చెబుతున్నాడు. వారు వేదాలను అధ్యయనంచేసి, ఇతరులకు

వేదపాఠాలను నేర్పుతూ తాముకూడా గాయత్రీమంత్రం జపించేవారు. స్త్రీలు అనగా కేవలం బ్రాహ్మణ క్షత్రియ స్త్రీలే అని అనుకోరాదు. (స్త్రీలంతా అని భావం). వాస్తవంలో పురుషులకంటే స్త్రీలకే మంత్రోపాసన ద్వారా ఆధ్యాత్మిక సాధన సఫలమై ఆత్మసాక్షాత్కారం శీఘ్రంగా కలిగినట్లు తెలుస్తున్నది. వారికి జీవితంలో మనసును చెదర్చే సమస్యలతో ప్రత్యక్షసంబంధం ఉండదు. కాబట్టివారు నిశ్చితంగా ఏకాగ్రతతో మంత్రోపాసన చేయగలిగేవారు. ఈ విధంగా శాస్త్రవిధులనుబట్టి, ప్రత్యక్ష పరిశీలననుబట్టి స్త్రీలు కూడా తప్పకుండా ఉభయ సంధ్యలలో గాయత్రీమంత్రాన్ని జపించాలనే నిర్ణయానికి మనం రాగలుగుతున్నాం.

వాస్తవంలో పురుషుడు చేసిన సాధనయొక్క ఫలితం అతడికొక్కడికే ఉపయోగపడితే, స్త్రీల ఆధ్యాత్మిక సాధనయొక్క ఫలితం వారికి, వారి భర్తలకు, పిల్లలకు మాత్రమేకాక సంపూర్ణ సమాజానికి కూడా శ్రేయోదాయకమని మన హిందూశాస్త్ర గ్రంథాలలో అడుగడుగునా చెప్పబడింది. " (జీవన జ్యోతి KINDLE LIFE)' గ్రంథం నుండి గ్రహించబడినది).

కనుక నిస్సంకోచంగా స్త్రీలు, పురుషులు, అన్ని వర్ణలవారు, అన్ని కులాల వారు గాయత్రీమంత్రాన్ని జపించవచ్చు.

## గాయత్రీ జపానికి యజ్ఞోపవీత మవసరమా?

ఈ ప్రశ్నకు సమాధానం తెలియాలంటే ముందుగా యజ్ఞోపవీతమంటే ఏమిటో, అది ఎందుకు ధరించాలో, దాని ఆశయమేమిటో అర్థంకావాలి. కనుక ముందుగా సంక్షిప్తంగా ఆ విషయం తెలిసికొందాము.

యజ్ఞోపవీత మొక వ్రతచిహ్నం. యజ్ఞ మంటే పరోపకారాది ఉత్తమ కర్మలు. **'యజ్ఞో వై శ్రేష్ఠతమం కర్మ'** - అని శతపథ బ్రాహ్మణం (7-1-5) నిర్వచిస్తుంది. అట్టి పరోపకారాది కర్మలు చేయుటను వ్రతముగా స్వీకరించి దీక్షాకంకణంగా ఈ యజ్ఞోపవీతాన్ని ధరిస్తారు. దీనిలో మూడు ప్రోగులుంటాయి. ఇవి మూడూ మూడు ఋణాలను (అప్పులను) తెలియజేస్తాయి. ఈ ఋణాలు పుట్టుకతోనే ప్రతీ మనిషికీ వస్తాయి. ఉంటాయి. అవి యేమంటే,

**1. పితృ ఋణము:** మనకు జన్మనిచ్చిన తల్లిదండ్రులను పితరులంటారు. వారు మనకు జన్మనిచ్చి బాల్యంలో మన కెన్నెన్నో సేవలు చేశారు. కనుక వారికి మనం ఎంతగానో ఋణపడి ఉంటాము. వారి ఋణం తీరాలంటే వారు

వృద్ధులైనపుడు లేదా వారు అనారోగ్యవంతులైనపుడు ఆదరభావంతో కృతజ్ఞతతో సేవలు చేయాలి. వారి మనస్సును నొప్పింపక శ్రద్ధాభక్తులతో మెలగాలి. ఇది వారు జీవించిఉన్నపుడే జరగాలి. గతించిన తరువాత వారికి మనం ఏమీ చెయ్యలేము. లోక వ్యవహారంలో ఉన్న చనిపోయిన వారిని గురించి చేసే శ్రాద్ధ తర్పణాలు (తద్దినాలు) వారికి చెందకపోగా అవి వేదసమ్మతాలు కావు. కేవలం అవి కొందరి స్వార్థపరుల కల్పనలు.

**2.దేవ ఋణము :** ఇచ్చట దేవతలంటే పృథివ్యాపస్తే జోవాయురాకాశాలనే పంచభూతాలు, వాటితో ఏర్పడిన దివ్యగుణాలుగల ప్రాకృతిక శక్తులు నని అర్థం. వాటికినీ మనం ఋణపడి ఉంటాం. ఏలనంటే - వాటితోనే మన శరీరాలు నిర్మింపబడ్డాయి. వాటివల్లనే పెరిగి పెద్దవై జీవిస్తున్నాయి. కనుక మనం వాటికి ఋణపడి ఉంటాం. ఇంతేగాక, మన శరీరాల నుండి వెలువడే మల మూత్ర స్వేదాదులద్వారా అవి మలినమౌతూ ఉంటాయి. కనుక మనం వాటికి చాలా ఋణపడి ఉంటాం. ఆ ఋణం తీరాలంటే మనం నిత్యం అగ్నిహోత్రం (యజ్ఞం-హోమం) చెయ్యాలి. తద్వారా వాతావరణ దోషాలు తొలగిపోయి దేవతలన్నీ శుద్ధమౌతాయి. పుష్టివంతమౌతాయి. తద్వారా మనకేగాక తోటి ప్రాణులకూ మేలు కలుగుతుంది.

ప్రాచీన కాలంలో ప్రతీ యింటా నిత్యం రెండువేళలా దైనిక అగ్నిహోత్రం (హోమం) జరిగేది. కాని, మధ్యకాలంలో మన దేశాన్ని విమతస్థులు విదేశీయులు పాలించటంవల్ల ఈ ఆచారం కనుమరుగైపోయింది. మరల మహర్షి దయానందులవారు వచ్చి ఈ వైజ్ఞానిక సదాచారాన్ని పునరుద్ధరించారు.

**3. ఋషి ఋణము:** మానవులకు జ్ఞానం పుట్టుకతోనే రాలేదు. ఇతరులవల్ల కలిగింది. వారిలో ముఖ్యులు ముగ్గురు. **'మాతృమాన్ పితృమాన్ ఆచార్యవాన్ పురుషో వేద'** అని ఋషుల కథనం. అంటే - మానవుడు తల్లివల్ల, తండ్రివల్ల, ఆచార్యులవల్ల (ఉపాధ్యాయులవల్ల) జ్ఞానవంతుడౌతాడని అర్థం. మనకు కలిగే ప్రాథమిక జ్ఞానానికి ఈ ముగ్గురూ కారణంగా ఉంటారని భావం. అనంతరం అధ్యయన స్వాధ్యాయ సత్సంగాదులవల్ల క్రమంగా మనిషి తన జ్ఞానాన్ని పెంచుకుంటాడు. కనుక వీరందరికి మానవుడు ఋణపడి ఉంటాడు. ఆ ఋణం తీరాలంటే - మనం జ్ఞానవంతులమై ఆ జ్ఞానాన్ని యితరులకు (ముందుతరాలకు) అందజెయ్యాలి.

విశేషంగా పరమేశ్వరుడు ప్రసాదించిన వేదజ్ఞానాన్ని మనం ఆకళింపుచేసుకొని, ఆచరించి శారీరక సామాజిక ఆత్మిక ఉన్నతులను పొందుతూ ఇతరులకు ఆ జ్ఞానాన్ని అందించాలి. ప్రాచీన ఋషులు ఆ విధంగా చేశారు. కనుక మనంకూడా ఆవిధంగా చేస్తే వారి ఋణం తీరుతుంది. **'స్వాధ్యాయా నార్చయేద్ ఋషీన్'** అని చెప్పినట్లు మనం వేదాలతోబాటు ఆ ఋషులు, మునులు మనకొరకు వ్రాసిన దర్శన ఉపనిషదాదులను స్వాధ్యాయం చేస్తూ, మనన చింతనలు చేసి మన జ్ఞానాన్ని పెంచుకొని దానిని మన ముందుతరాలకు అందజేస్తే వారిని సేవించనట్లే ఔతుంది.

పై మూడు ఋణాలు మానవుడై పుట్టిన ప్రతీ వ్యక్తికి ఉంటాయని 'జాయమానో వై నరః త్రిభిః ఋనవాన్ జాయతే (తైత్తరీయ సంహిత)" అని మన ఋషులంటారు. అయితే పై మూడు ఋణాలను బాగా అర్థం చేసుకొని వాటిని తీర్చుకోవడానికి ప్రయత్నం చేయాలనుకున్నవారే యజ్ఞోపవీతాన్ని ధరించాలంటారు. శూద్ర పరివారంలో జన్మించినా సదాచారాన్ని పాటిస్తూ విద్యావంతుడైతే బ్రాహ్మణుడౌతాడని - **'శూద్రో బ్రాహ్మణతా మేతి'** అని మనుమహర్షి తన మనుస్మృతిలో (10-65లో) తెలిపాడు.

యజ్ఞోపవీత ధారణను గురించి ఒక సందర్భంలో స్వామి వివేకానందుల వారేమన్నారంటే -

"ఈనాడు శ్రీ గురుదేవుల (శ్రీరామకృష్ణుని) జన్మతిథి. మహా పవిత్రమైన రోజు. ఈ రోజున ఆ మహాత్ముని పేరు తలంచినంత మాత్రం చేతనే మానవులు పునీతులు కాగలరు. కనుక, ఈ రోజున ఇచ్చటికి వచ్చే భక్తులందరికీ నేనే స్వయంగా యజ్ఞోపవీత ప్రధానం చేస్తాను. కాలక్రమంలో ఒక్క శ్రీరామకృష్ణ భక్తులను మాత్రమే కాకుండా, దేశ ప్రజలందరినీ బ్రాహ్మణస్థాయికి సముద్ధరించాలి." అన్నారు.

ఆ దినమున స్వామి అభీష్టము ననుసరించి సుమారుగా యాభైమంది పురుషులు శరచ్చంద్ర చక్రవర్తిద్వారా గాయత్రీమంత్ర దీక్షను గైకొని యజ్ఞోపవీతధారణ గావించారు. వారిని చూచి వివేకానందస్వామి ముఖం ఆనందంతో వెలిగిపోయింది. సంకుచిత విభేదాలు సమసిపోయి సర్వజనులు అత్యున్నత ఆధ్యాత్మిక స్థాయికి సముద్ధరింపబడవలెనను వివేకానందస్వామి ఉదారాశయం ఆచరణ పూర్వకంగా అమలు జరిగిన ఆరంభదినమది.

(ఈ సంఘటన నీలాంబరబాబు ఉద్యానగృహంలో తాత్కాలికంగా నెలకొన్న శ్రమునందు 1898వ సంవత్సరంలో జరిగింది.)

("శ్రీరామకృష్ణ ప్రభ" (ఏప్రిల్, 1989) మాస పత్రికనుండి గ్రహించబడినది)

స్వామి వివేకాందుల వారికన్న పూర్వమే మహర్షి దయానందులవారు ప్రాచీన వైదిక వర్ణవ్యవస్థను అనేక ప్రమాణాలు చూపి పునరుద్ధరించారు. సాహసించి శూద్రులుగా పరిగణింపబడుచున్న కొందరు విద్యావంతులకు యజ్ఞోపవీతాన్నిచ్చి గాయత్రీ ఉపదేశం చేశారు. దానితో వారి జీవితాలలో అద్భుతమైన మార్పువచ్చింది. వారు వైదిక ధర్మానికి అనన్యభక్తులై గురుకులాలు నడిపారు. శాస్త్రార్థాలు చేశారు. అద్భుతమైన సాహిత్యాన్ని సృష్టించారు. మహర్షి అనంతరం వారి అనుయాయులైన ఆర్యసమాజికులు లక్షలమందికి యజ్ఞోపవీతాలనిచ్చి గాయత్రీ ఉపదేశాన్ని చేశారు. ఇప్పటికీ చేస్తున్నారు. అభిరుచిగలవారు వారి ద్వారా యజ్ఞోపవీత సంస్కారం చేసుకోవచ్చు. గాయత్రీ ఉపదేశం పొందవచ్చు.

అసలు వర్ణవిభాగమన్నది జన్మతో రాదు. మనుమహర్షి చెప్పినట్లు - జన్మనా జాయతే శూద్రః సంస్కారాత్ ద్విజ ఉచ్యతే ( ) - జన్మతో మానవులంతా శూద్రులుగానే జన్మిస్తారు. సంస్కారాలవల్ల కొందరు ద్విజులై వారి వారి గుణకర్మ స్వభావాలనుబట్టి ఆయా వర్ణాలుగా వ్యవహరింపబడతారు. శ్రీకృష్ణభగవానుని అభిప్రాయంకూడా యిదే - **"చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మ విభాగశః (గీత. 4-13)"** గుణకర్మ స్వభావాలను బట్టే బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర వర్ణాలేర్పడ్డాయని ఈ వాక్య భావం.

ఒక వ్యక్తి ప్రారంభంలో విద్యను గ్రహింపలేక శూద్రునిగా ఉన్నా ప్రయత్నించి విద్యాసదాచారాలను నేర్చుకొని బ్రాహ్మణుడు కావచ్చును. అట్లే క్షత్రియులుగా లేదా వైశ్యులుగా కావచ్చును. మను మహర్షి ఏమంటారంటే -

**శూద్రో బ్రాహ్మణతామేతి, బ్రాహ్మణశ్చైతి శూద్రతామ్ ।**
**క్షత్రియాత్ జాతమేవం తు, విద్యాత్ వైశ్యాత్ తథైవ చ॥**

- మనుస్మృతి (10-65)

శూద్రుడు ప్రయత్నించి బ్రాహ్మణుడు కావచ్చును. బ్రాహ్మణునిగా ఉన్నా సదాచారాన్ని, ధర్మాన్ని కోల్పతే శూద్రుడౌతాడు. అట్లే క్షత్రియ వైశ్యులలో కూడా వర్ణ మార్పిడి జరగవచ్చు. వర్ణ విభాగానికి గుణకర్మ స్వభావాలే ముఖ్యం.

కాబట్టి విద్యావంతులంతా యజ్ఞోపవీతాన్ని ధరించి సదాచారాన్ని పాటిస్తూ గాయత్రీజపం చేసుకోవచ్చు. అన్ని రంగాలలోనూ ఉన్నతిని పొందవచ్చు.

ఇంత వివరించినా యజ్ఞోపవీతాన్ని ధరించడానికి కొందరు సంకోచిస్తారు. దానికి కారణం - ఇంతకు పూర్వం లేకుండా క్రొత్తగా యజ్ఞోపవీతం ధరిస్తే లోకులు వింతగా చూస్తారు. ఆర్యసమాజికుడ వయ్యావా? అంటారు. ఎన్నెన్నో ప్రశ్నలు వేసి వేధిస్తారు. వీటన్నిటికీ సమాధానాలు చెప్పలేక కొందరు యజ్ఞోపవీతాన్ని ధరించడానికి వెనుకాడతారు. మరి, అట్టివారు గాయత్రిని జపించవచ్చునా ? అనేది అనేకమందికి మదిలో మెదిలే ప్రశ్న. దానికి 'జపించవచ్చును' అనేది మా సమాధానం.

పూర్వం తెలుసుకొన్నట్లు - పరమేశ్వరుడు వేదాన్ని మానవమాత్రు లందరికొరకు ఉపదేశించాడు. ఆ మంత్రంలో 'శూద్రాయ చ అర్యాయ చ స్వాయ చ అరణాయ' అనే మాటలున్నాయి. కనుక అందరూ గాయత్రిని జపించవచ్చు. ఉన్నతిని పొందవచ్చు. మరొకసారి ఆ మంత్రాన్ని స్మరిద్దాం.

**యథేమాం వాచం కల్యాణీ మావదాని జనేభ్యః ।**
**బ్రహ్మరాజన్యాభ్యాం శూద్రాయ చార్యాయ చ**
**స్వాయ చారణాయ॥** (యజు. 26-2)

ప్రపంచ మేధావులంతా ప్రశంసించిన జగత్ప్రసిద్ధ **'సత్యార్థప్రకాశం'** అనే గ్రంథంలో మహర్షి దయానంద సరస్వతిగారు పై మంత్రాని కీవిధంగా వ్యాఖ్య వ్రాశారు. పరిశీలించండి :

(యథా) ఎట్లు నేను, (జనేభ్యః) మనుష్యులందరి కొరకు, (ఇమామ్) ఈ, (కల్యాణీమ్) కల్యాణమును అనగా సంసార సుఖమును, ముక్తి సుఖమును ఇచ్చునట్టి (వాచమ్) ఋగ్వేదాది చతుర్వేద వాణిని, (ఆవదాని) ఉపదేశించుచున్నానో అట్లే మీరును జేయవలయును. స్మృత్యాది గ్రంథములందు బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకే వేదపఠనాధికారము వ్రాయబడి యున్నదనియూ, స్త్రీ శూద్రులకు లేదనియూ, ఇక్కడ జన శబ్దముచే ద్విజులను మాత్రమే గ్రహింపవలెననియూ కొందరు ప్రశ్నించిరేని ఉత్తరం పరమేశ్వరుడే యిచ్చుచున్నాడు. చూడండి.

(బ్రహ్మరాజన్యాభ్యామ్) నేను బ్రాహ్మణ క్షత్రియుల కొఱకును, (అర్యాయ) వైశ్యులకొఱకును, (శూద్రాయ) శూద్రుల కొఱకును, (అరణాయ) అతిశూద్రుల కొఱకును వేదములను ప్రకాశపరచితిని. అనగా మనుష్యులందరును వేదములను చదివియు, చదివించియు ; వినియు వినిపించియు విజ్ఞానమును వృద్ధిపరచుకొని, మంచివానిని గ్రహించి చెడువానిని వదలి దుఃఖములనుండి దూరులై ఆనందమును బొందుదురుగాక ! అని భగవానుడు ఉపదేశించి యున్నాడు.

మీ మాట నమ్మవలయునా ? పరమేశ్వరునిదా? అవశ్యముగా మాననీయ మైనది. పరమేశ్వరుని మాటయే కదా ! - అని వ్రాశారు.

**('సత్యార్థప్రకాశం' తృతీయ సముల్లాసమునుండి గ్రహింపబడినది)**

కనుక మానవమాత్రులందరు అర్థభావనతో గాయత్రిని జపించి, ఆత్మనిరీక్షణ చేసుకుంటూ చెడును వదలి మంచిని గ్రహిస్తూ అన్ని రంగాలలోనూ ఉన్నతిని పొందవచ్చు.

## గాయత్రీ ప్రశంసలు

1. "ప్రగాయత్రేణ గాయత పవమానం విచర్షణిమ్
ఇన్దుం సహస్ర చక్షసమ్" (ఋ.9-60-1)

విశేషముగ ఈ గాయత్రీ మంత్రముతో సత్కర్మలయందు ప్రేరేపించు వాడును, మనలను కనిపెట్టి చూచువాడును, బ్రహ్మాండము నంతటిని తన ఐశ్వర్యముగ గలవాడును, పరమ సుఖదాతయునైన ఈశ్వరుని యొక్క గుణగానము జేయుచుండుము.

2 "యద్ గాయత్రే అధిగాయత్ర మాహితం.......
య ఇత్ తద్ విదుస్తే అమృతత్వ మానశుః" (ఋ. 1-164-23)

గాయత్రీ మంత్రమునందు రక్షణ శక్తి నిండియున్నది. అది మన గయాన్ - ప్రాణములను రక్షించును. దుఃఖముల పాలు గాకుండా రక్షించుచుండును. ఎవరు ఈ సత్యమును గ్రహింతురో వారు అధికముగ ఈ మంత్ర జపము చేసి అమృతత్వమును పొందుదురు.

3 **"గాయత్రేణ ప్రతిమిమీతే అర్కమ్"** (ఋ. 1-164-24)

"గాయత్రీ మంత్రము ద్వారా స్త్రీ, పురుషులు అర్కమ్ (పరమాత్మ)ను చేరగలుగుచున్నారు.

4 **"తథో హస్మాసతే సవితృప్రసూతా ఏవా**
**సర్వే కామాః సమృధ్యంతే"** (శత. బ్రా. 2-3-4-7)

ఈ గాయత్రీ మంత్రము జపించు వారలకు బుద్ధి వికసించి తద్వారా విద్యా విజ్ఞానములు వర్ధిల్లును. కామధేనువు వలె యిది వారి సర్వ కోరికలు తీర్చుచున్నది.

5 **"యా వై సా గాయత్రీ ఇయం వావ సా యేయం పృథివ్యస్యాం**
**హీదం సర్వభూతాం ప్రతిష్ఠితామేవ నాతిశీయతే"**(ఛా.ఉ. 3-12-2)

గాయత్రి నిశ్చయముగ అందరిని కాపాడునది. అది భూమి వలె అందరిని కాపాడుచుండును. గాయత్రియందే ప్రపంచమంతయు ప్రతిష్ఠితమై యున్నది. గాయత్రి నేదియు అతిక్రమించజాలదు.

6 **శతపథ బ్రాహ్మణ ప్రశంస :**

"త్రయీ విద్యలు (అనగా జ్ఞాన, కర్మ, ఉపాసనలు) గాయత్రి నుండియే గ్రహింపబడినవి. గాయత్రియొక్క మూడు పాదములు మూడు వేదములయొక్క అవయవములు. త్రయీ విద్య లందు (వేద త్రయమైన ఋక్, యజు, సామములందు) ప్రతిపాదింపబడి యున్న వైజ్ఞానిక రహస్యములు ప్రతీక (అవయవ) రూపమున గాయత్రి యందున్నవి." (శత. 14-8-4-1)

7 **బృహదారణ్య కోపనిషత్తు ప్రశంస :**

"గాయత్రీమంత్ర ప్రథమపాద సాధనచే భూ అంతరిక్ష ద్యులోకములు, అందలి పదార్థములు ప్రాప్తించును. ద్వితీయ పాద ఉపాసనచే జ్ఞాన, కర్మ, ఉపాసన లను వేదప్రతిపాదిత త్రయీ విద్యలు అవగతమగును. తృతీయపాద సాధనచే ప్రాణ అపాన వ్యాన వాయువులు, వాటి ఆధారముతో జీవించు ఈ ప్రాణి సమూహమంతయు అతనికి వశమగును." (బృహ.ఉ. 5-14-1, 2, 3)

మనుస్మృతి ప్రశంస:

శ్లో॥ అకారం చాప్యుకారం చ మకారం చ ప్రజాపతిః ।
వేదత్రయా న్నిరదుహద్ భూర్భువః స్వ రితి ॥ (మను. 2-76)

ప్రజాపతియైన పరమేశ్వరుడు అకార, ఉకార, మకారముల కలయికతో (అ+ఉ+మ) ఏర్పడిన 'ఓ౩మ్' పదమును మఱియు మహా వ్యాహృతులైన భూః, భువః, స్వః పదములను వేదత్రయిగా చెప్పబడు ఋక్, యజుః, సామ వేదముల నుండి పిండెను. అనగా ఆ వేద సారములను ఒక్కొక్క అక్షరముగా సంక్షిప్త పఱచి ఉపదేశించెను.

శ్లో॥ త్రిభ్య ఏవ తు వేదేభ్యః పాదం పాద మదూ దుహత్ ।
త దిత్యృచో స్యాః సావిత్ర్యాః పరమేష్ఠీ ప్రజాపతిః ॥

అట్లే, పరమేష్ఠీ ప్రజాపతియైన పరమేశ్వరుడు ఒక్కొక్క వేదమునుండి అనగా ఋక్ యజు స్సామముల నుండి ఒక్కొక్క పాదమును పిండి మూడు పాదములు గల సావిత్రీ (గాయత్రీ) మంత్రమును నిర్మించెను.

## 9. మహాభారత ప్రశంస :

శ్లో॥ య ఏతం వేద గాయత్రీం పుణ్యాం సర్వగుణాన్వితాం ।
తత్త్వేన భరత శ్రేష్ఠ ! స లోకే న ప్రణశ్యతి ॥
(మహా. భా. భీష్మ ప. 14-16)

భరత శ్రేష్ఠ ! ఓ ధర్మరాజా ! సర్వ శుభగుణ యుక్తము, పుణ్యము నగు గాయత్రీ తత్త్వమును యథావిధిగ తెలుసుకొనువాడు ఈ ప్రపంచమునందెన్నటికిని నష్టపోడు.

ఈ భారతములోనే అనుశాసన పర్వంలో ధర్మరాజు అడిగిన ఒక ప్రశ్నకు సమాధానంగా భీష్ముడు విస్తృతంగా గాయత్రీ మంత్ర వైశిష్ట్యాన్ని కొనియాడుట కాననగును-

ధర్మరాజ ఉవాచ:

శ్లో॥ పితామహ మహాప్రాజ్ఞ సర్వశాస్త్ర విశారద ।
కిం జప్యం జపతో నిత్యం భవేద్ ధర్మఫలం మహత్ ॥

శ్లో॥ ప్రస్థానే వా ప్రవేశే వా ప్రవృత్తే వాపి కర్మణి ।
దైవేవా శ్రాద్ధకాలే వా కిం జప్యం కర్మసాధనమ్ ॥

శ్లో॥ శాన్తికం పౌష్టికం రక్షాం శత్రుఘ్నం భయ నాశనమ్ ।
జప్యం యద్ బ్రహ్మ సమితం తద్ భవాన్ వక్తు మర్హతి ॥

(అను శాస. 150-1, 2, 3)

**ఓ పితామహ ! మహా విద్వాన్ ! సర్వ శాస్త్ర విశారద !**
**ఏ మంత్రం జపించడం వల్ల గొప్ప ధర్మఫలం లభించును ?**

ప్రయాణ సమయంలో, విశ్రాంతి సమయంలో, పనులు చేసుకుంటూ కూడా జపింపదగిన మంత్రమేది ? దేవ పితృ యజ్ఞాదులు నాచరించుచు స్మరించదగిన మంత్రమేది ? దేనిని జపించడం వల్ల శాంతి, సుఖము, ఆనందము, శత్రువుల నుండి రక్షణ, భయ నాశము కలుగును ? ధన ధాన్య రాజ్యాదుల పుష్టి కలుగును ?

## భీష్మ ఉవాచ :

శ్లో॥ యానపాత్రే చ యానే చ ప్రవాసే రాజవేశ్మని ।
పరాం సిద్ధి మవాప్నోతి సావిత్రీం హ్యుత్తమాంపఠన్ ॥

శ్లో॥ న చ రాజభయం తేషాం న పిశాచాన్న రాక్షసాత్ ।
నాగ్న్యంబు పవన వ్యాలాద్ భయం తస్యోప జాయతే ॥

శ్లో॥ చతుర్ణామపి వర్ణానా మాశ్రమస్య విశేషతః ।
కరోతి సతతం శాన్తిం సావిత్రీ ముత్తమాం పఠన్ ॥

శ్లో॥ నాగ్నిర్దహతి కాష్ఠాని సావిత్రీ యత్ర పఠ్యతే ।
న తత్ర బాలో మ్రియతే న చ తిష్ఠన్తి పన్నగాః ॥

శ్లో॥ న తేషాం విద్యతే దుఃఖం గచ్ఛంతి పరమాం గతిమ్ ।
యే శృణ్వంతి మహద్ బ్రహ్మ సావిత్రీ గుణ కీర్తనమ్ ॥

శ్లో॥ గవాం మధ్యే తు పఠతో గావోస్య బహు వత్సలాః ।
ప్రస్థానే వా ప్రవాసే వా సర్వావస్థాం గతః పఠేత్ ॥

శ్లో॥ జపతాం జుహ్వతాం చైవ నిత్యం చ ప్రయతాత్మనామ్ ।
ఋషీణాం పరమం జప్యం గుహ్యమేతన్నరాధిప ॥

శ్లో॥ సోమాదిత్యాన్వయాః సర్వే రాఘవాః కురవస్తథా ।
పఠన్తి శుచ యో నిత్యం సావిత్రీం ప్రాణీనాం గతిమ్ ॥

శ్లో॥ అభ్యాసే నిత్యం దేవానాం సప్తర్షీణాం ధ్రువస్య చ ।
మోక్షణం సర్వ కృచ్ఛ్రాణాం మోచయత్యశుభాత్ సదా ॥

ఓ ధర్మరాజా ! ఉత్తమోత్తమమైన సావిత్రీ పఠనమే (గాయత్రీ జపమే) సర్వకార్యములందును, సర్వకాల సర్వావస్థలందును చేయదగినది. అట్టి జపమే చెడు పనులనుండి దూరము చేయుచు క్రమముగా మోక్షప్రాప్తిని కలిగించును. ఈ మంత్రమును జపించిన రాజన్యులకు ఓడలు, విమానములు, రథములు మొదలగు అన్ని ప్రయాణ సాధనములు, అతిరథ మహారథులతో కూడిన విశాల సైన్యము లభించి దేశాంతర రాజ్యప్రాప్తి కలుగును.

సదా గాయత్రిని జపించు వానికి రాజుల వల్లగాని, పిశాచ రాక్షసుల వల్ల గాని ఎట్టి భయము ఉండదు. అగ్ని జల వాయు సర్పాదులు అతనికి హానిని కలిగింపలేవు. నాలుగు వర్ణములవారు, నాలుగు ఆశ్రమములలోను, పఠించదగిన శాంతినిచ్చు ఉత్తమమంత్ర మిది. సావిత్రీ పఠనము జరుగుచోట అగ్నిప్రమాదములు జరుగవు. శిశు మరణము లుండవు. సర్పాదుల భయ ముండదు. అవి దూరముగా పారిపోవును. ఈ గొప్ప వేద మంత్రమైన గాయత్రీ శ్రవణము చేయువానికి దుఃఖములన్నియు తొలగిపోయి పరమగతియైన మోక్షము ప్రాప్తించును. దీనిని గోవుల మధ్య పఠించిన గోసంతతి వృద్ధియగును. ప్రయాణ ప్రవాసాది సర్వావస్థలయందును గాయత్రిని జపించుట మంచిది.

అనాది కాలం నుండి ఋషులు, మునులు అందరు జపించుచు వచ్చిన ఈ గాయత్రీ మంత్రము ఉత్కృష్టమైనది. వారు ఈ మంత్రముతోనే ఆహుతులిచ్చుచు విశేష యజ్ఞాదులు చేసిరి. సూర్యవంశీయ, చంద్రవంశీయాది సమస్త రాజపురుషులు, ధీరులు, వీరులు నిత్యము శుద్ధులై శ్రద్ధతో దీనిని జపించి ఉత్తమ గతిని పొందిరి. ఈ గాయత్రిని సమస్త దేవతలు, సప్త ఋషులు, ధ్రువుడు కూడా నిత్యము జపించిరి.

సదా దీనిని జపించువారి దుర్గుణము లన్నియు తొలగిపోవును. సత్కర్మలయందు ప్రేరణ కలుగును. అవిద్యాది క్లేశము లన్నియు తొలగిపోయి ఆత్మ పరమాత్మల సాక్షాత్కారమగును. వర్ణనాతీతమైన దివ్యానందము లభించును.

## 10. శంకస్మృతి ప్రశంస :

**శ్లో॥ హుతా దేవీ విశేషేణ సర్వకామ ప్రదాయినీ ।**
**సర్వ పాపక్షయకరీ వరదా భక్త వత్సలా ॥ (12-19)**

గాయత్రీ మంత్రముతో అగ్ని యందాహుతు లిచ్చినచో సకల శారీరక మానసిక దోషములు నశించును. సకల కోరికలు నెరవేరును.

## 11 ఋషుల, మునుల ప్రశంసలు :

(అ) 'గాయత్రికి, బ్రహ్మకు (వేదమునకు) భిన్నత లేదు' **- వ్యాసమహర్షి**

(ఆ) 'ముక్తి బొందుటకు గాయత్రి మూలకారణము'-శృంగి ఋషి (ఇ) 'గాయత్రి జన్మమరణముల బంధము నుండి విడిపించును'

**-విశ్వామిత్ర మహర్షి**

(ఈ) 'గాయత్రి పాపములను నశింప జేయును' **- యాజ్ఞవల్క్యుడు**

(ఉ) 'గాయత్రి బ్రహ్మను (పరమాత్మను) సాక్షాత్కరింపజేయును' **- భరద్వాజుడు**

(ఊ) 'గాయత్రీ ఉపాసన వలన దీర్ఘాయువు లభించును' **- చరకుడు**

(ఋ) 'గాయత్రీ జపము వలన దుర్మార్గుడు కూడ పవిత్రుడై పోవును' (అనగా సన్మార్గుడై పోవును) **-వశిష్ఠుడు**

(ౠ) గాయత్రి వేదములకు మాత. ఈ ప్రపంచమునకును గాయత్రి మాతయే

**-మహాదేవుడు**

(ఌ) 'గాయత్రి సర్వశ్రేష్ఠమైన మహామంత్రము. దీనినే గురు మంత్రమందురు. ప్రాచీన కాలం నుండి దీనినే ఆర్యులందరు జపించుచు వచ్చిరి.

**- దయానంద మహర్షి**

## 12 మహాపురుషుల ప్రశంసలు :

- 'గాయత్రీ జపము నాలుగు వైపుల నుండి శక్తిని తీసుకొని వచ్చును'

**-రవీంద్రనాథ ఠాగూర్**

'గాయత్రీ జపము జీవాత్మకు ప్రకాశమునిచ్చును' -బాలగంగాధర తిలక్

'గాయత్రీ జపము భౌతిక అభావములనుకూడ దూరము చేయును'

- మదన మోహన మాలవ్య

. 'గాయత్రీ జపము వలన గొప్ప శక్తి లభించును' -రామకృష్ణ పరమహంస

- 'గాయత్రీ మంత్రము సద్బుద్ధి నిచ్చు గొప్ప మంత్రము' -స్వామి వివేకానంద

- 'గాయత్రీ జపము కామరుచి నుండి తప్పించి రామరుచి వైపు (పరమేశ్వరుని వైపు ) మరలించును' -స్వామి రామ తీర్థ

- 'గాయత్రీ ప్రార్థన సార్వభౌమిక (అందరూ చేయదగిన) ప్రార్థన'

డా॥ సర్వేపల్లి రాధాకృష్ణ

- 'గాయత్రీ మంత్రము నందలి శబ్దములు సమ్మోహకమైనవి. అవి పవిత్ర పరచు ఉత్తమ సాధనములు' - మహాత్మా హంసరాజ్

- వర్తమాన చికిత్సా పద్ధతి సర్వ విధముల ధర్మరహిత మయ్యెను. విధి ప్రకారము ప్రతి దినము గాయత్రీమంత్ర జపము చేయువాడు యెన్నటికిని రోగగ్రస్థుడు కాజాలడు. పవిత్రమైన ఆత్మయే పరిశుద్ధమైన శరీరమును నిర్మింప గలుగును. ధార్మిక జీవన నియమము యథార్థముగా శరీరాత్మలను గాపాడగలదని నా నిశ్చితాభిప్రాయము. ఇంతేగాక, ఈ గాయత్రీమంత్ర జపము రాష్ట్రీయ విపత్కాలమున శాంత చిత్తముతో చేయబడిన యెడల అది సంకటములను రూపుమాపుటకై తన పరాక్రమ ప్రభావములను చూపెట్టగలదు'

- మహాత్మాగాంధీ

- 'సమస్త ప్రాపంచిక దుఃఖముల నుండి విముక్తి నొందుటకును, వాస్తవిక యోగాభ్యాసముద్వారా మోక్షప్రాప్తిని బొందుటకును మార్గము గాయత్రి యందు వివరింపబడి యున్నది. కావున కేవలము ఈ గాయత్రీ మంత్రము యొక్క నిరంతర జపము ద్వారానే యోగసాధకులకు ముక్తి కలుగ గలదు.

- యోగి అరవింద

- 'సూర్యుడు తన ప్రకాశముతో చీకటిని పోగొట్టి పగటిని చేసినట్లు గాయత్రీ ఉపాసకుని హృదయములో సవితాదేవుడు అవిద్యాంధకారమును

పోగొట్టి ఆత్మను ప్రకాశపరచును'. - స్వామి ప్రభుఆశ్రిత.

- "చిన్నతనంలో నేనొక మొద్దు అబ్బాయిని. ఎంత చదివినా తలకెక్కక బాగా దెబ్బలు తినేవాడిని. దెబ్బలకు తాళలేక ఆత్మహత్యకు పాల్పడటం, ఎట్లో రక్షింపబడటంకూడ జరిగాయి. స్వామీ నిత్యానందుల వారి ఉపదేశంతో నిత్యం తెల్లవారుఝామున నిద్రలేచి అత్యంత నిష్ఠతో గాయత్రీ మంత్రాన్ని అర్థభావనతో జపించటం మొదలు పెట్టాను. తత్ఫలితంగా అయిదారు నెలల్లోనే బుద్ధి వికసించడం ప్రారంభమయ్యింది. జ్ఞాపకశక్తి పెరిగి. క్రమంగా విద్వాంసుడను కాగలగటమే గాక "ఆర్యగెజిట్", "మిలాప్" పత్రికలకు సమర్థవంతమైన సంపాదకుడను కాగలిగితిని. సంన్యాసినై వేద ధర్మ ప్రచారము చేయుచు నేడు మీ సత్కారములను పొందగలుగుచున్నాను. నా 8వ యేట నుండి యిప్పటి (81 సం॥ల) వరకు గాయత్రీమాత ఒడిలో కూర్చుని అమృతపానము చేయని దినముగాని, రాత్రిగాని లేదు.

- స్వామి ఆనందస్వామి సరస్వతి

- "ఇహ పర లోకములందు గాయత్రికంటె పవిత్రమైన వస్తువేదియు లేదు. వేద వేదాంగములను జదువుట వలన గలుగు ఫలితమే గాయత్రీ మంత్ర జపము వలన గలుగుచున్నది. గాయత్రిని ముప్పూటలా జపించుటచే శు భము కలుగుచున్నది. ఈవేదమంత్రము పాపముల నాశనమొనర్చి ఉత్తమ ఆరోగ్య, సౌందర్య, వ్రత, వీర్య, బ్రహ్మ వర్చస్సులనొసగెడిదై యున్నది.'

-స్వామి శివానంద సరస్వతి

"హిందువులు విగ్రహారాధకులు కారు. ఏలయన, వారి ధ్యేయ (గ్రీడ్) మంత్రము గాయత్రి. ఈ మంత్రమును 'తత్' - (అ) శబ్దమే యొక పరోక్ష (ఇన్విజబుల్) సృష్టికర్త -అనగా సవిత వంకకు సంకేత మొనర్చుచున్నది. అనేకు లీ మంత్రమును సూర్యోపాసనా మంత్రముగా నుడువుచున్నారు. కాని అది సరికాదు. ఏలయన సవితా శబ్దము సృష్టికర్తయైన ఈశ్వరునే బోధించుచున్నది. ఇదియును గాక ఈ మంత్రమున జ్ఞానము - బుద్ధి నిమిత్తమే ప్రార్థన కలదు. కావున నా జ్ఞానదాత జడసూర్యు డెన్నటికిని

కాజాలడు. ఇంతేకాదు, ఇందొక గొప్ప విశేషము కలదు. ఈ మంత్రమందుగల 'నః' శబ్దము సమాజవాచకమై యున్నది. కాన స్త్రీ పురుషాది మానవ మాత్రులందరికి దీని జపింప నధికారము కలదు. ఇట్లు మన పూర్వులు విగ్రహారాధకులు కారనియు, నిరాకార ఈశ్వరునే ధ్యానించు చుండిరనియు, ఈ నిరాకార ధ్యానమునకు ముఖ్య సాధనము గాయత్రీ మంత్రమనియు, స్త్రీ పురుషులకు గాయత్రీ మంత్రము జపించు నధికారము కలదనియు స్పష్టమగుచున్నది. **- స్వామి వివేకానంద**

**(లెక్చర్ ఆన్ గాయత్రీ ఎట్ అమెరికా)**

"క్రైస్తవ మతమునకు క్రీస్తు దక్క మరెద్దియును లేదు. ముస్లిము మతమునకు హజరత్ మహమ్మదు దక్క మరెద్దియును లేదు. బౌద్ధ మతమునకు బుద్ధుడు గాక మరేమియు లేదు. ఈ పురుషులే వారి వారి ధ్యేయము. అనగా నీ పురుషులు దక్క వారికి ధ్యానింపదగిన దేదియును లేదనుట. నేను క్రైస్తవుడనే అయినను సత్యము చెప్పుటలో నాకెట్టి సంశయమును లేదు. హిందువుల యొక్క ధ్యేయ మంత్రము 'గాయత్రి' (ఇది లేకుండ ఋషులుగాని, మునులుగాని, మహా పురుషులుగాని జీవింపజాలరు. హిందూమతము ఏ మానవవ్యక్తి విశేషముపై నాధారపడి యుండలేదు. ఈ గాయత్రి ద్వారా తిన్నగా పరమేశ్వరు నుండియే వారు జ్ఞానమును బడయగలుగుచున్నారు.

**-సర్ మోనియర్ విలియం(ద బుద్ధిజమ్)**

## 'గాయత్రీ' గొప్పతనం

"న గాయత్ర్యాః పరం మంత్రం న మాతుః పరదైవతమ్"

గాయత్రిని మించిన మంత్రము లేదు.

తల్లిని మించిన దైవములేదు.

# సంధ్యావందనము - బ్రహ్మయజ్ఞము

సంధ్యావందనం గృహస్థులు విధిగా చేయవలసిన పంచ మహాయజ్ఞాలలో ఒకటి. దీనినే బ్రహ్మయజ్ఞ మంటారు. ఐదు మహాయజ్ఞాలలోను ఇదే మొదటిది. ముఖ్యమైనది. ఏవైనా యిబ్బందులవల్ల మిగిలిన నాలుగు మహాయజ్ఞాలను చేయలేకున్నా బ్రహ్మయజ్ఞాన్ని మాత్రం విడవకూడదు. సర్వసంగ పరిత్యాగులైన సంన్యాసులునూ దీనిని అవశ్య మాచరించవలసినదేనని మన శాస్త్రాలు చెబుతాయి. గాయత్రీజపం ఈ బ్రహ్మయజ్ఞంలో అంతర్భాగమే. బ్రహ్మయజ్ఞాన్ని అంటే సంధ్యావందనాన్ని విధిపూర్వకంగా చేస్తే గాయత్రీజపం చేయటానికి మనస్సు, బుద్ధి, ఆత్మ సంసిద్ధమౌతాయి. జపంలో ఉత్సాహం ఆనందం లభిస్తాయి. కనుక ఆ సంధ్యావందన విధిని సంక్షిప్తంగా యిక్కడ తెలియపరుస్తున్నాము.

# సంధ్యావందన విధి

ముందుగా ముమ్మారు ప్రాణాయామం చేసి ప్రారంభిస్తే మనస్సు మనకు అనుకూలమౌతుంది. విధి విధానాలపై ఏకాగ్రత కుదురుతుంది. అనంతరం ఈ క్రింది గాయత్రీ మంత్రాన్ని పఠించి శిఖాబంధనం చేసుకోవాలి. పూర్వం పురుషులు శిఖలను పెట్టుకునే వారు. దీనివల్ల జ్ఞానేంద్రియ కేంద్రాలుగల మెదడు వెనుక భాగానికి చల్లదనం, కర్మేంద్రియ కేంద్రాలుగల ముందుభాగానికి వెచ్చదనం కలిగేది. జ్ఞానేంద్రియాలలో ప్రశాంతత, కర్మేంద్రియాలలో స్ఫూర్తి కలిగేవి. విదేశీపాలనలో ఆ పరంపర లుప్తమైపోయి పురుషులు క్రాఫ్‌లకు అలవాటు పడిపోయారు. వెంట్రుకలు చిందరవందరగా ఉంటే ఏకాగ్రత కుదరదు కనుక శిఖాబంధన క్రియ సంధ్యావిధిలో చేర్చటం జరిగింది. కనుక పురుషులు తల చక్కగా దువ్వుకోవాలి. స్త్రీలు దువ్వుకొని వెంట్రుకలను ముడి వేసుకోవాలి.

ఈ క్రింది గాయత్రీమంత్రం పఠించి ఆ క్రియ చేసుకోవాలి. గయ అనే పదమునకు ప్రాణశక్తులనే అర్థం ఉంది. శిఖా బంధనం వాటిని రక్షించే ప్రయత్నం కనుక గాయత్రీ మంత్రంతో ఆ క్రియ చేసుకోవటం అర్థవంతంగా ఉంటుంది.

## గాయత్రీ మంత్రం

**ఓం భూర్భువః స్వః । తత్సవితుర్వరేణ్యం**

**భర్గో దేవస్య ధీమహి । ధియో యో నః ప్రచోదయాత్॥**. యజు. 36. 3.

(శిఖా బంధనం వల్ల ప్రాణశక్తులు రక్షింపబడతాయి)

## ఆచమన మంత్రం

**ఓం శన్నో దేవీరభిష్టయ, ఆపో భవంతు పీతయే ।**

**శంయో రభిస్రవంతు నః ॥** (యజు. 36-12)

వ్యాపకుడవు దివ్యగుణయుక్తుడవు నైన ఓ పరమేశ్వరా ! మాపై అన్ని వైపులనుండి సదా సుఖములను వర్షింపజేయుము. మోక్షానందమును ప్రసాదింపుము.

## ఇంద్రియస్పర్శ మంత్రములు

ఎడమ అరచేతిలో ఉద్ధరిణడు నీటిని తీసుకొని కుడిచేతి మధ్య రెండు వ్రేళ్ళను ముంచి ఈ క్రింది మంత్రాలతో ఆ యా యింద్రియాలను మృదువుగా స్పృశించాలి. ఈ మంత్రాలతో మా యింద్రియాలను బలపరచుమని సర్వసంరక్షకుడైన ఓ౩మ్ నామక పరమేశ్వరుని ప్రార్థించటం జరుగుతుంది.

**ఓం వాక్ వాక్** (ఈ మంత్రంతో నోటి కుడి ఎడమ భాగాలను స్పృశించాలి, అట్లే ఈ క్రింది అవయవాలను స్పృశించాలి)

**ఓం ప్రాణః ప్రాణః** (నాసికా పుటములను)

**ఓం చక్షుః చక్షుః** (నేత్రములను)

**ఓం శ్రోతం శ్రోతం** (చెవులను)

**ఓం నాభిః** (నాభిని) **ఓం హృదయం** (గుండెను)

**ఓం కంఠః** (కంఠమును) **ఓం శిరః** (తలను)

**ఓం బాహుభ్యాం యశోబలమ్** (కుడి ఎడమ భుజములను)

**ఓం కరతల కరపృష్ఠే** (అరచేతులను, వాటి వెనుకవైపును స్పృశించాలి)

మిగిలిన నీటిని క్రింద వదలి మరియొకసారి ఉద్ధరిణడు నీటిని తీసుకొని మార్జనం చేసుకోవాలి.

## మార్జన మంత్రములు

ఈ క్రింది మంత్రములతో ఆ యా అవయవాలపై కుడిచెయ్యి మధ్య రెండు వ్రేళ్ళు మరియు బ్రొటనవ్రేలి సహకారంతో నీళ్ళు చిలుకరించుకోవాలి. (చల్లుకోవాలి)

**ఓం భూః పునాతు శిరసి** (తలపైన)

**ఓం భువః పునాతు నేత్రయోః** (కుడి ఎడమ నేత్రములపై)

**ఓం స్వః పునాతు కంఠే** (కంఠముపై)

**ఓం మహః పునాతు హృదయే** (హృదయముపై)

**ఓం జనః పునాతు నాభ్యామ్** (నాభిపై)

**ఓం తపః పునాతు పాదయోః** (కుడి ఎడమ పాదములపై)

**ఓం సత్యం పునాతు పునః శిరసి** (మరియొకసారి తలపై)

**ఓం ఖం బ్రహ్మ పునాతు సర్వత్ర** (మిగిలిన నీరు శరీర మంతటా చల్లుకోవాలి)

మార్జన మంటే పవిత్రం చేసుకోవటం. మా అవయవాలను పవిత్ర కార్యాలకే వినియోగిస్తామని సంకల్పం చేసుకోవటం అట్టి సద్బుద్ధినిమ్మని పరమేశ్వరుని ప్రార్థించటం.

## ప్రాణాయామ మంత్రాలు

సంధ్యావిధిలో ప్రాణాయామం చెయ్యటం ఒక భాగం. విధిగా ప్రతీవ్యక్తి కనీసం మూడుసార్లయినా ఉదయ సాయం కాలాలలో ప్రాణాయామం చెయ్యాలి.

ద్వారా ఆయువు పెరుగుతుంది. ఆరోగ్యం సరిగా అవుతుంది. ప్రాణశక్తులు, ఇంద్రియశక్తులు బలపడతాయి.

గాలిని లోపల లేదా బైట కుంభించినపుడు (ఆపియుంచినపుడు) మనసులో ఈ క్రింది మంత్రాలు స్మరించాలి.

**ఓం భూః, ఓం భువః, ఓం స్వః, ఓం మహః**

**ఓం జనః, ఓం తపః, ఓం సత్యమ్** (తై. ఆ. 10-17)

ఈ మంత్రాలతో పరమేశ్వరుని దివ్యగుణాలు స్మరింపబడతాయి. అతడు సత్ చిత్ ఆనందస్వరూపుడు. మహత్పరిమాణము కలవాడు. సృష్టికి జనకుడు. పాలకుడు. సత్యస్వరూపుడు – జడ ప్రకృతికన్నను, చేతన జీవులకన్నను గొప్పవాడు.

## అఘమర్షణ మంత్రములు

అఘం అంటే పాపం. ఈ క్రింది మంత్రాలను అర్థభావనతో పఠిస్తే పరమేశ్వరుని సృష్టిరచనా, పాలనా సామర్థ్యాలు అవగతమై పాపాలు చేయటానికి మనిషి భయపడతాడు. ఆ విధంగా యివి అఘాన్ని మర్షణం = పోగొట్టుకోవడానికి ఉపయోగపడతాయి.

**ఓం ఋతం చ సత్యం చాభీద్ధా త్తపసో ధ్యజాయత**
**తతో రాత్ర్యజాయత, తతః సముద్రోర్ణవః ॥**

ఋత మనబడే శాశ్వత నియమాలతో, సత్య మనబడే మూల ప్రకృతి పరమేశ్వరుడు చేసిన అబీద్ధాతపస్సువల్ల – అనంత జ్ఞాన సామర్థ్య పరిశ్రమలవల్ల ఈ పాంచభౌతిక సృష్టిగా ఉత్పన్నమయ్యింది. ఆ పరిణామంలో ముందుగా ప్రళయరూప రాత్రి ఉత్పన్నమయ్యింది. ఆ ప్రళయరాత్రిలోనే పరమేశ్వరుడు విడివిడిగా నున్న పరమాణువులను సంఘటితపరచి అణువులుగా నిర్మించాడు. ఆ అణువుల రాశియే అర్ణవ సముద్రమయ్యింది.

**ఓం సముద్రాదర్ణవా దధి సంవత్సరో అజాయత,**
**అహోరాత్రాణి విదధద్విశ్వస్య మిషతో వశీ ॥**

ఆ అర్ణవసముద్రం కుదించుకుపోయి సంవత్సరనామక బృహత్ అండముగా ఏర్పడింది. అది మరింతగా కుదించుకుపోతూ ప్రేలిపోయింది.

ముక్కలు ముక్కలుగా ఆకాశంలో విసిరివేయబడింది. పెద్ద ముక్కలు సూర్యులుగా (నక్షత్రాలుగా) చిన్న ముక్కలు గ్రహ ఉపగ్రహాదులుగా నిర్మింపబడ్డాయి.. గురుత్వాకర్షణ నియమంతో సూర్యుల చుట్టూ గ్రహాలు తిరుగుతూ సూర్యకుటుంబా లేర్పడ్డాయి. గ్రహాలపై అహోరాత్రా లేర్పడ్డాయి. ఇదంతా చేయుచున్నది వశీనామక పరమేశ్వరుడే. (అన్నిటినీ తన వశంలో పెట్టుకుని నియమంగా నడిపిస్తాడు కనుక సర్వవ్యాపక సర్వేశ్వరునకే 'వశీ' అని పేరు).

**ఓం సూర్యాచంద్రమసౌ ధాతా యథాపూర్వ మకల్పయత్,**

**దివం చ పృథివీం చాంతరిక్ష మథో స్వః ॥** ఋ. 10-160-1,2,3)

సూర్య చంద్రాది గ్రహగోళాలను, అందలి జడ చేతన సృష్టిని ధాతా -సర్వధారుడైన పరమేశ్వరుడు పూర్వకల్పంలో వలెనే సృజించాడు. పరమేశ్వరుని జ్ఞానం పరిపూర్ణంకనుక సవరణలు పరిష్కృతాలు అవసరం లేదు. ఎప్పటికినీ సృష్టి ప్రళయాలు ఇట్లే జరుగుతాయి.

అనంతరం మరియొకసారి ఈ క్రింది మంత్రంతో ముమ్మారు ఆచమనం చెయ్యాలి.

## ఆచమన మంత్రము

**ఓం శన్నో దేవీ రభిష్టయ, ఆపో భవంతు పీతయే**
**శం యో రభిస్రవంతు నః ॥** (యజు. 36-12)

తదుపరి ఈ క్రింది మంత్రాలతో మనసా పరిక్రమం చెయ్యాలి. అంటే, తాను స్థిరంగానే కూర్చొని మనస్సును ఆ యా దిక్కులలో స్థిరపరచి అర్థభావనతో ఈ మంత్రాలను పఠించాలి.

## మనసా పరిక్రమ మంత్రములు

**ఓం ప్రాచీ ది గగ్ని రధిపతి రసితో రక్షితాదిత్యా ఇషవః,**
**తేభ్యో నమోధిపతిభ్యో నమో రక్షితృభ్యో నమ**
**ఇషుభ్యో నమ ఏభ్యో అస్తు, యోస్మాన్ ద్వేష్టి,**
**యం వయం ద్విష్మ స్తం వో జంభే దధ్మః ॥**

తూర్పు దిక్కునకు ప్రకాశస్వరూపుడగు పరమేశ్వరుడు అధిపతిగా నుండి ప్రాణులు అంధకారంలో పడి మరణించకుండా తన ఆదిత్య(సూర్య) రూప బాణములతో రక్షించుచున్నాడు. అట్టి సంరక్షకునికి నమస్సులు. అతని ప్రకాశశక్తికి, అతని బాణములకు అతని అప్రతిహత రక్షణశక్తులకు అన్నిటికీ వందనములు.

ఎవరు మమ్ము ద్వేషించుచున్నారో, ఎవరిని మేము ద్వేషించుచున్నామో మమ్ములను అశాంతికి గురిచేయుచున్న ఆ ద్వేషమును హే పరమేశ్వర ! నీ న్యాయరూప బాహువుల కర్పించుచున్నాము. అత్యంత న్యాయకారివైన నీవు అందరికీ తగినవిధముగా న్యాయము చేయుదువు గాక !

**ఓం దక్షిణా ది గింద్రోధిపతి స్తిరశ్చిరాజీ రక్షితా,**
**పితర ఇషవః, తేభ్యో నమోధిపతిభ్యో నమో రక్షితృభ్యో నమ**
**ఇషుభ్యో నమ ఏభ్యో అస్తు, యోస్మాన్ ద్వేష్టి,**
**యం వయం ద్విష్మ స్తం వో జంభే దధ్మః ॥**

దక్షిణ దిక్కునకు ఐశ్వర్య స్వరూపుడైన పరమేశ్వరుడు అధిపతిగా నుండి తిర్యక్ ప్రాణులనుండి పితరులు(చంద్ర నక్షత్రాదులు) అనే బాణములతో రక్షించుచున్నాడు.............................

**ఓం ప్రతీచీ ది గ్వరుణోధిపతిః పృదాకూ రక్షితాన్న మిషవః,**
**తేభ్యో నమోధిపతిభ్యో నమో రక్షితృభ్యో నమ**
**ఇషుభ్యో నమ ఏభ్యో అస్తు, యోస్మాన్ ద్వేష్టి,**
**యం వయం ద్విష్మ స్తం వో జంభే దధ్మః ॥**

పటమట దిక్కున పరమేశ్వరుడు తన వరుణశక్తితో అన్న మనెడు బాణములను సంధిస్తూ ప్రాణుల ఆకలిబాధలను పారద్రోలుచున్నాడు.

**ఓం ఉదీచీ దిక్ సోమోధిపతిః స్వజో రక్షితాశని రిషవః**
**తేభ్యో నమో ధిపతిభ్యో నమో రక్షితృభ్యో నమ**
**ఇషుభ్యో నమ ఏభ్యో అస్తు, యోస్మాన్ ద్వేష్టి,**
**యం వయం ద్విష్మ స్తం వో జంభే దధ్మః ॥**

ఉత్తర దిక్కున పరమేశ్వరుడు తన సోమశక్తితో ఆశని = మెరుపు లనే బాణాలతో స్వజలనుండి(స్వయంగా ఉత్పన్నమయ్యే బ్యాక్టీరీయా, వైరస్‌లనుండి) రక్షిస్తున్నాడు.........................

**ఓం ధ్రువా ది గ్విష్ణురధిపతిః కల్మాషగ్రీవో రక్షితా వీరుధ ఇషవః,**
**తేభ్యో నమోధిపతిభ్యో నమో రక్షితృభ్యో నమ**
**ఇషుభ్యో నమ ఏభ్యో అస్తు, యోస్మాన్ ద్వేష్టి,**
**యం వయం ద్విష్మ స్తం వో జంభే దధ్మః**

క్రింది దిక్కున సర్వాధారుడైన పరమేశ్వరుడే భూమిలో విష్ణువై వ్యాపించి కాలుష్యములబారి నుండి ప్రాణులను రక్షించుటకు వీరుధములు(చెట్లు) అనెడు బాణములను సృజించుచున్నాడు.....................

**ఓం ఊర్ధ్వా దిగ్ బృహస్పతి రధిపతిః శ్విత్రో రక్షితా వర్ష మిషవః,**
**తేభ్యో నమోధిపతిభ్యో నమో రక్షితృభ్యో నమ**
**ఇషుభ్యో నమ ఏభ్యో అస్తు, యోస్మాన్ ద్వేష్టి,**
**యం వయం ద్విష్మ స్తం వో జంభే దధ్మః ॥**

- (అథర్వవేదం (3-27-1 నుండి 6 వరకు)

పరమేశ్వరుడు ఊర్ధ్వదిక్కున బృహస్పతిగా నుండి వర్షము లనెడు బాణములతో ఈ భూమి శ్విత్రము(ఎడారి) కాకుండా రక్షించుచున్నాడు.

ఎవరు మమ్ము ద్వేషించుచున్నారో, ఎవరిని మేము ద్వేషించుచున్నామో మమ్ములను అశాంతికి గురిచేయుచున్న ఆ ద్వేషమును హే పరమేశ్వర ! నీ న్యాయరూప బాహువుల కర్పించుచున్నాము. అత్యంత న్యాయకారివైన నీవు అందరికీ తగినవిధముగా న్యాయము చేయుదువు గాక !

మనస్సుతో ఈ విధంగా పరిక్రమం(చుట్టూ తిరగటం) వల్ల అన్ని దిక్కులా పరమేశ్వరుడు రక్షకుడై ఉన్నాడని గ్రహించి మనస్సు శాంతిస్తుంది. అంతర్ముఖమౌతుంది. దీనిని యోగాంగాలలోని ప్రత్యాహారంగా భావించవచ్చును.

## ఉపస్థాన మంత్రములు

వైదిక పరిభాషలో ఉపస్థానమన్నా, ఉపాసనయన్నా-జీవాత్మలమైన మనం బాహ్యవిషయ ఆలోచనల నన్నిటిని కట్టిపెట్టి అంతర్ముఖులం కావటం. అంతర్యామిగా మనలో వ్యాపించియున్న పరమేశ్వరుని సమీపమున ఆసీనులమై అతని సచ్చిదానందములను పొంద యత్నించటం. ఈ క్రింది వేదమంత్రాలు అర్థభావనతో పఠిస్తే ఆ స్థితిని చేరటానికి అనుకూలంగా ఉంటుంది.

**ఓం ఉద్వయం తమసస్పరి స్వః పశ్యన్త ఉత్తరమ్,**
**దేవం దేవత్రా సూర్య మగన్మ జ్యోతి రుత్తమమ్.** (యజు. 35-14)

జీవులమైన మేము అవిద్యా అజ్ఞానరూప అంధకారంనుండి పైకెగసి అంతర్ముఖులమై ఆనందస్వరూపుని దర్శింతుము గాక ! మరింత అంతర్ముఖులమై సమస్త దేవతలకు దివ్యత్వాన్ని ప్రసాదించుచున్న జ్ఞానసూర్యుని(దేవదేవుని) దర్శింతుముగాక ! అతని నుండి ఉత్తమ జ్ఞానమును పొందుదుము గాక !

**ఓం ఉదుత్యం జాతవేదసం దేవం వహన్తి కేతవ ః**
**దృశే విశ్వాయ సూర్యమ్.** (యజు. 33-31)

సమాధిస్థులమై ఆ జ్ఞానసూర్యుని నుండి జ్ఞానపతాకముల నందుకొందుము గాక ! ఆ విశుద్ధ జ్ఞానముతో వేదమంత్రార్థ దర్శనమును, ప్రాపంచిక పదార్థాల యథార్థ దర్శనమును చేయుదుము గాక !

**ఓం చిత్రం దేవానా ముదగా దనీకం చక్షు ర్మిత్రస్య వరుణ స్యాగ్నేః**
**అప్రా ద్యావా పృథివీ అంతరిక్షం,**
**సూర్య ఆత్మా జగత స్తస్థుషశ్చ స్వాహా.** (యజు. 7-42)

చిత్రవిచిత్రమైన ఆ పరమేశ్వరుడు దివ్యగుణయుక్తులైన ఉపాసకులకు చేయూతనిచ్చి ఆత్మబలము నిచ్చుచున్నాడు. మిత్రా వరుణ అగ్ని స్థితులను పొందిన ఉపాసకులకు మార్గదర్శకుడై ఆత్మికోన్నతిని కలిగించుచున్నాడు. వ్యాపక గుణముగల ఆ పరమేశ్వరుడు ద్యావాపృథివీ అంతరిక్షాలలో అంతటా పూర్ణంగా

వ్యాపించియున్నాడు. స్థావర జంగమ జగత్తునందంతటా ఆత్మసూర్యునిగా వెలుగొందుచున్నాడు. స్వాహా - ఇది సత్య కథనము.

**ఓం తచ్చక్షుర్దేవహితం పురస్తా చ్ఛుక్ర ముచ్చరత్ ;**
**పశ్యేమ శరదః శతమ్, జీవేమ శరదః శతం,**
**శృణుయామ శరదః శతం, ప్రబ్రవామ శరదః శతం**
**అదీనాః స్యామ శరదః శతం, భూయశ్చ శరదః శతాత్॥**

(యజు. 36-24)

తత్ పద వాచకుడైన పరమేశ్వరుడు దేవహితుడు. పరోపకార పరాయణులకు హితము చేయువాడు. సృష్టి స్థిత ప్రళయాలను చేయుటలో అతడు శుక్రుడు - తన మహత్తును చూపుచున్నాడు. అతని అనుగ్రహమున మేము ఈ శరీరములతో నూరు శరత్తులు చక్కగా చూతుముగాక ! బలారోగ్య ఉత్సాహాలతో జీవింతుముగాక ! జ్ఞాన విజ్ఞానములను చక్కగా విందుము గాక! మేము నేర్చిన ఆ జ్ఞానమును చక్కగా ప్రవచింతుముగాక ! శతశరత్తులు మేము పరాధీనులముగాక స్వాధీనతాయుతుల మగుదుముగాక ! శతాధిక శరత్తులునూ అట్లే జీవింతుము గాక !

ఇట్టి అర్థభావనతో - ఉపస్థాన మంత్రములను పఠించి గాయత్రీజపం ప్రారంభిస్తే చాలా చక్కటి ఏకాగ్రత కుదురుతుంది. దివ్యానుభూతి కలుగుతుంది.

## గాయత్రీ జపం

**ఓం భూర్భువః స్వః, తత్సవితుర్వరేణ్యమ్ ।**
**భర్గో దేవస్య ధీమహి । ధియో యో న ః ప్రచోదయాత్ ॥**

(యజు. 36-3)

**సంక్షిప్త భావార్థం :** హే సర్వవ్యాపక సర్వసంరక్షక సర్వేశ్వర ! హే సచ్చిదానంద స్వరూపా ! జగదుత్పాదక దేవ ! నీ దివ్యము వరేణ్యమునైన సకల క్లేశనాశక భర్గఃతేజమును మేము నిత్యము మా హృదయమున ధ్యానింతుము

గాక ! నీవు మా బుద్ధులను సదా సత్కర్మలయందు ప్రేరేపించి మా కన్నియు శుభములనే చేకూర్తువు గాక !

ఈ విధమైన అర్థభావనతో వీలైనంత ఎక్కువగా గాయత్రీజపం చెయ్యాలి. ఎంత ఎక్కువగా చేయగలిగితే అంత ఎక్కువగా ఫలితముంటుంది.

## పరమేశ్వర సమర్పణము

సంధ్యావందనంలో ఈశ్వర సమర్పణ ఒక భాగం. దీనిలో అహంకార నివృత్తికొరకు తాను ఇంతవరకు శ్రద్ధాభక్తులతో చేసిన సంధ్యాగాయత్రీజపాలను పరమేశ్వరున కర్పించటం జరుగుతుంది. ఇది అగ్నిహోత్రకార్యంలో 'ఇదం న మమ = ఇది నాది కాదు' అనుటవంటిది. ఈ సత్కర్మలవల్ల కేవలం ధర్మార్థకామమోక్షము లనెడి చతుర్విధ పురుషార్థములనే కోరుకోవాలి.

## సమర్పణ వాక్యములు

**హే ఈశ్వర ! దయానిధే ! భవత్ కృపయా అనేన జపోపాసనాది కర్మణా ధర్మార్థకామమోక్షాణాం సద్యః సిద్ధిర్భవేన్నః ॥**

**భావార్థం :** హే పరమేశ్వరా ! దయానిధే ! నీ కృపవలన మేము చేసిన ఈ జప ఉపాసనాది కర్మలవలన ధర్మార్థ కామమోక్షములు మాకు శీఘ్రముగా సిద్ధించును గాక!

ధర్మమంటే సత్యన్యాయాచరణము. అర్థమంటే – ధర్మపూర్వకంగా లభించే సుఖభోగ్యపదార్థాలు. కామమంటే – ధర్మ, అర్థములతో ప్రాప్తించిన పదార్థాలను భోగించగల భాగ్యం. మోక్షమంటే సమస్త దుఃఖాలనుండి విముక్తిని పొంది సదా పరమేశ్వరుని ఆనందంలో నుండు స్థితి. ఈ నాల్గింటిని సాధించటమే మన జీవిత లక్ష్యంగా ఉండాలనీ, అందుకొరకే పరమేశ్వరుడు మన కీ మానవ జన్మ యిచ్చాడనీ వైదికధర్మం చెబుతుంది.

## నమస్కార మంత్రం

సంధ్యోపాసన చివరభాగంగా ఈ క్రింది యజుర్వేదమంత్రంతో అంతర్యామికి నమస్కరించి సెలవు తీసుకోవాలి. ఇది వీడ్కోలు వంటిది.

ఓం నమః శంభవాయ చ, మయోభవాయ చ ।
నమః శంకరాయ చ, మయస్కరాయ చ ।
నమః శివాయ చ, శివతరాయ చ ॥ (యజుర్వేదం 16-41)

సుఖస్వరూపుడైన పరమేశ్వరునకు నమస్కారము. సర్వోత్తమ సుఖప్రదాతయైన ఈశ్వరునకు వందనములు. కల్యాణకారకుడగు దేవునకు నమస్కారము. ఉపాసకులను ధర్మయుక్త కర్మలలో ప్రేరేపించు పరమేశ్వరునకు వందనములు. మంగళస్వరూపునకు నమస్కారము. ఉపాసకులకు అత్యంత మంగళపదము (ముక్తి) నిచ్చు దేవదేవునకు వందనములు.

**ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః**

**హే సర్వసంరక్షకా ! మా ఆధ్యాత్మిక ఆదిభౌతిక ఆదిదైవిక దుఃఖముల నన్నిటిని శాంతింపజేసి రక్షించుము.**

**శమితి ఓ౩మ్**

# గాయత్రీ వైశిష్ట్య భజన

ఇది గాయత్రీ మంత్రం సర్వదుర్భావ హంత్రం
(గరీబోంకే సునో ఓ తుమారే సునేగా - సినీ గీతం మాదిరిగా)

రచన : ఆర్షకవి ప్రణవ కుమార్

ఓం భూర్భువః స్వః
తత్ సవితుర్ వరేణ్యాం
భర్గో దేవస్య ధీమహి
ధియో యోనః ప్రచోదయాత్

ఇది గాయత్రీ మంత్రం
సర్వ దుర్భావ హంత్రం ॥ఇది గాయత్రీ మంత్రం॥
తలచండు ! ఈ గురు మంత్రం
నర జన్మమే నడుమంత్రం ॥ఇది గాయత్రీ మంత్రం॥

అపూర్వమగు గాయత్రీ మంత్రము అక్షరాక్షరము పదపదము
అనంతోపదేశ ప్రపూరితము అత్యంత సారగర్భితము
ఈ మంత్ర భావనముచే – సుసంకల్ప జీవనముచే
ఈ మంత్ర సంస్మరణచే – తదనుగుణ్య ఆచరణచే
ఇహమందు అభ్యుదయమ్ము పరమందు నిఃశ్రేయసము ॥ఇహ॥
ముదమారగ ధ్యానించుడు ! దీనిని ఉదయమ్మున సాయంత్రం

॥ఇది గాయత్రీ మంత్రం॥

ఈ మంత్రమునే ఋసి వసిష్ఠు డిల శ్రీరామున కుపదేశించె
ఈ మంత్రమునే ఋషి సాందీపుడు శ్రీకృష్ణునితో పలికించె
ఈ మంత్రమునే ఆగస్త్యుడు హనుమంతునకు వినిపించె
ఈ మంత్రమునే నారదుడు ప్రహ్లాదునకు వివరించె
ఈ మంత్రమునే వాల్మీకి కుశలవులతో చెప్పించె ॥ఈ మంత్రం॥
ఈ మంత్రమునే తలచుడు ! ఎందుకు ఏ తాయత్తులు తంత్రం

॥ ఇది గాయత్రీ మంత్రం ॥

తన సుతయగు వైదేహికి దీనినే జనకుడు పలుకుట నేర్పించె
తన సతియగు మైత్రేయికి దీనినె యాజ్ఞవల్క్యుడు ప్రబోధించె
స్మరియించె నైలూషుండు ఇంతి ఇలూషా తనుజుండు
జపియించె జానశ్రుతుండు జాతిశూద్రుడగు నొక్కండు ॥జపియించె॥
సంకోచింపక స్త్రీలు శూద్రులును చదువుడు ! సర్వ స్వతంత్రం

॥ఇది గాయత్రీ మంత్రం॥

నిశ్శబ్దముగ నిర్మల ప్రదేశమున నిత్యము నియమిత సమయమున ఆసన
స్థిరులై ఈ మంత్రమును ఉపాసించినచో హృదయమున
చిత్త చంచలత మాన్పించు మనో నిశ్చలత కుదిరించు
బుద్ధి మాంద్యమును తొలగించు జ్ఞాన వికాసము కలిగించు
జన్మ బంధనము విడిపించు మోక్షసౌఖ్యమును ఇప్పించు ॥జన్మ బంధ॥
స్మరియించుడు ఈ మంత్రము కూలెదు వరకీ శరీరయంత్రం

॥ఇది గాయత్రీ మంత్రం॥

("వేదవీణ" – గ్రంథం నుండి – వారి సౌజన్యంతో)

# గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ప్రచురణలు

## సుమ్నార్థి డా॥ కోడూరి సుబ్బారావు గారి రచనలు

| | | |
|---|---|---|
| 1. | గాయత్రీ మహిమ | 30-00 |
| 2. | గాయత్రీ విజ్ఞానం | 100-00 |
| 3. | మన ఇతిహాసం | 70-00 |
| 4. | మన వేదశాస్త్రాల పరిచయం | 60-00 |
| 5. | అగ్నిహోత్రం 100 శాతం వైజ్ఞానికం | 60-00 |
| 6. | అగ్నిహోత్ర రాసాయనిక విశ్లేషణ | 30-00 |
| 7. | అగ్నిహోత్ర ఆధ్యాత్మిక స్వరూపము | 30-00 |
| 8. | గోమాత | 40-00 |
| 9. | వేదాలలో సూర్యకిరణ చికిత్స | 80-00 |
| 10. | వేదాలలోజలచికిత్సావిజ్ఞానం | 50-00 |
| 11. | పెండ్లినాటి ప్రమాణాలు | 40-00 |
| 12. | గర్భాధాన విజ్ఞానం | 50-00 |
| 13. | దౌహృదిని | 40-00 |
| 14. | మరణానంతరం జీవుని ప్రయాణం | 40-00 |
| 15. | మానవ ధర్మము | 40-00 |
| 16. | ఈశావాస్యమిదం సర్వమ్ | 35-00 |
| 17. | దేవుడు-జీవుడు-ప్రకృతి | 30-00 |
| 18. | వేదాలలో అశ్వనీ దేవతలు | 20-00 |
| 19. | సంధ్యావందనం-వైజ్ఞానిక సమాలోచన | 20-00 |
| 20. | జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ | 60-00 |
| 21. | వేదాల వెలుగుచూపే ఆర్యసమాజము | 30-00 |
| 22. | వైదిక జన్మదిన వేడుక | 30-00 |
| 23. | పండుగల పరమార్థం | 40-00 |
| 24. | వైదిక గృహప్రవేశ విధి | 30-00 |
| 25. | వేదాలలో వర్షేష్టి విజ్ఞానం | 25-00 |
| 26. | వైదిక క్రాంతి పథం | 30-00 |
| 27. | పురుషసూక్తము | 20-00 |
| 28. | వైదిక శాంతి పాఠం (వైజ్ఞానిక వ్యాఖ్య) | 20-00 |
| 29. | సృష్టికథ | 20-00 |
| 30. | సరస్వతీ సూక్తము | 10-00 |
| 31. | స్వతంత్ర సముపార్జనలో మహర్షి దయానందుడు | 10-00 |
| 32. | వైదిక సంస్కృతిలో వానప్రస్థాశ్రమము | 10-00 |
| 33. | గంగాధర శివుడు | 10-00 |
| 34. | ప్రణవస్తోత్రము | 10-00 |
| 35. | లక్ష్మీశాంతి సూక్తాలు (ముద్రణలో) | |
| 36. | వేదాలలో మనోవిజ్ఞానం (ముద్రణలో) | |
| 37. | వేదోపదేశాలు (ముద్రణలో) | |
| 38. | వైదిక సుప్రభాతం (ముద్రణలో) | |
| 39. | శివరాత్రి రహస్యము (ముద్రణలో) | |
| 40. | గణపతి రహస్యము (ముద్రణలో) | |
| 41. | వేదాలలో దేశభక్తి | 50-00 |

## ఇతర విద్వాంసుల రచనలు

| | | |
|---|---|---|
| 1. | మాతాపుత్రికల జ్ఞాన చర్చ | 60-00 |
| 2. | సత్యధర్మ విచారణ | 6-00 |
| 3. | స్వరాజ్య సంగ్రామములో ఆర్యసమాజము (ముద్రణలో) | |
| 4. | ధర్మవీర్ పం.లేఖారామ్ | 5-00 |
| 5. | వేదాలలో విజ్ఞానబీజాలు (ముద్రణలో) | |

**ముద్రణలో ఉన్నవి దాతలు లభించినపుడు ముద్రింపబడును**

Gayatri Series: 45

GAYATHRI VIGNANAM

Price: Rs. 100/-



వేదోద్ధారకులు, ఆర్యసమాజ సంస్థాపకులు

## మహర్షి స్వామి దయానంద సరస్వతి

(1824-1883)

*Published by:*

**Gayatri Ashram Trust**

12-10-586/6, Arya Samajam, Medi Bavi,
Seetaphalmandi (P.O.), Secunderabad - 500 061

Secretary - **K.P. Narsing Rao**, Cell: 9848011073.